# ప్రాయశ్చిత్తము

## రవీంద్రనాథ ఠాకూర్

కొరుమూరి వైకుంఠరావు
490 తిరువత్తూరు హైరోడ్
చెన్నపురి

మొదటి ముద్రణ 1000 కాపీలు 1947
రెండవ ముద్రణ 1000 కాపీలు 1951

వెల మూడు రూపాయలు

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
292 ఎస్ప్లనేడ్
మద్రాసు—1

# ప్రాయశ్చిత్తము

## మొదటి పరిచ్ఛేదము

అర్ధరాత్రివేళ. నడి వేసవి. గాలిలేదు. ఏ చెట్టునను ఒక్కా-కైనను గదలుచుండుట లేదు. యశోహారపురపు యువరాజు, ప్రతాపాదిత్యుని జ్యేష్ఠపుత్త్రుఁడు, ఉదయాదిత్యుఁడు, తన పడకగది కిటికీలోఁ గూర్చుండియుండెను. ప్రక్కను భార్య, సురమ, నిలిచియుండెను.

సురమ, "నాథా, సహించియుండుము, ఓర్మి విడువ-కుము. మంచిరోజు లెన్నఁటికైనను వచ్చితీరును," అనెను.

ఉదయాదిత్యుఁడు ప్రత్యుత్తరమిచ్చెను, "నేను వేఱు-సుఖమేదియుఁ గోరుచుండుట లేదు; నేను గోరునదంతయు ఈ రాజమందిరమున జన్మింపక యుండవలసినదనియు, నేను యువ-రాజునై పుట్టియుండక యశోహారపురములోని సామాన్య-సంసారులలో నతిసామాన్యుఁడనై పుట్టియుండవలసినదనియు; యశోహారపురాధిపతికి జ్యేష్ఠపుత్త్రుఁడనై, అతని ధనమానము-లకును, యశఃప్రభావములకును, ఏకైక యుత్తరాధికారినై యుండకపోవలసినదనియు. అతీతమునంతయు మార్పఁగల తపస్సేదైన గలదా సురమా ?"

సురమ మిగుల దుఃఖముతో నతనికుడిచేతిని తనచేతు-

లతోఁ బట్టుకొని యతనివైపు చూచుచు మెల్లగ నిట్టూర్పు విడిచెను. యువరాజుకోరిక నెఱవేర్చుటకుఁ దనప్రాణమును సులభముగ ధారపోయఁగలదు, కాని ప్రాణము నిచ్చియైనను భర్తకోరికను నెరవేర్పలేదు—ఇదియే యామెదుఃఖమునకుఁ గారణము.

"నాకు సుఖము లేకపోవుటకుఁ గారణము నేను రాజు-లింటఁ బుట్టుటయే సురమా!" అని యువరాజనెను. "రాజు-లిండ్లఁ బుట్టువారు బిడ్డలుకారు ఉత్తరాధికారులు. నేను రాజ్యమును, పేరుప్రతిష్ఠలను నిలువఁబెట్టుకొనఁగలనో లేనో యని నాన్న నన్ను చిన్నప్పటినుండియుఁ బరీక్ష చేయుచున్నాఁడు. నేను రాజ్యభారమును వహించుచు, వంశకీర్తిని ప్రజ్వలింపఁజేయఁగలనో లేనో యని మానాన్న భయము. నేను చేయు చిన్న చిన్నపనులను గూడ నతఁడు పరీక్షాదృష్టితోఁ జూచుచుండును, వాత్సల్యదృష్టితోఁ గాదు. బంధువర్గమువారును, మంత్రి వర్గమువారును, రాజసభాసద్గణమువారును, ప్రజలును నేను చేయు చిన్నచిన్నపనులను, నేనాడు చిన్నచిన్నమాటలను, మిక్కిలి జాగ్రత్తతోఁ బరిశీలించి చూచి నాభవిష్యత్తు నూహించుచుందురు. ఇట్టి యాపత్సమయమున రాజ్యమును గాపాడుశక్తి నాయందులేదని వారందరి యభిప్రాయము. నేను చేతకానివాఁడనఁట, నా కేమియు బోధపడదఁట! అందఱును నన్నుఁ దూలనాడుచున్నారు. నాన్న నన్ను జూచి యేవగించు కొనుచున్నాఁడు, నాయాశ పూర్తిగా వదలుకొన్నాఁడు."

సురమ కనుల నీళ్లు పెట్టుకొని, "ఆహా! ఎట్టిది వారి మనస్సు! వా రెట్లారీతి ననుకొనఁ గలిగిరో గదా!" అని యనెను. సురమకు దుఃఖమువచ్చి, కోపముతో నన్నది, "నీకు బోధపడదన్న వారికంటె బుద్ధిహీను లుండరు."

ఉదయాదిత్యుఁడు చిఱునవ్వు నవ్వి, సురమ బుగ్గలను నొక్కుచు కోపముచే నెఱ్ఱబడియున్న యా మెముఖము నతి-ముద్దుతో మెల్లఁగ కదలించి మరల నతిత్వరలో మొదటివలె గాంభీర్యమును వహించి యిట్లనెను—"అవును సురమా, రాజ్య పరిపాలనకుఁ గావలసినశక్తి నాలో లేకపోవుట నిజమే—ఆ పరీక్ష అయినది. నా పదుహారవయేట నాకు రాజ్యపరిపాలన నేర్పవలెనని యుద్దేశించి, మహారాజుగారు హాసేన్‌ఖాలీపర-గణాపాలన నా కొప్పఁజెప్పిరి. ఆఱుమాసములైనను బూర్తి కాక పూర్వమె గొప్ప చిక్కులు ప్రారంభించినవి. రాఁబడి తగ్గి పోయినది. ప్రజలు నన్నాశీర్వదింప మొదలు పెట్టిరి. ఉద్యోగస్థులు మహారాజుగారియొద్దకుఁ బోయి నాపై ఫిర్యాదుచేసిరి. యువరాజుగారు ప్రజల కింత ప్రియమగుట చూచి అతఁడు రాజ్యపరిపాలనముచేయ ససమర్థుఁడని నిర్ధారణచేసిరి. అప్పటి నుండి మహారాజుగారు మనస్సిచ్చి నాపై నెన్నఁడును జూడనైన లేదు. నేను వంశమునకుఁ గళంకమనియు, ఆయన పినతండ్రి వసంతరాయలవలె నేనును వీణవాయించు కొనుచు, నాట్యముచేయుచు, దిరుగుచుందుననియు, నా చేతపడి

నచో రాజ్య మధోగతిపాలౌననియు మహారాజుగా రను-
చుండిరి."

"సహించి యుండుము, ప్రియతమా! ఓర్మి వదలకుము,"
అని సురమ యనెను. "ఏమైనను ఆయన నీతండ్రియే కదా!
రాజ్యాభివృద్ధియే అతని కోరిక, ఇప్పు డాయనహృదయమునఁ
బ్రేమకు స్థానము లేదు, రాజ్య మభివృద్ధి చెందినకొలఁది ప్రేమ
యధికమగుచుండును."

"సురమా, నీబుద్ధి తీక్ష్ణమైనది, నీవు దీర్ఘదృష్టి కల-
దానవు; కాని యీవిషయమునమాత్రము నిజము తెలిసికొన-
లేకున్నావు. ఆశకు మితిలేదు; రాజ్యము పెద్దదగుచున్నకొలఁది
ఆ రాజ్యము పోవునేమోయను భయముకూడ నాన్న కధిక
మగుచుండును, రాజ్యభారము హెచ్చగుచున్నకొలఁదిని నేను
పనికిమాలినవాఁడ ననునభిప్రాయము దృఢపడుచుండును."

సురమ కిది బోధపడకపోలేదు, కాని యాశమాత్రము
వేరువిధముగ నుండెను—ఆశ యెల్లప్పుడును బుద్ధికి లోఁబడి
ఉండదుకదా! 'నా కోరిక యేల నెరవేరకూడదు?' అని సురమ
తనలోఁ దా ననుకొనుచుండెను.

"ఎటు చూచినను బ్రజలు నాయెడల జాలి చూపు
చుండిరి. ఎక్కడికిఁ బోయినను నెగతాళి చేయుచుండిరి. ఇది
సహించి యూరకుండలేక అప్పుడప్పుడు మా తాతగారియొద్దకు,
రాయగడకుఁ, బోవుచుంటిని. నాన్నగారు నాకొఱకు బాగుగా
వెదకించుటయైనను లేదు......ఆహా, ఏమి యాభేదము,

అచ్చటికిని ఇచ్చటికిని! అచ్చట నెటుఁచూచినను జెట్లుచేమలు. ఆగ్రామస్థుల చిన్న గుడిసెలలోనికి నేనుఁ బోవుచుండెడివాఁడను, అక్కడ రాత్రింబవళ్లు రాజవేషము దాల్చియుండ నవసర ముండునది కాదు. అదికాక, తాతయ్య దృష్టిపారినంత మేర ఎట్టి చింతకుగాని గాంభీర్యమునకుగాని తావుండ నేరదని నీవెఱుఁ-గుదువు కదా! తాతయ్య నలుదిక్కులను తన యాటపాటలతో నింపుచుండును; ఎటుచూచినను ఉల్లాసము, సద్భావము, శాంతి. అచ్చటికిఁ బోయిన మాత్రమున యశోహరపుర యువరాజునని మఱచుచుండును—ఆహా ఎట్టి యానందకరమైన దా మఱపు!

ఆహా, మఱపన నదియే మఱపు—చివర కొకనాఁడు నాకుఁ బదునెనిమిది సంవత్సరములు వచ్చినవి. రాయగడలో నాలుగుదిక్కులను వసంతవాయువులు వీఁచుచుండెను. ఎటు-చూచినను బచ్చని కుంజవనములు. అట్టి సమయమున రుక్మిణి నాకంటఁబడ్డది."

" ఈ మాట పలుమార్లు వినియున్నాను," అని యన్నది సురమ.

ఉదయాదిత్యుఁడు, "మఱియొకమాఱు వినుము సురమా! ఒక్కొకప్పు డేదోయొకమాట మనహృదయమధ్య-మునఁ బ్రవేశించి యమితబాధను గలుగఁజేయుచుండును; దాని నణఁచియుంచినచో జీవించియుండుట కష్టమగును. ఆవిషయము నీతోఁ జెప్పుట కిప్పటికిని నాకు లజ్జయగుచున్నది, కష్టమగుచున్నది ; కనుక నే మాటిమాటికి నీతోఁ జెప్పుచుండును.

ఏనాఁడు నాకు సిగ్గుపోవునో, యేనాడు నాకుఁ గష్టము కలుగదో యప్పుడే నా ప్రాయశ్చిత్తము పూర్తియైనదని భావించి, యటుపైని నీతో నావిషయమై ప్రసంగించుట మాను కొందును."

సురమ, "ఏల నీకు ప్రాయశ్చిత్తము నాథా? నీవు పాపమేదైన చేసియుండినయెడల ఆతప్పు నీదికాదు పాపానిది. నేను నిన్నెఱుఁగ ననుకొంటివా? పరమాత్ముఁడు నీ హృదయము నెఱుఁగఁడా?"

ఉదయాదిత్యుఁడు మరలఁ జెప్పనారంభించెను. "రుక్మిణి నాకంటె మూఁడుసంవత్సరములు చిన్నది, విధవ, ఏకాకిని. తాతయ్యకృపవల్ల రాయగడలో నామెకు నివాసస్థలము దొరకినది. ఆమె నన్నేమాయలమూలమునఁ దనదగ్గఱకు లాగుకొనఁగలిగినదో ఇప్పుడు చెప్పఁజాలను. అప్పుడు నాహృదయ మందున్నవి మధ్యాహ్నకిరణములు; ఉజ్జ్వలకాంతివలన దేనినైన చేక్కఁగఁ జూడఁజాలకుంటిని; ప్రపంచము భరింపరాని తళుకుగల యావిరితో నిండియున్నట్టు కానవచ్చుచుండెను. నా దేహములోని రక్తమంతయు శిరస్సున కెక్కినట్టుండెను. ఆశ్చర్యకరమైనదిగాని యసంభవమని తోఁచునదిగాని యెచ్చటను నేదియు లేకుండెను. ఏదిక్కునఁ జూచిన నొక్కరీతిగనే యుండెను. ఏదారి చూచినను నొక్క విధముగనే యుండెను. అంతకుఁ బూర్వ మెన్నఁడును నాకట్టి యనుభవము కలుగలేదు. అటు పిమ్మట కూడ కలుగలేదు. ఆ

ఒక్క దినమున మాత్రము బుద్ధి బలములేని నాక్షుద్ర హృదయమునకు సమస్తజగత్తును అట్లు ప్రతికూలము చేయుటలో జగదీశ్వరున కెట్టి యుద్దేశముండెనో అతఁడే ఎఱుఁగవలెను. ఒకనిమిషకాలము విశ్వమందలి చరాచరములన్నియు నేకమయి నన్ను దప్పుదారిని బెట్టినవి. ఒక్కనిమిషముపాటు మాత్రమే, అంతకెక్కువ లేదు. కాని ఆయొక్క నిమిషములో బాహ్యప్రపంచమునుండి వచ్చిన భయంకరమైన యాఘాతమొకటి నాహృదయమునకుఁ దగిలినది, నాక్షుద్రహృదయము వ్రేళ్లు తెగి కూలి పడినది. మరల నేను మట్టినుండి లేచుసరికి ధూళితోను మురికితోను నిండియుంటిని—ఆ ధూళి యెంత తుడిచినను పోకున్నది, ఆ మురికి యెంతకును వదలకున్నది. నే నెట్టిపాపము చేయుటచేతనో గదా ఈశ్వరుఁడు నాశుభ్రతను కాలిమతో నిట్లు నింపినాఁడు, నాపగటిని రాత్రిగాఁ జేసినాఁడు! ఆ నాఁడు నాహృదయపుష్పవనమున నుండు మాలతి మొగ్గలు, జాజి మొగ్గలు సిగ్గుఁజెంది ముఖములు మాడ్చుకొన్నవి."

ఇట్లు మాటలాడుచుండఁగనే యుదయాదిత్యుని తెల్లని ముఖ మెఱ్ఱనైనది, క్రిందికి వ్రాలియున్న కన్నులు మఱింత నద్దమైనవి, తలనుండి పాదములవఱకు మెఱపు వలె గగుర్పాటు గల్గెను. సురమహృదయము సంతోషముతోడను, గర్వముతోడను, దుఃఖముతోడను నిండినది, "ఆ ప్రసంగ

మీకేం జాలింపుము, అట్లింకను జెప్పిన నన్ను చంపుకొని తిని నట్లే," యని యామె ఒట్టుపెట్టినది.

ఉదయాదిత్యుఁడు—"మెల్ల మెల్లఁగ రక్తము శీతల-మయ్యెను. చుట్టుప్రక్కలనుండు నన్నిటిని వానివాని నిజపరిమాణములలోఁ జూడఁగలిగితిని. తిరుగుచున్నతలయు, నెత్తుపారినకన్నులును, వేడియెక్కిన యొడలునగల త్రాఁగుఁ-బోతునకుఁ గనఁబడునటుల సృష్టియంతయుఁ దిరుగుచు మేఘా-చ్ఛన్నమైనట్లు కనఁబడుటకు మాఱుగఁ దనస్వాభావికరూప-మును మరలఁ దాల్చినది. అప్పుడు నాయవస్థ యెట్టిదో యూహింపఁగలవా సురమా! ఎచ్చటనుండి పడితిని. ఎచ్చట పడితిని! శత సహస్ర లక్షక్రోశములలోఁతుగల పాతాళ-గహ్వరమందుఁ బడితిని ; అంధకారమయమైన నడురేయియందు రెప్పపాటులోఁ బడిపోతి . తాతయ్య మిక్కిలి ప్రేమతో నన్ను బిలిచెను. నాముఖ మెతని కప్పు డెట్లు చూపఁగలిగితినో కదా ? కాని యప్పటినుండి నేను రాయఁగడ విడువవలసివచ్చెను. తాతయ్య నన్ను విడిచియుండలేక నాకొఱకు కబురు పంపు చుండెను, కాని మిగుల భీతిజెందియుండుటచేత నే నచ్చ టికిఁ బోలేకుంటిని. నన్నును మాచెల్లెలు విభను చూచుటకై తాతయ్య తానే స్వయముగ మాయొద్దకు వచ్చుచుండెను— ఆయన కెట్టి గర్వము లేదు, ఎట్టిపౌరుషము లేదు. నేనెంగు కచ్చటికిఁ బోలేకయుంటినని యాయన న న్నడుగనె నను

లేదు. మమ్ములను జూచి మాతో ఆటపాటలలోఁ గొంతకాలము గడపి మరలఁ బోవుచుండువాఁడు."

ఉదయాదిత్యుఁడు చిఱునవ్వు నవ్వి ప్రేమ తోడను మార్దవముతోడను నిండియున్న పెద్దపెద్దకన్నులతో సురమ ముఖమువైపు చూచెను. భర్త తరువాత అనఁబోవుచున్నది పోల్చుకొని సురమ ముఖము వాల్చుకొని, కొంచెము తడబడుచుండెను. ఉదయాదిత్యుఁడు తన చేతులను సురమ చెక్కిండ్లపై నుంచి, వ్రాల్చుకొనియున్న యామెముఖమును మెల్లఁగఁ బైకెత్తెను; మఱికొంచెము దగ్గఱగా వెళ్లి యాముఖమును దన భుజముపై నుంచుకొని, యెడమచేయి నామెవీపుపై వేసి యామెనుపట్టుకొని తనలో పుట్టుచుండు గాఢప్రేమ వ్యక్తమగునట్లు ముద్దుపెట్టుకొని యిట్లనెను—

"తరువాత ఏమయినదో చెప్పఁగలవా సురమా? నాయెదుట నొక నిర్మలమైన ముఖ ముదయించినది—ఆ ముఖము బుద్ధితో దేదీప్యమానమైనది, అనురాగముచే కోమలత గాంచినది, నవ్వుతో నుజ్జ్వలమైనది—అట్టి ముఖ మెచ్చటనుండి వచ్చి నాయెదుట నుదయించినదో చెప్పఁగలవా? నాగాఢాంధకారము భేదింపఁగలశక్తి నీలోనుండునని నేనూహింపఁగలిగితినా సురమా? నాగాఢాంధకారము పోవుననునాశ నాకుండెనా? నీవు నా యుషాదేవివి; నాకాంతివి, నాయాశవు. ఏమంత్రములవలన నాచీఁకటిని తొలఁగించితివి సురమా?"

యువరా జిట్లనుచు మాటమాటకు సురమను ముద్దు-పెట్టుకొనుచుండెను. సురమ ఏమియు ననలేదు, ఆమెకన్నుల-వెంబడి యానందబాష్పము లొలుకుచుండ యువరాజు మరల చెప్పుట మొదలు పెట్టెను—

"ఇంతకాల మయినతరువాత నాకు నిజమైన యాశ్ర-యము దొరకినది. నేను బుద్ధిహీనవాఁడను గాను అని నీ నోటినుండియే మొట్టమొదట వింటిని, నే నామాటనే నమ్ము-చున్నాను, అది నీవలననే తెలిసికొంటిని. బుద్ధి యెత్తుపల్లములు గలిగి, వంకరటింకరగాఁబోవు సన్నని చీఁకటిసందువంటిది కాదు; అది చక్కని రాజమార్గమువలె సరళమైనది, ఎత్తుపల్లములు-లేనిది, ప్రశస్తమైనది యని నాకు చెప్పినది నీవే. మునుపు నాయెడల నాకే నిరసన, నాయెడల నాకే యెగతాళి. ఎట్టిపని చేయుటకును నాకు సాహసము లేకుండెను—మన స్సొకప్రక్క-నుండి, 'ఇది సరియైన మార్గము,' అని చెప్పుచుండినను, మఱియొక ప్రక్కనుండి 'ఇది సరియైనది కాదేమో,' యని వినఁబడుచుండెను. ఎవరెట్లు నాయెడల వ్యవహరించుచుండినను, సహించి యూర కుండుటయే నా కలవాటై పోయినది—యోచించుటకైనను ప్రయత్నింపకుంటిని. కాని, నాలో కేవల మేమియు లేకపోవుట లేదని యిప్పుడు పోల్చుకొంటిని, నేనుకూడ మానవుఁడనే యని తెలిసికొన్నాను. మూలనున్న నన్ను నీవు కనిపెట్టి-నావు ఆ యావిష్కరణము నీమూలముననే జరిగినదిసురమా, నాకు మంచిదని తోఁచుదానిని చేయుటకు ఇప్పుడు నాలో

ఉత్సాహము పుట్టుచున్నది. నీకు నాలో నమ్మకముండుటచే నాకుగూడ నాలో నమ్మకము కల్గినది. నన్నుఁగూడ బలవంతునిగఁ జేయఁగలబల మీసుకుమారశరీరమున నెక్కడ దాగియున్నదో కదా!”

అమితనిశ్చయముగా సురమ భర్తపై రెండుచేతులను వేసి అతనిని తనపై నొక్కి పట్టుకొనుచు సంపూర్ణముగ నాత్మసమర్పణము చేయఁగోరు దృష్టితో నతని ముఖమును చూడసాగెను. మాటలతో నామె యేమి యనలేదు, కాని యామె కన్నులు మాత్రము, “నాకు నీవు తప్ప మఱి యెవరును లేరు, కనుకనే నాకు సమస్తము నున్నది,” యనుచుండెను.

ఉదయాదిత్యుఁడు చిన్ననాఁటినుండి యింటివారి యనాదరణయు, ఉపేక్షయు, సహించుచు వచ్చెను. మధ్యమధ్య నొకొక్కనాఁడు నిశ్శబ్ద నిశీథసమయమున సురమకడకుఁ బోయి యిదివఱకెన్నోమాఱు లామెతోఁ జెప్పియున్న తన జీవితచరిత్రను సోపానములుగఁ జేసి భాగభాగములుగ విభజించి యామెతోఁ జెప్పుచు నానందించుచుండెను.

“ఈవిధముగ నింక నెంతకాలము గడపవలసియుండునో గదా, సురమా?” అని యుదయాదిత్యుఁ డనెను; “అవతల రాజసభాసదులు నన్నుజూచి జాలిపడుచున్నారు, ఇవతల నిన్ను మాయమ్మ పలువిధముల నవమానపఱచుచున్నది ; నౌకర్లు, దాసీలు—ఎవ్వరును నీమాట లక్ష్యపెట్టరు. గట్టిగా నెవరిని నేనేమియు ననలేకున్నాను ; సమస్తమును సహించి యూర

కుండుటయే నేను చేయఁగలపని. పౌరుషము గలదానవైనను నామూలమున నీవు సహించి యూరకుండవలసివచ్చుచున్నది. నావలన నీకు సుఖము కలుగుట లేదు, దుఃఖము, అవమానము మాత్రము కలుగుచున్నవి, నిన్ను నాకిచ్చి పెండ్లిచేయక పోవలసినది!"

సురమ—"అట్లనుచున్నా వేమి నాథా ? యిట్టిసమయమునసే సురమ యవసరము! సుఖమనుభవించుచున్నప్పుడు నీకు నావలన నేమి ప్రయోజనము ? సుఖసమయమందు సురమ కేవలము విలాసద్రవ్యమే కదా, ఆటవస్తువే కదా! నీసేవ చేయుచుండుటచేత నన్నిదుఃఖములను మఱవఁగలిగి, నీకొఱకు దుఃఖించుటవలనఁ గలుగు నానందమును మాత్ర మనుభవింపఁగలుగుచున్నాను. కాని నీ దుఃఖము పూర్తిగాఁ దీసికొనలేకున్నందుకు నాకు బాధ కలుగుచున్నది."

యువరాజు కొంచెము సేపూరకుండి యిట్లనెను, "నావిషయమై యాలోచించుచు నేను దుఃఖించుచుండలేదు, నాకంతయు అలవాటయిపోయినది. కాని నావలన నీ వవమానము పొందవలసివచ్చుచున్నది. నేను దుఃఖించుచున్నప్పుడు దొడ్డయిల్లాలివలె నీవు నాకు మనశ్శాంతి నిచ్చినావు, నేను యలసియున్నప్పుడు నాకు విశ్రాంతినిచ్చినావు కాని యుత్తమ పురుషునిధర్మానుసారము నీ కవమానము కలుగకుండ నిన్ను నేను కాపాడలేకున్నాను. మాతండ్రి శ్రీపురపు రాజ్యాధిపతి మా నాన్న యాధిపత్యమును శిరసావహింపలేదు; కావున ని న్నాద-

రించి తన యాధిక్యము నిలుపుకొనలేనని మానాన్న నిశ్చయించినాఁడు. యువమానవిషయమై విచారించుకొనఁడు, నిన్ను కోడలుగాఁ దన యింటికిఁ దీసికొనివచ్చుటయే చాలునని యాతని అభిప్రాయము. ఇఁక సహింపలేనని యొకొక్కమాఱు నాకు తోఁచుచున్నది, సర్వమును వదలి నిన్ను దీసికొని ఎక్కడికైనను పాఱిపోవలెనని బుద్ధిపుట్టుచున్నది; కాని నీవు నన్నుఁ బట్టుకొని కదలనీయకున్నావు."

చాల రాత్రియైనది, సంధ్యతారలు మునిఁగిపోయినవి, అర్ధరాత్రి నుదయించు నక్షత్రము లాకాశమందుఁ గనఁబడుచున్నవి. సింహద్వారమున పహరాసిపాయిల యడుగులచప్పుడు వినఁబడుచున్నది. ప్రపంచమంతయు నిద్రించుచున్నది. నగరమున దీపములన్నియు నారిపోయినవి. ఇండ్లతలుపులు వేసియున్నవి. ఉండియుండి వినఁబడుచుండిన నక్కలకూతలుతప్ప మఱియేజంతువుల యలుకుడును లేదు. ఉదయాదిత్యుని పడకగది తలుపులు మూయఁబడియున్నవి. అప్పుడకస్మాత్తుగా నాతలుపులమీఁద నెవరో గ్రుద్దినట్లయినది. యువరాజు కలవరపడి తలుపులు తెఱచెను "ఏమి విభా, ఇంతరాత్రివేళ నిట్లు వచ్చుటకుఁ గారణమేమి?" యని బయటనున్న విభనుజూచి ఉదయు డడిగెను.

విభ యుదయాదిత్యుని చెల్లెలు. "ఎంతలో ఇంత ప్రమాదము వచ్చిపడ్డది!" యని గడిబిడపడుచు నామె యనినది; అది విని సురమయు నుదయాదిత్యుఁడు నొక్కమాఱుగ, "ఏమయినది విభా?" అని యడిగిరి. భయముతో వణఁకుచు

విభ వారితో మెల్ల మెల్లఁగ నేమో చెప్పుచు మఱి చెప్ప లేక యేడ్వనారంభించి, "ఏమి కాఁబోవుచున్నదన్నయ్యా ?" యని అన్నది.

"అక్కడైన నేను వెళ్లుచున్నానమ్మా" యని యనచు, నుదయాదిత్యుఁడు వెళ్లఁబోవుచుండ, "నీవు వెళ్లవద్దన్నయ్యా, నీవు వెళ్లవద్దు," అని యనుచు చెల్లె లడ్డువచ్చెను.

ఉదయాదిత్యుఁడు—"ఏమి విభా ?"

విభ—"ఆసంగతి తెలిసినయెడల నాన్నకుఁ గోపము రావచ్చును !"

ఉదయాదిత్యుఁడు—"ఛా ! యిప్పుడది యాలోచింప-వలసిన సమయమా విభా ?"

ఉదయాదిత్యుఁడు దుస్తులు వేసికొని మొలను బాకు దోపి వెడలఁబోవుచుండ, "అన్నయ్యా, నీవు వెళ్లకుము, మఱి యెవరినైనఁ బంపుము, నాకు భయము వేయుచున్నది," అని విభ యన్న చేయి పట్టుకొన్నది.

"అడ్డుపెట్టకుమమ్మా చెల్లీ, మఱి వ్యవధి లేదు." అనుచు ఉదయాదిత్యుఁడు బయటికి వెళ్లిపోయెను.

"నాన్న కీసంగతి తెలిసినయెడల ఏమగునో కదా వదినా ?" అని విభ సురమచేయి పట్టుకొని యనెను.

సురమ "మఱేమి కాఁగలదు! తరువాయేమియును లేదు. వీరవంత ప్రేమ మిగిలియున్నదో అదిపోయినను నష్టము లేదు విభా ".

"లేదు వదినా, నాకు చాల భయముగా నున్నది, నాన్న హాని చేయవచ్చును, గొప్ప శిక్ష విధింప వచ్చును!"

సురమ పెద్దనిట్టూర్పు విడిచి, "లోకములో సహాయము లేనివారికి భగవంతుఁడే సహాయము," అనుచు, "తండ్రీ, నీనామమున కెట్టికళంకమును రానీయకుము, నావిశ్వాసమునకు భంగము కలుగనీయకుము!" అని ప్రార్థించెను.

## రెండవ పరిచ్ఛేదము

మహారాజా, ఆపనివలన ఏమిమేలు" యని మంత్రి యనెను.

"ఏ పని" యని ప్రతాపాదిత్యుఁ డడిగెను.

మంత్రి—"నిన్న మీరు సెలవిచ్చినది."

"నేను సెలవిచ్చిన యే పని?" అని చీకాకుపడుచు రాజడిగెను.

మంత్రి—"మీ పినతండ్రిగారి—"

"మాపినతండ్రి ఏవిషయమై ఏమిటి?" అని మఱింత విసుగుకొనుచు రాజడిగెను.

"వసంతరాయలు యశోహారమునకు వచ్చుదారిలో ఆ చెఱువుగట్టున విశ్రమించుచుండఁగా—

ప్రతాపా ఁడు కన్నులు చిట్లించుకొనుచు అప్పుడు—? మాట పూర్తిచేయలేవా?" యనెను.

మంత్రి- —"ఇద్దఱు పఠాను లచ్చటికి వెళ్లి—"

రాజు— "వెళ్ళి—?"

మంత్రి—"వెళ్లి ఆయనను చంపవలెను."

ప్రతాపాదిత్యునికి కోపము వచ్చి, "మంత్రీ, నీవు హఠాత్తుగా చంటిపిల్లవాఁడ వయిపోతివి, ఏసంగతియైన తెలిసి-కొనవలెనన్న పదిప్రశ్నలు వేయవలెనా?" యని యనెను.

"నోటితో ననుటకు భయ మగుచున్నట్లున్నది! రాజ్యకార్య-ములనుగుఱించి యాలోచించువయస్సు దాఁటిపోయినది కాఁబోలు, పరలోకచింత చేయవలసిన వయస్సు వచ్చినట్లున్నది. అట్లైన మంత్రిపదవినుండి విముక్తునిగఁ జేయుమనికోరుకొన-కున్నావా ?"

మంత్రి—"నే ననునది మీకు బాగుగ బోధపడ లేదు మహారాజా."

ప్రతాపాదిత్యుఁడు—"చక్కఁగ బోధపడినది కాని నేనొక్క ప్రశ్న యడిగెదను,జబాబు చెప్పుము—నేను చేయు-టకు సంసిద్ధునిగ నున్న పనిని నోటిమాటలతో వర్ణించుటకైనను నీకిష్టము లేక యుండుటకుఁ గారణమేమి ? ఏదో సరియైన కారణము లేక యట్టిపనిచేయుట కాజ్ఞాపింపనని మీరాలోచింప కుండుటేల? దాని ధర్మాధర్మముల విషయమై నేను చక్కఁగ యోచించియుందునని మీ రూహింపకున్నారేమి?

మంత్రి—"చిత్తము మహారాజా, నేను—"

ప్రతాపాదిత్యుఁడు—"నోరుమూయుము, నేను జెప్పున-దంతయు ముందు వినుము. నే నా పని చేయుదునని చెప్పి-నప్పుడు,—నేను మా పినతండ్రినిచంపుటకు సిద్ధపడినప్పుడు,—నేను దానివిషయమై మీయందఱికంటె బాగుగ యోచించి-తిని. ఇందులో నేమియు నధర్మము లేదు, నే నొకఘనమైన వ్రతమును పట్టియున్నాను; మ్లేచ్ఛులు మన దేశమునఁ బ్రవే-శించి, యనాచారము విస్తరింపఁజేయుచున్నారు, వారి దుర్మార్గ-

ప్రవర్తనములవల్ల మన సనాతనహిందూమతము మంటఁగలసి-పోవుచున్నది. క్షత్రియులు తమకన్యకలను మొగలాయిల కిచ్చి పెండ్లిచేయుచున్నారు, మన హిందువులయాచారము లడుగంటుచున్నవి. మ్లేచ్ఛులను తఱుముఁగొట్టి, ఆర్యుల-మతమును రాహుగ్రాసమునుండి తప్పించుట నాకర్తవ్యము. ఈవ్రతము నెఱవేర్చుకొనవలెనన్న గొప్పబలము కావలసి-యున్నది. అందుకై మనదేశమందుండు రాజులందఱును నాయాధిపత్య మంగీకరించి నాతో నేకము కావలెనని నాకోరిక. యవనులమిత్రులైన రాజులందఱిని నాశముచేయక ఈకార్యము నెఱవేఱదు. మా పినతండ్రి వసంతరాయలు పూజింపఁదగినవాఁడు కావచ్చును. కాని నిజము చెప్పుట తప్పుకాదు గనుక నిజము చెప్పెదను వినుము. ఆయన మా వంశమునకు కళంకము. తాను మ్లేచ్ఛుల దాసుఁడ నని అనుచుండుట కతఁడు సంకోచింపకున్నాఁడు. అట్టివానితో నా కెట్టి సంబంధమును ఉండకూడదు. చేతికి పుండయినచో చేతిని నఱికివేయఁగలబలము నాకున్నది. రాయలవంశమునకును, మనదేశమునకును పుండైన యీవసంతరాయల నఱికిపాఱవైచి మనదేశమును, రాయలవంశమును రక్షింపవలెనని నా సంకల్పము."

మంత్రి— "ఈవిషయములో మహారాజుగారిమతము, నామతము నెన్నఁడును భిన్నములు కావు."

ప్రతాపాదిత్యుఁడు—"ఆహా, భిన్నములుగానే యుం-

డెను. నిజము చెప్పుము మంత్రీ, భిన్నములు కావా? ఇప్పటికిని భిన్నములే! వినుము మంత్రీ! ఏవిషయములోనైనను నీ యభిప్రాయము నాయభిప్రాయముతో సరిపోనప్పుడు నీయభిప్రాయము నాకుఁ దెలియఁజేయుచుండవలెను. నీ కట్టి సాహసము లేనప్పుడు నీ వా పదవికి తగవు. నీకెట్టి సందేహమున్నను నాకుఁ దెలియఁ జేయుచుండవలెను. నాయభిప్రాయములను, ఉద్దేశములను బోధపఱచుటకు నాకవకాశ మిచ్చుచుండ వలెను. పినతండ్రిని జంపుట యెప్పుడైనను తప్పే యని నీయభిప్రాయము—'కా' దనకుము మంత్రీ! నీవు నిజముగా అట్లే యనుకొనుచున్నావు. నేను దానికిఁ దగినసమాధానము చెప్పగలను ; తండ్రి కోరిక ననుసరించి భృగుఁడు తల్లిని వధించుట ధర్మమైనచో మతము కొఱకు నేను నాపినతండ్రిని జంపుటలో తప్పేమున్నది ?

ఈ విషయములో అనఁగా ధర్మాధర్మములవిషయములో—నిజముగనే మంత్రికి స్పష్టమైన యభిప్రాయము లేవియును లేవు. నిజముగ రాజుకంటె మంత్రిదే అధోగతి. ఈవిషయములో తాను రాజుగారితో నేకీభవింపక కొంచెము శంకోచించుచు మాట్లాడినచో రాజుగారు అప్పటిమట్టుకు కోపగించినను తుదకు సంతోషింతురని మంత్రి బాగుగ నెఱుఁగును. అట్లుచేయకున్న నెప్పుడో యొకనాఁడు రాజుగారికిఁ దనపై సందేహమును, అవిశ్వాసమును కలుగవచ్చునని మంత్రి నమ్మకము.

"ఈ వార్త వినినచో డిల్లీపురాధీశ్వరునికి కోపము రావచ్చునని నేను చెప్పఁబోవుచుంటిని," అని మంత్రి యనెను.

ప్రతాపాదిత్యుఁడు కోపముతో మండిపడుచు నిట్లనెను, "హాఁ! హాఁ! కోపపడవచ్చును! కోపపడు నధికార మందఱికిని గలదు. కాని డిల్లీపురాధీశ్వరుఁడు నా యీశ్వరుఁడు కాఁడు! అతనికోపము చూచి గజగజ వణఁకువారు పృథ్విలో ననేకు లున్నారు—మానసింహుఁడున్నాఁడు, వీరబలుఁ డున్నాఁడు, రాయ లనేకు లున్నారు, నీవుకూడ అట్టివారిలో నొకడవని నా కిప్పుడు తెలిసినది. కాని 'ఆత్మవత్ సర్వభూతాని' అనుకొనకుము."

"చిత్తము మహారాజా, నేనుమాత్రము వట్టి జడిపింపు లకు నంతగా లొంగువాడను కాను; కాని ఆ జడిపింపులతో పాటు కత్తి, డాలు లున్నయెడల కొంచెము యోచింపఁదగిన విషయము గాదా! డిల్లీపురాధీశుని కోపమున కర్థము ఏఁబది వేల సైన్యము," అని మంత్రి నవ్వుచు ననెను.

దానికి సరియైన జబాబు నీయలేక మహారాజా, "డిల్లీ-రాజుపేరు చెప్పి నన్ను జడిపించి, నేను చేయఁదలఁచుకొన్నపని నాపవలెనని ప్రయత్నింపకుము మంత్రీ, నాకు దానివలన నవమానము గలుగును," అని యనెను.

మంత్రి—"ప్రజలకుఁ దెలిసినయెడల వారేమందురు?"

ప్రతాపాదిత్యుఁడు.—"ప్రజలకుఁ దెలిసినప్పుడు కదా?"

మంత్రి—"ఇట్టి పని చాలకాలము దాఁగియుండదు. ఇది తెలియఁగానే సమస్తదేశమును మీకు శత్రు వగును. ఏది నెఱవేర్చుట కీపని చేయఁదలఁచుచున్నారో అది సమూలముగ నాశనమగును, ప్రజలు మిమ్ములను జాతిచ్యుతులనుగఁ జేసెదరు, మీ రనేకములైన బాధలకోర్చి యుండవలసివచ్చును."

ప్రతాప ఁడు—" చూడుము మంత్రీ, నీతో మరలఁ జెప్పుచున్నాను, నే నేపనిచేసినను బాగుగ నాలోచించక చేయను. కనుక నే నేదైన చేయునప్పుడు నన్ను భయపెట్టి యాపని విడిచిపెట్టింపఁ బ్రయత్నింపకుము; నేను చంటిపిల్లవాఁడను గాను. అడుగడుగునకును అడ్డువచ్చి నాకు శృంఖలమై యుండుటకు నిన్నుంచలేదు."

మంత్రియేమియు మాటాడలేదు. రాజేగారు అతని కిచ్చిన యాదేశములు రెండు—అతనికిని ప్రభువునకును మతభేదమున్నప్పుడు అది స్పష్టముగ తెలియఁజేయవలెననునది మొదటిది. రెండవది, తన భిన్నాభిప్రాయమును వ్యక్తపఱచి రాజుగారిని నిరుత్సాహపఱపఁగూడదని. ఈ రెంటిని సమాధానపఱచుట యెట్లో మంత్రి యీనాఁటివఱకును దెలిసికొనలేకున్నాఁడు.

కొంచెమునే పాగి మంత్రి మరల—"మహారాజా, ఢిల్లీపురాధీశుఁడు—" అని ప్రారంభించుచుండ ప్రతాపాదిత్యుఁడు రౌద్రుఁడై, "మంత్రీ, నీవు ఢిల్లీపురాధీశునినామము

రోజున కెన్ని తడవు లనుచున్నావో, అన్నిమాఱు లీశ్వరుని-స్మరించినచో నీకు పరలోకమున సులభసాధ్యమైయుండును," అనెను. "నేను చెప్పినపని పూర్తిచేయ నంతసేపు నీనోటివెంట డిల్లీ రాజుపేరు రానీయకుము. ఆపని నెఱవేరినట్లు ఈసాయంకాలము కబురు తెచ్చి, పిమ్మట నా చెవిదగ్గఱ ఆనాదము నీ మనసార స్మరించుము, అంతవఱకు మనస్సును కట్టిపెట్టియుంచు-టకుఁ బ్రయత్నింపుము."

మంత్రి కొంచెమునే పూరకుండి, ఈమాఱు డిల్లీ రాజుమాట ఎత్తక, "మహారాజా, యువరాజేగారు——"

ప్రతాపాదిత్యుఁడు——"డిల్లీ రాజేగా రయినారు, ప్రజ-లయినారు, చివరకు, భార్యచేతిలో నున్న యాబాలకుఁడు, ఉదయుని పేరుచెప్పి నన్ను భయపెట్ట ప్రయత్నిస్తున్నావా?"

మంత్రి——"మహారాజా, మీరు చాల పొరపడు చున్నారు, మీపని కడ్డురావలెనను నుద్దేశము నాకించుకైనను లేదు."

ప్రతాపాదిత్యుఁడు కొంచెము శాంతించి, "అట్లైన యేమి చెప్పఁబోవుచుంటివో చెప్పుము," అని యనెను.

మంత్రి——"నిన్నరాత్రి హఠాత్తుగ యువరాజుగారు గుఱ్ఱమెక్కి ఒక్కరే యెక్కడికో వెళ్లిపోయిరి, ఇప్పటివరకు తిరిగి రాలేదు."

ప్రతాపా ఁడు చీకాకుపడుచు, "ఎటువైపునకు వెళ్లెను?" అని యడిగెను.

మంత్రి.-"తూర్పు దిక్కునకు."

ప్రతాపాదిత్యుఁడు పండ్లు కొరుకుచు, "ఏ వేళప్పుడు?" అని యడిగెను.

మంత్రి.-"సుమారు అర్ధరాత్రి వేళ."

ప్రతాపాదిత్యుఁడు — "శ్రీపురపు జమీందారుగారి కొమార్తె యిక్కడనే యున్నదా?"

మంత్రి "చిత్తము."

ప్రతాపాదిత్యుఁడు—"ఆమె పుట్టినింట నుండుటయే మంచిది."

మంత్రి జవాబు లేదు.

ప్రతాపాదిత్యుఁడు—"ఉదయాదిత్యునిలో రాజలక్షణ మొక్కటైన గానరాకున్నది. చిన్నప్పటినుండియు వాఁడు ప్రజలతోనే కలసిమెలసి యుండువాఁడు. నాయింటఁ బుట్టినవాఁ డిట్లగునని యెవ రనుకొనఁగలిగిరి? సింహశాబకమునకు సింహ మెట్లు కావలెనో నేర్పవలెనా? ఏవనేమి, 'నరాణాం మాతుల క్రమః' కదా, వానికి మాతామహుల బుద్ధి అబ్బినట్లున్నది. దానిపైని మరల శ్రీపురపు రాజకన్యనిచ్చి పెండ్లి చేసినాను, అప్పటినుండి పూర్తిగ నధోగతిపాలైనాఁడు. నా కనిష్ఠపుత్రుఁడైనను యోగ్యుఁడౌనట్లును, నేను ప్రారంభించిన మహా కార్యము పూర్తికాకముందు నామరణము సంభవించినయెడల ఆ కార్యము నాచిన్న కొమారునిమూలమున నెఱవేఱునట్లును

ఈశ్వరుఁడు ప్రసాదించునుగాక!—ఏమి మంత్రీ, ఉదయుఁడింకను రాలేదా?"

మంత్రి—"లేదు మహారాజా!"

ప్రతాపా ్యుఁడు కాలితో నేలను తన్ని, "వానితో భటుఁ డెవఁడైనను పోలేదా?" అని యడిగెను.

మంత్రి—"ఒకఁడు పోఁబోవుచుండెను, కాని యువ-రాజుగారు నిషేధించిరి."

ప్రతాపాదిత్యుఁడు—"అతనికి కనఁబడకుండ దూర-మువనుండి వెనుకవెనుక నెవఁడైన వెళ్లవలసియుండెను."

మంత్రి- "భటులకెట్టి యనుమానమును లేకుండెను."

ప్రతాపాదిత్యుఁడు- "అనుమానము లేకుండెనా? భటులు చేసినది చాలమంచిపనియని కాబోలు నీవుచెప్పబోవు-నది. అర్థములేని మాటలేవో చెప్పి నన్ను దృప్తిపఱచుటకుఁ బ్రయత్నింపకుము. సింహద్వారమునొద్ద నుండు పహారా వాండ్రు అతినిర్లక్ష్యముగ నున్నట్లున్నారు. అక్కడ యెవ రెవరుండిరో వాండ్రను పిలిపింపుము. అజాగ్రత్తవలన నా పని నిష్ఫలమైనచో నేను సృష్టించు నుపద్రవమును విరా రెవ్వరు నాపలేరు. నీకుఁ గూడ తగినశాస్తి యగును మంత్రీ, జ్ఞాపకముంచుకొనుము. ఇందులో నెవరిమీఁదను నిందమోపఁ గూడదని చెప్పుటకు వచ్చితివా? అట్లయిన ఆనిందయంతయు నీదే."

ప్రతాపాదిత్యుఁడు ద్వారపాలకులను పిలిపింపుమని ఆజ్ఞాపించెను.

కొంచెముసే పేమియు మాట్లాడక యూరకుండి "హాఁ ! డిల్లీ రాజేగారిమాట ఏమి యనఁబోవుచుంటివి మంత్రీ ?" అని యనెను.

"ఎవరో డిల్లీమహారాజేగారితో మీామీాద ఫిర్యాదు చేసిరఁట."

"ఎవరు? మీా యువరాజే, ఉదయాదిత్యుఁడేమో!"

"అట్లెన్నఁడు ననఁబోకుఁడు మహారాజా ! చేసినవా రెవరో యింకను దొరకలేదు."

"చేసినవా రెవరైనను సరే, నీవు దానినిగుఱించి మఱి యాలోచింప నవసరములేదు. డిల్లీపురాధీశుని విచారణచేయ వలసినవాఁడను నేను, అతనికి దగినశిక్ష విధించు ప్రయత్నమే జరుగుచున్నది. ఆ పఠాను లింకను రాలేదా ? ఉదయాదిత్యుఁ డింకను రాలేదా ? ద్వారపాలకులను త్వరగా పిలిపింపుము."

# మూఁడవ పరిచ్ఛేదము

గుఱ్ఱమును పరుగెత్తించుచు విద్యుద్వేగముతో నిర్జనపథములఁ బడి యువరాజు పోవుచున్నాఁడు. అర్ధరాత్రి సమయము, గాఢాంధకారము. దారి చేక్కనిది, వెడల్పైనది యగుటచేత నెంతదూరము పోవుచున్నను యువరాజునకు భయము కలుగలేదు. అక్కడక్కడ కుక్కలు బౌ బౌ మని యఱచుచున్నవి. నక్కలు దారివిడిచి ప్రక్కనున్న వెదురు పొదల వెనుకకుఁ బారిపోవుచున్నవి. ఆ నిశ్శబ్దనిశీథము గుఱ్ఱపు డెక్కలశబ్దమును ప్రతిధ్వనింపఁజేయుచున్నది. ఆ యంధకారములో ఆకాశమున మిణుకుమిణుకుమనుచున్న చుక్కలు, దారి ప్రక్కను చెట్లమధ్యను, మెఱుఁగుఁడుఁబురుగులు—వీనివలన పుట్టుచుండిన కాంతి తప్ప మఱి యెట్టివెలుతురును లేదు. చెట్టు చెట్టున గీఁమని పురుగులు అఱచుచున్నవి. ఎముకలుమాత్రము మిగిలియున్న ముసలి ముష్టివాఁడొకఁడు రోడ్డుప్రక్కను చెట్టు మొదలున పండుకొనియున్నాఁడు. ఐదుక్రోసులదారి పోయిం మంచిరోడ్డువదలి యువరాజు పొలములలోఁ బడెను, గుఱ్ఱము వడి తగ్గింపవలసివచ్చినది. పగటివేళ వర్షము కురిసియుండుటచేత, భూమి బాగుగఁ దడసియున్నది, గుఱ్ఱముకాళ్లు మాటిమాటికిని తడినేలను కూరుకొని పోవుచున్నవి. పోవుచుఁ బోవుచు గుఱ్ఱము ముందుకాళ్లపై ముమ్మాఱు పడినది. అలసి గుఱ్ఱము

ముక్కు రంధ్రములఁ బెద్దపెద్దవిఁ జేయుచున్నది; దానినోటి నుండి నురగ, తొడలమధ్యనుండి చెమట కారుచున్నది, దేహమంతయు చెమటలో మునిఁగియున్నది. లోపలనుండి యొక విధమైనశబ్దము వెడలుచున్నది. నడువేసవి, లేశమైనను గాలి లేదు. గమ్యస్థాన మక్కడ కింకను దూరము. నీటిలోనుండి, దున్నిన పొలములలోనుండి, చాలదూరమువరకు గుఱ్ఱమును మెల్లగ నడిపించుకొనిపోయి యువరాజు చివర కొకరోడ్డును చేరుకొని మరలఁ బరుగెత్తింప నారంభించెను. యువరాజు గుఱ్ఱమును "సుగ్రీవా" యని ముద్దుతోఁ బిలుచుచు దానిని మెడపై తట్టి, ఉత్సాహపఱచెను. గుఱ్ఱము ఉలికిపడి సంతోషముతో చెవుల నిక్కపొడిచి కండ్లు పెద్దవిచేసి, ప్రభువు వైపునకుచూడఁ బ్రయత్నించెను; తలయెత్తి గట్టిగా సకిలించి మరల మెడదించి కళ్లెము లాగుకొని, బహువేగముతోఁ బరుగెత్త మొదలుపెట్టెను. రెండుపార్శ్వములనుండు చెట్లుచేమలు కంటికగపడుటలేదు; ఆకాశముననుండు నక్షత్రములు రాసులు రాసులుగ స్ఫులింగములవలె తలపై ఎగురుకొనిపోవుచున్నవి; నిశ్చలవాయువునందు పుట్టుచుండిన కెరటము లుదయాదిత్యుని చెవులలో ఝుంకారము పుట్టించుచున్నవి. మూఁడుజాముల రాత్రి యగునప్పటికి ఉదయాదిత్యుఁడు 'శిముల్‌తలీ' సత్రద్వారమున కెదురుగ వచ్చి నిలఁబడెను. అతఁడు క్రిందిగియు దిగకమునుపే గుఱ్ఱము నేలఁగూలి ప్రాణములు విడిచినది. యువరాజు దానివీఁపుపై తట్టి, దాని తలనెత్తి ఎంతోముద్దుగ,

సూపరెం టనుమానించుచు, "అట్లు చేయుటకు మాత్రము వీలు లేదు," అని యనెను.

ఉదయాదిత్యుఁడు, "నా కడ్డు రాకుము, మహారాజుగారి యిలాకాలోనివాఁడను నేను, దొంగ లిద్దఱిని వెదకుటకు వచ్చి నాను," అని యనెను.

ఇట్లనుచు యువరాజు సత్రములోఁ బ్రవేశించెను. సూపరెంటు అడ్డురాలేదు. యువరాజు సత్రమంతయు వెదకి చూచెను.

వసంతరాయలు లేరు, ఆయన యనుచరులు లేరు, పఠాను లేరు, నిద్రలో కలవరించుచున్న ముసలివాఁడొక్క రెవరో మాత్రము కనఁబడిరి.

యువరాజు సత్రమునుండి వచ్చి బయట నిల్చుండి యాలోచింపసాగెను. "మంచిదేయైనది, దైవవశమునఁ నతఁడు నేఁడు రాలేక పోయినాఁడు గాఁబోలు," నని యొకమాఱు అనుకొని, "కాని పఠాను లిక్కడ యతనిని కానక అపైనుండు సత్రమున నతనిని వెదకుచు వెళ్లియుండవచ్చు," నని మఱి యొకమాఱు అనుకొనుచు పై సత్రముదారిని వెళ్ల నారంభించెను. కొంచెముదూరము వెళ్లినప్పటికి గుఱ్ఱమెక్కి ఎదురుగా వచ్చుచున్న వాఁ డెవడో అతనికిఁ గనఁబడెను. అతఁడు సమీపింపఁగా, "ఎవరది రతనా?" అని యువరాజడిగెను. అంతట గుఱ్ఱము దిగి, "చిత్తము, మహాప్రభూ, ఈ రాత్రి వేళ యువరాజావారిచ్చటకు వచ్చినారే!" అని రతన్ అనెను.

యువరాజు—"వచ్చుటకు కారణము తరువాత చెప్పె-దను, తాతయ్య ఎక్కడ నున్నాఁడో ముందు నాకుఁ జెప్పుము."

"చిత్తము, ఆయన ఈసత్రములోనే యుండవలెను."

"ఇక్కడ లేడే!"

"ముప్పదిమంది నౌకర్లను వెంటఁబెట్టుకొని ఆయన యశోరునకు బయలుదేరిరి. పనియుండుటచేత నేను వెనుకఁబడితిని. ఈసత్రములో ఈసాయంకాల మాయనను గలిసి కొనెదనని చెప్పియుంటిని."

"నేల తడిసి మెత్తగా నున్నది. అందుచేత నడుగులు తప్పక కనఁబడును. ఆజాడ ననుసరించి అతనిని వెదకుటకు పోయెదను. నీగుఱ్ఱమును నా కిచ్చి నీవు నడచి రమ్ము."

# నాల్గవ పరిచ్ఛేదము

నిర్జనపథప్రాంతమున వసంతరాయలు ఒంటరిగా పల్లకీలోఁ గూర్చుండియుండెను. దగ్గఱ నొకపఠానుతప్ప మఱియెవ్వఱును లేరు, పల్లకీమోయువారైనను లేరు. దూరమున వినఁబడు-చుండు కోలాహలము నిలిచిపోయినది. రాత్రి మరల నిశ్శబ్ద మయిపోయినది.

"నీవు వెళ్లలేదేమి ఖాన్‌సాహేబ్?"

పఠాన్—"నేనెట్లు వెళ్లగలను హుజూర్? మాప్రాణములను ధనమును గాపాడుటకు తమరు తమ యనుచరుల నందఱిని బంపివేసితిరి, అట్టిసమయమున నేనుగూడ మిమ్ములను విడిచిపోఁగలనా? నేనంత కృతఘ్నుఁడ ననుకొనకుఁడు. 'మన కపకారము చేయువాఁడు మనకు ఋణగ్రస్తుఁడై యుండును, వాఁ డాఋణమును బరలోకములోఁ దీర్చవలసి యుండును. మన కుపకారము చేయువానిఋణము మన మెప్పటికిని తీర్చలేము,' అని మా మహాకవి ఒకచోట చెప్పియున్నాఁడు."

పఠాను బహు మంచివాఁడని వసంతరాయలు తనలోఁ దా ననుకొనెను. ఇద్దఱకును గొంతసేపు సంభాషణజరిగినది, పిమ్మట రాయలు బట్టతలను బయటకుఁబెట్టి, "ఖాన్ సాహేబ్ నీవు చాల మంచివాఁడవు," అని యనెను.

ఖాన్‌సాహేబ్ తత్క్షణము సలాముచేసెను. దివిటీవెలుఁగున వసంతరాయ లతనిముఖము చూచుచు, "నీముఖము చూచినచో నీవొక పెద్దయింటివాఁడని ఎవరికైనను తట్టక మాన" దనెను.

పఠాన్ మరల సలాము చేసి, "తమరు నిజము పోల్చుకొనుట చూచి నా కాశ్చర్యమగుచున్నది, మహారాజా," అని యనెను.

వసంతరాయలు—"నీ విప్పు డేపనిలో నున్నావు?"

ఖాన్ పెద్దనిట్టూర్పు విడిచి ఇట్లనెను—"నా రోజులు మంచివి కావు మహారాజా, చాల దురవస్థలో నున్నాను, వ్యవసాయము చేసికొని బ్రతుకుచున్నాను. మా కవి ఒకచోట నని యున్నాఁడు—ఓభాగ్యదేవతా, గడ్డిని నీవు గడ్డిగా సృజించుటలో నిర్దయ యేమియు లేదు; గాని రావిచెట్టును పెద్దవృక్షముగా సృజించి చివరకు దానిని తుపాను దెబ్బచేఁ బడఁద్రోసి తృణతుల్యముగఁ జేయుటలో నీహృదయము తాయింపంటిదని బయలుపడుచున్నది."

వసంతరాయలు మిక్కిలి యుల్లాసముతో "వహావ్వా వహావ్వా, ఎంతచక్కనిభావములు మీ కవి వ్యక్తపఱచునవి!" అని యనెను. "సాహేబ్, నాకు మీ కవి రచనలు వ్రాసి ఈయవలెను.

'నే నెంత యదృష్టవంతుఁడను,' అని పఠాను అనుకొనెను. "తాతగారిది దయగలస్వభావము, పేదవారికి అవసరకాలమున

సహాయము చేయవలసినవారు," అని పఠానునకు నమ్మకముకలిగి నది. 'ఒకప్పుడు భాగ్యవంతునిగా నుండినవానికి నేఁడెట్టిదుర్దశ పట్టినది! చపలచిత్తురాలగు లక్ష్మీదేవి చేసినదుష్కృత్య మిది,' అని వసంతరాయలు తనలోఁ దా ననుకొనుచుండెను. వసంత రాయలు దుఃఖితుఁడై, "నీ కంత దేహదార్ఢ్య మున్నందుకు నీ వనాయాసముగ సేనలోఁ జేరియుండవచ్చును," అని పఠానుతో నన్నాఁడు.

పఠాను—"చేరఁగలిగియుందును, నిజమే హుజూర్; అది మావృత్తియే. నాతండ్రితాతలు కత్తి చేతఁబుచ్చుకొని యుద్ధభూమిపైఁ బ్రాణములు విడచిరి. నాకుఁగూడ నదియే కోరిక. మాకప యొకచోట—"

ఆమాటలు పూర్తికాకపూర్వమే వసంతరాయలు నవ్వుచు ననెను,—"కవి యేమనినను నా యిలాకాలో నుద్యోగము కోరినచో కత్తిచేతఁ బుచ్చుకొని ప్రాణములు వదలవలెనను కోరిక ఫలింపదు, ఆకత్తి యొరనుండి పైకిఁ దీయు భాగ్యమైన నీకు లభించదేమో. నేను ముసలివాఁడ నయితిని, నాప్రజ లెట్టిభయమును లేక సుఖముగా కాలము గడపు చున్నారు. భగవంతుని కృపవలన ఇఁకముం దెన్నఁడునుగూడ యుద్ధము లేకయే గడచిపోవును గాక యనియే నాకోరిక. వయస్సు మళ్లిపోయినది, అస్త్రములు విడిచినాను. వానికి మాఱుగా మతి యొకతె నాపాణిగ్రహణము చేసినది." ఇట్లనుచుఁ దనప్రక్కను

నిద్రించుచున్న తనసహచరి, వీణను, రెండుమూఁడు ఝాంకారములతో లేపెను.

పఠాను "కళ్లుమూసికొని తల యూఁచుచు," అహా, మీరు చెప్పినదానిలో నెంత నిజమున్నది," అనెను. "ఒక సామెత యున్నది; కత్తి శత్రువులను జయించునుగాని సంగీతము శత్రువులను మిత్రులుగఁ జేయును"

వసంతరాయలు—"ఏమంటివి ఖాఁసాహేబ్? సంగీతము శత్రువులను మిత్రులుగఁ జేయఁగలదంటివా? ఎంత విలువైన మాట!" వసంతరాయలు కొంచెముసే పేమియు మాటలాడక కూర్చుండి తనలోఁ దా నాలోచించుచుండెను; ఆలోచించినకొలఁది ఆశ్చర్య మధికమగుచుండెను. మఱికొంతసే పయిన వెనుక ఖాఁసాహేబ్ నోటివెంటవచ్చిన యాకవివచనములకు వ్యాఖ్యానము చెప్పట మొదలుపెట్టెను. ఖడ్గము అంత భీషణమైన వస్తువైనప్పటికిని దానితో శత్రువుల శత్రుత్వమును నాశనము చేయలేము—రోగినిచంపి రోగమును వదలఁగొట్టుట ఎట్లో శస్త్రముతో శత్రుత్వమును జంపుటయు నట్లే. కాని సంగీత మతిమధురమైన శక్తి, దానితో శత్రువును జంపకయే శత్రుత్వమును నాశనము చేయవచ్చును. ఇది సామాన్య కవు లనఁగలమాటయా? వహ్వా, ఎంత ఘనమైనమాట!" వృద్ధుఁడు మిగుల నుత్తేజితుఁడై కాళ్లు పల్లకిలోనుండి [illegible]కిం బెట్టి పఠానుకు మఱింత దగ్గఱగ వచ్చి, "ఖడ్గముతో శత్రువును

జయింపవచ్చును, సంగీతముతో శత్రువును మిత్రునిగఁ జేయ-వచ్చును—కాదూ, ఖాఁ సాహేబ్!" అనెను.

ఖాన్—"చిత్తము మహాప్రభూ!"

వసంతరాయలు—"నీవొకమాఱు రాయగడు రమ్ము. నేను యశోరునుండి వచ్చిన తరువాత నా చేతనైన సహాయము చేసెదను."

పఠాను సంతోషముతో పొంగిపోవుచు, "తలఁచుకొని-నచో తమరు చేయలేని దేమియుండును," అనెను. అంతయు మిగుల ననుకూలముగానే జరిగినదని పఠాన్ తనలోఁ దానను కొనుచు, తాతగారిని, "తమరు వీణవాయించఁగలరా?" అని యడిగెను.

వసంతరాయలు వాయించఁగలనని యనుచు, తత్క్షణమే ప్రక్కనున్న వీణ నెత్తి వ్రేలికి నక్కాని తగిలించుకొని, బేహాగు రాగ మాలాపన ప్రారంభించెను. మధ్యమధ్యను పఠాను, 'వహావ్వా వహావ్వా' అనుచు తల యూఁచుచుండెను. అంతకంత కుత్సాహ మధికమగుటచేత వసంతరాయలు పల్లకిలో మఱి కూర్చుండి యుండలేక బయటకువచ్చి, నిలుచుండి వీణ వాయించ సాగెను. తనపదవిని మఱచి వాయించి వాయించి, మైమఱచి చివరకు పాడుట మొదలు పెట్టెను.

ప్రియను బాసి నే
నెట్లు గడపఁగల
నొక్క నిమిషమైన!

పాట ముగియగానే ఫతాను, "వహ్వా ఏమి గాత్రము!" అని యనెను.

వసంతరాయలు — "ఇటువంటి నిశ్శబ్దరాత్రియందు, ఇటువంటి బయలులోఁ గూర్చుండి పాడినయెడల నెవరి కంఠమైనను మధురముగానే యుండునని నీ మెప్పున కర్థము." నేను చాల సాధనచేసితిని నిజమే గాని నాకంఠము విని సంతోషించినవారు చాలతక్కువ. అయిన నేమి, జగత్తులోనుండు ప్రతిరోగమునకు నేదో యొక మం దుండును, ఆలాగుననే ఎట్టికంఠమునైనను విని మెచ్చుకొనువాఁ డెవఁడో ఒకఁడుండును. నాకంఠము విని సంతోషించువా రిద్ద ఱజ్ఞానులున్నారుం. లేనిచో నాదుకాణము నిప్పటివఱకు తెఱచుకొని యుండఁగలుగుదునా, సాయిబూ! నాకున్న యిద్దఱు బేగాండ్రును సరకు సంగతి తెలియకుండఁగనే 'వహావ్వా' అనుచుందురు. వారిద్దఱిని చాలకాలమునుండి చూడలేనందున నాపాట నిలిచిపోయినవి. అందుచేతనే బయలుదేరినాను, మనసార పాడి పాట వినిపించి మనస్సులో నున్నభారము తగ్గించుకొని యింటికి తిరిగి వచ్చెదను." దృష్టితగ్గిన యావృద్ధుని నేత్రములు ఆనందముతోను, అనురాగముతోను దేదీప్యమానములైనవి.

అప్పుడు ఫతాను తనలోఁ దా నిట్లనుకొనెను—"పాట నాకు వినుపించుటవలన మీ కోరికలలో నొకటి నెఱవేరినది, తాతగారూ, ఇప్పుడు మీ ప్రాణభారముకూడ నేనే తొలగింప వలెనా? ఆహా! ఎంతపాపము, ఎంతపాపము! అట్టి పనికూడ

నరునకు సాధ్యమగుచున్నది గాంబోలు! కాఫిరును చంపుట పుణ్యమే, కాని అట్టిపుణ్యము మిగుల నార్జించితిని, పరలోక సుఖమును గుఱించి యింక మఱేమియు యోచింప నక్కర లేదు. కాని నా యైహికావస్థ తారుమారుగానున్నది; ఈ కాఫిరు ప్రాణము కాపాడి అతనిమూలమున నా యవస్థ కొంచెము బాగుచేసికొనుటలో దోషమేమియు నాకు కానరాదు."

వసంతరాయలు కొంచెమూరకయుండి మఱి యాపుకొనలేక ఉత్తేజితుఁడై పఠాను దగ్గఱకు వచ్చి నెమ్మదిగా, "ఎవరి-మాట అనుచుంటినో నీకుఁ దెలియునా సాయిబూ? నా మనుమఁని మాట, మనుమరాలిమాట అనుచుంటిని," అని యనెను, ఇట్లని కొంచెము దిగులుచెందుచు, "నా యనుచరు లెప్పుడు వచ్చెదరో," అని తనలోఁ దా ననుకొనెను. మరల వీణతీసి పాట ప్రారంభించెను.

ఇట్టిసమయమున నశ్వారోహి యొకఁడు వచ్చి, "అన్నా! ప్రాణములు తిరిగి వచ్చినవి," అనుచు, "తాతయ్యా! ఈ అర్ధ రాత్రివేళ ఎవరికి నీపాట వినిపించుచున్నావు?" అని యడిగెను.

వసంతరాయి లాశ్చర్యపడుచు, వీణను పల్లకీలోనుంచి ఆనందపరవశుఁడై ఉదయాదిత్యుని గుఱ్ఱముమీఁదనుండి దింపి మనసార కౌఁగిలించుకొనుచు, "ఏమి తాతా! అందఱును క్షేమమా? ముసలమ్మ కులాసాగా నున్నదా?" అని యడిగెను.

"అందఱును కులాసాగా నున్నారు."

తాతగారా మాట వినినతోడనే నవ్వుచు మరల

వీణను పైకెత్తి తలయాడించుచు కాలితో తాళము వేయుచు పాట ప్రారంభించెను.

ఉదయాదిత్యుఁడా పఠానువైపు చూచుచు వసంత-రాయలచెవిలో, "నీకా కాబూలీవాఁ డెక్కడ దొరికినాఁడు?" అని యడిగెను.

"ఖాన్‌సాహేబ్ మిక్కిలి మంచివాఁడు, మనుష్యుల విలువ పోల్చుకొనఁగలవాఁడు; ఈరాత్రి వానితోఁ గలసి అత్యానందముతో గడపినాను," అని వసంతరాయ లనెను.

ఖాన్‌సాహేబ్ ఉదయాదిత్యునిఁ జూచి ఏమిచేయను దోచక కలవరపడుచుండెను.

ఉదయాదిత్యుఁడు—"సత్రములోనికి పోకుండ నిక్కడనే యున్నావేమి తాతయ్యా!"

పఠాను హఠాత్తుగా నిట్లు మొదలుపెట్టెను, "క్షమించెద రనిన నేనొకవార్త చెప్పెదను హుజూర్. నేను ప్రతాపాదిత్య మహారాజుగారి ప్రజలలోనివాఁడను. తమరు యశోహరమునకు వచ్చుచున్నప్పుడు దారిలో తమ్ము వధింపుమని నియమించి నన్నును మాతమ్మునియు మహారాజుగారు పంపిరి.

వసంతరాయలు—"రామ రామ!"

ఉదయాదిత్యుఁడు—"నీకుఁదెలిసినదంతయుఁ బూర్తిగా జెప్పుము."

పఠాను—"మే మిట్టిపని ఎన్నఁడుచు చేయలేదు. ఆపని

మా చేతకాదని రాజుగారితో మేము చెప్పితిమి; చేయక వీలు-లేదని రాజుగారు మ మ్మనేకవిధముల జెడిపించిరి; వేఱుదారి లేక అట్లే చేసెదమని చెప్పి బయలుదేఱి దారిలో మిమ్మును కలసి కొంటిమి. ఊరిలో బందిపోటు జరుగుచున్నదని చెప్పి ఏడ్చు కొనుచు మా తమ్ముడు వెళ్ళిపోయెను. ఆ పనిచేయు భారమంతయు నా యొక్కనిమీఁదనే పడినది. కాని, మహాప్రభూ, రాజుగారి ఆజ్ఞ యైనప్పటికిని నే నాపని చేయలేను. 'అధికారుల యాజ్ఞపై భూలోకమునంతయు నాశనము చేయవచ్చును గాని స్వర్గమును మాత్రము ముట్టఁగూడదు, ఆమాట మఱవకు' డని మా కవి ఒకచోట ననుచున్నాడు. కనుక ఈ యభాగ్యుఁడు మీశరణుఁ జొచ్చుచున్నాఁడు. నే నిప్పు డింటికి మరల పోయిన యెడల రాజుగారు నన్ను చంపించెదరు. మీరు నన్ను కాపాడ-కున్న నాకు వేఱుగతి లేదు,"—ఇట్లనుచు పఠాను చేతులు జోడించి వసంతరాయల యెదుట నిలిచెను.

వసంతరాయ లాశ్చర్యపడి యతనివైపు చూచుచు కొంతసే పయినతరువాత నిట్లనెను—"నేను నీకొక జాబిచ్చె-దను, అది తీసికొని రాయగడ పొమ్ము. నే నక్కడకు తిరిగి వచ్చిన తరువాత తగిన యేర్పాటు చేసెదను."

ఉదయాదిత్యుఁడు—"నీవింకను యశోహరకు పోవలె ననుకొనుచున్నావా తాతయ్యా?"

వసంతరాయలు—"ఆహా, వెళ్లెదను."

ఉదయాదిత్యుఁ డాశ్చర్యపడుచు, ఏల యని అడిగెను.

వసంతరాయలు—"ప్రతాపుఁడు నాకు పరాయివాఁడు కాఁడు, ఎన్ని యపరాధములు చేసినను నావాఁడే కదా! నా విషయమై నాకేమియు భయము లేదు, భవసాగరకూలమున నిలిచియున్న వాఁడను నేను, ఒక్క కెరటము వచ్చి తగిలినయెడల సర్వమును ముగియును. కాని ఈ పాపకార్యము చేసినచో ప్రతాపుని యిహపరముల కెట్టిహానికలుగునో యని చింతించక యెట్లూరకుండఁగలను? అక్కడికి వెళ్లి అనురాగముతోఁ నంతయు నతనికి బోధపఱచి చూచెదను."

ఇట్లనుచు వసంతరాయలు కనుల నీరుపెట్టుకొనెను.

అట్టిసమయమున వసంతరాయని యనుచరులు కోలాహలము చేసికొనుచు నక్కడకుఁ దిరిగివచ్చి, "మహారాజావా-రెక్కడ, మామహారాజావారెక్కడ?" అని కేకలు వేసిరి.

"ఇక్కడనే యున్నాను, మఱియెక్కడకు పోఁగలను?"

"ఆ బోడిగుండువాఁ డేడీ?" అని అందఱును కలసి యనిరి.

"మీ రా ఖాన్‌సాహేబు కేమియు చేయకూడదు," అనుచు భయపడుచు వసంతరాయలు వారి కడ్డుపడెను.

మొదటివాఁడు—"మహారాజా, నేడు బహుకష్టపడ-వలసివచ్చినది, వాఁడు- "

రెండవవాఁడు—"నీవు నోరు మూసికొనుము, నే నంతయు స్పష్టముగా చెప్పెదను. ఆ పఠాను నన్ను తిన్నగా తీసికొనిపోయి చివర కెడమప్రక్కనున్న యొకమామిడితోఁట-లోనికి—"

మూఁడవవాఁడు—"కాదురా అది పనసతోట!"

నాల్గవవాఁడు—"ఎడమవైపు కాదురా, కుడివైపు!"

రెండవవాఁడు—"ఛీ, మూర్ఖుడా—అది ఎడమవైపే!"

నాల్గవవాఁడు—"నీ వన్నంతమాత్రాన కుడి యెడ మౌనా?"

రెండవవాఁడు— "ఎడమవైపు కానియెడల, ఆ చెఱువు—"

ఉదయాదిత్యుఁడు—"అవునురా అది ఎడమవైపే, తరువాత జరిగినకథ చెప్పుము."

రెండవవాఁడు—"చిత్తము మహాప్రభూ! ఆయెడమ వైపుననున్న మామిడితోఁటలోనుండి ఆపైనున్నబయలులోనికి నన్ను తీసికొనిపోయి, తరువాత లెక్కలేని పొలములు, పొదలు, వెదురు డొంకలు దాటించి ఎంతోదూరము తీసికొని పోయినాఁడు, కాని యేపల్లె జాడయు కానరాలేదు. ఈవిధ-ముగా మూఁడు గంటలు నన్ను నడిపించి నడిపించి ఆ తురక-వాడు అకస్మాత్తుగా నెక్కడనో మాయమైపోయినాఁడు, ఎంత వెదకినను దొరకలేదు."

మొదటివాఁడు—"వానినిచూడఁగానే నాకుకొంచెము సందేహము కలిగినది."

రెండవవాఁడు—"ఇట్టిది ఏదో జరుగవచ్చునని నేను గూడ ననుకొంటిని."

ఇట్లు— జరుగఁబోవుచున్నట్లు అందఱికంటె ముందుగ తానే పోల్చుకొనినట్లు చివరకు ప్రతివాఁడును జెప్పసాగెను.

## అయిదవ పరిచ్ఛేదము

"ఆపరాను బిడ్డలు నింకను రాలేదు చూచితివా మంత్రీ!"

"అది నా తప్పు కాదు మహారాజా!", అని మెల్లమెల్లఁగ మంత్రియనెను.

"తప్పని నే ననలేదు. ఆలస్యమగుటకు గారణ మొకటి యుండవలెను గదా? నీయూహ ఏమి యని యడిగితి," నని చీకాకుపడుచు, ప్రతాపాదిత్యుఁ డనెను.

మంత్రి—"ఆ సత్ర మిక్కడికి చాలదూరము. అక్కడికి వెళ్లి పనిపూర్తిచేసి తిరిగివచ్చుటకు వేళపట్టును గదా!" ఈమాట విని ప్రతాపాదిత్యుఁ డసంతుష్టుఁడయ్యెను. తా నను మానించురీతి మంత్రి కూడ ననుమానింపవలెనని రాజు కోరుసది; కాని మంత్రి ధోరణి వేరు.

"ఉదయుఁడు నిన్న రాత్రి బయలుదేఱి పోయెనా?" అని ప్రతాపుఁ డడిగెను.

మంత్రి—"చిత్తము మహారాజా, అది మీతో మొదటనే మనవిచేసితిని."

రాజు—"మొదటనే మనవిచేసితివి! ఔను! సరియైన సమయమునఁ దెలియఁజేసితివి, కాదా? ఎప్పుడో ఒక మాట చెప్పినయెడల నీపూచి వదలిపోవు ననుకొనుచున్నావు, కాదా?" ఉదయుఁ డింతకుఁ బూర్వ మెప్పుడును నిట్లు చేయలేదు!' ఇది

శ్రీపురపురాజో కొమార్తెచేసిన దురుపదేశము. నీకెట్లు తోఁచు చున్నది మంత్రీ?"

"నేనెట్లు చెప్పఁగలను మహారాజా?"

ప్రతా—"నీ నోటవచ్చునది వేదవాక్యమని నమ్మి నిన్న డుగలేదు; నీయూహ కెట్లు తోఁచుచున్నదని నేనడిగినది."

మంత్రి—"తమరు మహారాణిగారివలన సంశయము విను- చుందురు, మీరావిషయమును నూహింపఁగలరు; నే నెట్లూ హింపఁగలను?"

ఆసమయమున పఠాను నొకఁడు రాజసమ్ముఖమునకు వచ్చెను.

ప్రతాపుఁడు—"ఏమయినది? కార్యము నెఱవేర్చుకొని వచ్చితివా?"

పఠాను—"చిత్తము, మహాప్రభూ, ఈపాటికి అంతయు పూర్తియై యుండును."

ప్రతాపుఁడు—"అదియేమి ? అట్టిజవాబేమి? ఆ పని జరిగినదో లేదో నీకు తెలియదా?"

పఠాను—"చిత్తము, మహాప్రభూ! నాకు తెలియును, పని పూర్తియైనది, కాని ఆసమయమున నే నక్కడ లేను మహారాజా."

ప్రతాపుఁడు—"ఆజ్ఞైన పని పూర్తియైనదని చెప్పుట కర్థమేమి?"

పఠాను—"మహాప్రభువువారి యాజ్ఞానుసారము నేను

వసంతరాయ మహారాజుగారి యొద్దనుండి అతని అనుచరబృంద మును దూరమునకు తీసికొనిపోతిని. హుసేన్‌ఖాన్ మిగిలిన పని పూర్తిచేసినాఁడు."

ప్రతాపుఁడు—"చేసియుండక పోయినయెడల?"

పఠాన్—"నాతల మహారాజువారియొద్ద జామీనుగా నుంచుచున్నాను."

ప్రతాపుఁడు—"అట్లైన ఇచ్చటనే నిలిచియుండుము. మీాతమ్ముఁడాపని నెఱవేర్చుకొని వచ్చినయెడల నీకు బహుమతి దొరకును."

పఠాను ద్వారముదగ్గఱకు పోయి యచ్చటనున్న పారా-వాని యాధీనమున నిల్చుండి యుండెను.

ప్రతాపుఁడు చాలసేపటివఱకు నేమియు ననలేదు. తరువాత మెల్లమెల్లగ మంత్రితో, "ఈ సంగతి మనప్రజలకుఁ దెలియఁగూడదు సుమా, ఆ యేర్పాటు నీవే చేయవలెను," అని యనెను.

మంత్రి—"మహారాజుగారికి కోపము రాదనిన, ఈ సంగతి దాగియుండదని నేను చెప్పఁగలను."

ప్రతాపుఁడు- -"నీవెట్లు పోల్చుకొనఁగలిగితివి?"

మంత్రి- ఏ పినతండ్రిగారియెడల తమకుఁ గల-ద్వేషమును తమ రింతకుఁబూర్వము స్పష్టముగా వెల్లడిచేయు-చుంటిరి. తమకొమార్తె వివాహకాలమున వసంతరాయలకు తమ రాహ్వానపత్రికయైనను పంపలేదు, మీారు పిలువకున్నను

ఆయన తనంతటతానే వచ్చెను. ఇప్పు డేమియు కారణము లేకుండ హఠాత్తుగా తను రాయనను పిలిపించుచున్నారు; అట్టి సందర్భమున దారిలో నెవరైన ఆయనను చంపినయెడల మహా రాజుగారే దానికి కారణమని ప్రజలందఱు ననుకొనెదరు."

ప్రతాపాదిత్యుఁడు కోపముతో నిట్లనెను—"నీ యుద్దేశము నాకేమియు బోధపడకున్నది మంత్రి! ఈసంగతి బయలు పడినగాని నీకు సంతోషము గలుగదు కాఁబోలు, ఇది యందఱకును దెలియుటచేఁగాని నీ మనఃశాంతి నెఱవేఱనట్టున్నది! అట్లు కానిచో నిది బయలుపడక తీఱదని రాత్రింబగళ్లు నీవేల ననుచుండవలెనో నాకుఁ దెలియకున్నది. బయలుపడుటకు నాకేమియు కారణము కనఁబడుటలేదు. ఇది నలుగురికిని తెలియకున్నచో నింటింటికిపోయి నీవే చెప్పెదవని నాయనుమానము"

మంత్రి—"మహారాజా, క్షమింపుఁడు. తమ కన్ని విషయములలో నాకంటె తెలిసినవారు, నావంటి క్షుద్రమతులు తమవంటివారికి ఉపదేశించుటకుఁ బ్రయత్నించుట సాహస కార్యమే! కాని యింతమంది యుండఁగా నన్నే తమరు మంత్రిగాఁ గోరుకొనుటచే నాక్షుద్రబుద్ధికిఁ దోఁచినది అప్పుడప్పుడు తమకు దెలియఁజేయుచుందును. నా సలహా తమకు కోపముమాత్రమే కలిగించుచున్నయెడల దాసుని క్షమించి, నన్నీయుద్యోగము విడిచి పోనిండు."

ప్రతాపాదిత్యుఁడు కొంచెము సరుదుకొని కూర్చుండెను. మంత్రి కష్టము కలుగుమాట లప్పుడప్పుడు చెప్పునపుడు

మహారాజుగారికి లోలోపున సంతోషముగూడఁ గలుగు-చుండును.

ప్రతాపాదిత్యుఁడు—"ఈయిద్దఱు పఠానులనుఁ జంపిన యెడల మనకు భయపడుటకు కారణ ముండ దేమో యని నాకు తోఁచుచున్నది."

మంత్రి—"ఒక కూనీయైనను దాఁచియుంచుట సుల-భముకాదు,మూఁడుకూనీలు దాఁచియుంచుట యసంభవము—తప్పక యందఱకును దెలిసిపోవును"—తానన్నమాట వదలి-పెట్టలేదు మంత్రి.

ప్రతాపాదిత్యుఁడు—"అట్లైన మనకుచేటే! ప్రజలంద ఱకుఁ దెలిసిపోవునా ? కాని యశోహరపురము రాయగడ కాదు. ప్రజలరాజత్వము లేదిక్కడ; ఇక్కడ రా జొక్కఁడే రాజు; అందుచేత ప్రజలపేరుచెప్పి నన్ను భయపెట్టుటవలన లాభముండదు. నా ప్రజలలో నెవఁడైన దీనివిషయమై యేదైన నెన్నడైన ననినచో ఎఱ్ఱగా కాలుచుండు ఇనుముతో వాని నాలుకను కల్పించెదను."

మంత్రి తనలోతాను నవ్వుకొనుచు నిట్లనుకొనెను—"ప్రజలనిన నింతభయము! కాని మనస్సును సమాధానపఱచు-కొని భయముపోఁగొట్టుకొనఁ బ్రయత్నించుచున్నారు!"

ప్రతాపుఁడు—"కర్మ ముగించుకొని యనుచరులతోఁ గలసి రాయగడున కొకమాఱు నేను పోవలెను. ఆ రాజ్య-ముపై హక్కుగలవారు నేనుతప్ప నింకెవ్వరును లేరు కదా."

వృద్ధవసంతరాయలు మెల్ల మెల్లగ లోనికిఁ బ్రవేశించెను. ప్రతాపాదిత్యుఁడు ఉలికిపడి వెనుకకు జరిగెను. కన్నుల యెదుట కనఁబడుచున్నది ఉపదేవతయై వచ్చిన వసంతరాయలేమోయని అనుకొనుచు, నిశ్చేష్టుఁడై మాటాడలేకుండెను. వసంతరాయలు ప్రతాపునిదగ్గఱకుబోయి అతనిపై చేయివేసి నిమురుచు ఇట్లనెను, "నన్ను జూచి నీకు భయమెందుకు ప్రతాపా? నేను నీపినతండ్రిని, ఐనను నన్ను నమ్మలేకున్నచో నేను ముసలివాఁడనైతినని జ్ఞప్తికితెచ్చుకొనిన నీవు నిర్భయముగా నుండవచ్చునే! నీకు హానిచేయఁగల శక్తి నాలో ఏమున్నది?"

ప్రతాపుడప్పటికి తెలివితెచ్చుకొనెను, కాని మాటలు కల్పించి చటాలున ఏమియు ననలేకపోయెను, పినతండ్రికి ప్రణామము చేయవలెననియైనను తట్టలేదు.

వసంతరాయలు నెమ్మదిగా మరల నారంభించెను—
"ఏదో యొక విషయమై మాటలాడుము ప్రతాపా! నన్ను చూచుటవలన నీకు సిగ్గుగాని సంకోచముగాని కల్గించునట్టిపని యేదైనను నీవు చేసియుండినచో దానివిషయమై ఆలోచింపకుము, దానిని గూర్చి నేను ప్రసంగింపను. రమ్ము నాయనా, దగ్గఱకు రమ్ము, చాలకాలమయినది నిన్ను చూచి; ఇక నెంతో కాలము నిన్ను చూడలేను గదా!"

ఇంతసేపైనతరువాత ప్రతాపుఁడు లేచి పినతండ్రి పాదములకు ప్రణామముచేసి, అతనిని కౌఁగిలించుకొనెను. ఇంతలో మంత్రి మెల్లగ గదిలోనుండి వెల్లిపోయెను.

వసంతరాయలు చిఱునవ్వునవ్వుచు ప్రతాపునిమీఁదఁ జేయి-వేసి యిట్లనెను, "వసంతుఁడు చాలకాలము జీవించినాఁడు. ఔనా ప్రతాపా? ఇప్పుడు కాలమయిపోయినది. విధాత అతనిని రమ్మని యేల కబురింకను పంపలేదో విధాతయె యెఱుఁగును. కాని ఇక నాలస్యము చేయఁడు!"

ప్రతాపుఁడు దానికి జబాబీయలేదు, వసంతరాయలు కొంచెమూరకుండి, "అట్లయిన స్పష్టముగాఁ జెప్పెదను వినుము. నీవు నామీఁదికి కత్తియెత్తితివి, అది నాకు కత్తిదెబ్బకంటె నధికముగ బాధించినది," అని యనుచు కన్నుల నీరు-పెట్టుకొనెను. "కాని నాకేమియు కోపము లేదు, నీతో రెండుమాటలు మాత్రము చెప్పవలెనని వచ్చినాను. నన్ను చంపకుము ప్రతాపా, దానివలన నీయిహపరములకుఁ గూడ నష్టముగలుగును. ఇంతకాల మోర్చియుండఁగలిగినవాఁడవు మఱి కొంచెముకాల ముండలేవా? తొందరపడి పాప మొడి కట్టుకొనెద వేల?"

వసంతరాయ లనినదానికి విరుద్ధముగా నేమియు ననలేదు ప్రతాపుఁడు, దానికి జబాబీయలేదు, అనుతాపము కనఁబడలేదు. వసంతరాయ లదిచూచి యేదైన నితరప్రసంగ-ములోని కతనిని దింపవలెనని, "ప్రతాపా, నీ వొకమాఱు రాయగడ రావలెను," అనెను. "నీ వక్కడకు వచ్చి చాల-కాలమయినది, రాయగడలో చాలమార్పులు జరిగినవి.

సైనికులయస్త్రము లిప్పుడు నాగళ్లు, వారికొఱకు నిర్మించిన భవనము అతిథిశాల."

ఆ సమయమున పఠాను ఆ గదిలోనుండి పారిపోవఁ బ్రయత్నము చేయుచుండుట ప్రతాపుఁడు కనిపెట్టెను. ఇప్పటి-వఱకు నణఁచియుంచిన కోపము జ్వాలయై బయటికి వచ్చినది. పిడుగువలె గర్జించుచు, "ఖబర్దార్! వానిని వదలకుఁడు, పట్టుకొని యుంచుఁడు," అనుచు వడివడిగా గది విడిచి వెళ్లి పోయెను.

రాజు మంత్రిని పిలిపించి, "రాజ్యవ్యవహారములలో నీవు చాల నజాగ్రత్తగా నున్నావు," అనెను.

"ఇందులో నాతప్పేమియు లేదు మహారాజా," అని మెల్లమెల్లగ మంత్రి ప్రత్యుత్తర మిచ్చెను.

రాజు గొంతుకఎత్తి బిగ్గరగా కేకలువేసెను; "నేను ప్రత్యేకించి ఏ విషయమును గుఱించియు ననలేదు! రాజ్య-సంబంధమైన అన్నికార్యములలోను నీవు మిక్కిలి నిష్కృత్య-ముగా నున్నావనిమాత్ర మనుచుంటిని. దాచమని అన్నాఁడు నీ కొక యుత్తరము నిచ్చినాను, అది పాఱవేసితివి!" రెండు మాసముల క్రింద నొకమూ ఱిట్టిది ఘటించినది, కాని రాజు దానినిగుఱించి అప్పు డొకమాటయైనను అనలేదు.

"ఇంకొకనాఁడు ఉమేశరాయలయొద్దకు పొమ్మని నిన్నా జ్ఞాపించితిని; నీ వచ్చుటకై స్వయముగా వెళ్లక యెవరినో పంపి కార్యము చేయించితివి—ఊరకుండుము, మాటలాడకుము,

చేసినతప్పు దాచుకొనుటకు వృథాప్రయత్నము చేయకుము. నీవు శ్రద్ధతో పనిచేయకుండుట స్పష్టము. జ్ఞాపక ముంచు కొనుము, ఇదియే నీతో చెప్పుట."

తరువాత, రాజు ద్వారపాలకులను బిలిపించెను; పూర్వ మొకమాఱు ఏదో యపరాధమునకై వాండ్ర జీతము నాపి వేసియుండెను.—ఇప్పుడు వాండ్రను ఖైదులో నుంచుమని రాజు యాజ్ఞచేసెను! పిమ్మట అంతఃపురములోనికిఁ బోయి రాణిని పిలిపించి ఇట్లనెను—"రాణీ, ఇంటిలో నిర్లక్ష్య మును, తిరుగుబాటును అధికమగుచున్నవి. ఉదయుఁడు పూర్వ మెన్నఁడును నిట్లు ప్రవర్తించుచుండలేదు. ఇప్పుడు తన యిష్టానుసారము బయటికి బోవుచు, ప్రజలతోఁ గలిసిమెలసి తిరుగుచు, నాకపకారముకలుగు పనులు చేయుచున్నాఁడు. దీనియంతటికిని అర్థమేమి చెప్పుము?"

రాణి భయపడుచు నిట్లనెను—"వానిది కాదు తప్పు మహారాజా! ఈ యనర్థ మంతటికిని కారణము మన కోడలు. నాకొడుకు పూర్వ మెన్నఁడు నిట్లు చేయలేదు. శ్రీపురపు రాచకోమార్తెను పెండ్లాడిన నాఁటినుండి వాని కేమోయైనది, నాకేమియు దెలియకున్నది."

సురమను కట్టుబాటులో నుంచవలయునని చెప్పి రాజుగారు వెళ్లిపోయిరి. రాణి ఉదయాదిత్యుని పిలిపించినది. ఉదయుఁడు వచ్చినతరువాత అతని ముఖము చూచుచు ఇట్ల-నెను—"ఆహా! ఎంత చిక్కిపోతివిరా తండ్రీ ఎంత మాడి

పోతివిరా నాయనా! పెండ్లి కాకముందు ఎట్లుంటివి—చూచినవారెల్ల వెలిగారమద్దిన బంగారువంటి ముఖమని యనుచుండిరి. అట్టివాని కీదశపట్టుట కెవరు కారణము? కోడలి మాట యింకముం దెన్నఁడును వినకుము తండ్రి, వినుటవలననే నీ కీదశపట్టినది." సురమ ముసుఁగు వేసికొని యొకమూలను నిలిచియున్నది. రాణి మరల ప్రారంభించెను—"చిన్నకులమున పుట్టినయామె నీకు తగిన భార్య యెట్లు కాఁగలదు? నీకు సలహా నిచ్చుయోగ్యత ఆమె కెట్లు కలుగును? ఎట్టిరాక్షసిని తెచ్చి మహారాజుగారు నీకు పెండ్లి చేయఁగలిగిరి తండ్రీ!" రాణి నేత్రములనుండి అశ్రువర్షము మొదలుపెట్టినది.

ఉదయాదిత్యుని ప్రశాంతలలాటమునఁ జెమట క్రమ్ము-చుండెను, లోనున్న అశాంతి బయలుపడునేమో యని అతఁడు తన పెద్దపెద్దకన్నులను మఱియొకప్రక్కకు త్రిప్పుకొనెను.

అక్కడ గూర్చుండియున్న ముసలిదాసి యొకతె, "శ్రీ-పురపుస్త్రీలు మంత్ర మెఱుఁగుదురు, తప్పక మన యువరాజు-నకు రాజకన్య మందు పెట్టియుండును, సందేహము లేదు," అనినది. ఇట్లనుచు ఆ దాసి ఉదయుని యొద్దకు పోయి, "ఆమె నీకు మందుపెట్టినది నాయనా, అదిగో చూడుము, ఆమె సామాన్యరాలు కాదు, శ్రీపురమునుండి వచ్చినది!" ఇట్లనుచు బాణములవంటిచూపులను సురమవైపు ప్రసరించి పైఁటచెంగుతో కళ్లను రుద్దుకొని ఎఱ్ఱగాఁ జేసికొనినది. ఇది చూచి రాణి దుఃఖము మఱింత రేఁగినది. అంతఃపుర వృద్ధనారీగణమున రోదన అఁటు

రోగమువలె వ్యాపించినది. ఏడ్వ నుద్దేశించి యందఱును రాణి గదిలోనికి వచ్చిచేరిరి. ఉదయాదిత్యుఁడు జాలిపడుచు సురమ-వైపు చూచెను. సురమ ముసుఁగులోనుండి యిది గ్రహించి, కనులు తుడుచుకొనుచు మెల్లగ తనగదిలోనికిఁ బోయెను.

రాణి సాయంకాలము ప్రతాపాదిత్యునియొద్దకు వచ్చి —"ఉదయునికి నంతయు బోధపఱచి చెప్పితిని, నాకొడుకు బహు మంచివాఁడు, బోధపఱచి చెప్పినయెడల బోధపఱచు కొనును, ఇప్పుడు వానికనులు విడినవి,' అని చెప్పినది.

# ఆఱవ పరిచ్ఛేదము

సురమ విభముఖము వాడియుండుట చూచి భరించి యుండలేక, ఆమెదగ్గఱకు వచ్చి యామె మెడపై చేతులనువేసి కౌఁగలించుకొని, "ఏమియు మాటాడక విచారముతో నట్లూరక కూర్చొనుచున్నా వేమి విభా, నీమనస్సులో నున్నది ఎప్పటికప్పుడు నాతో చెప్పుచుండవేల?" అని యడిగెను.

"నేను చెప్పవలసిన దేమున్నది?" అని విభ మెల్లగ ననెను.

సురమ—"నీ పతినిని చూచి చాలకాలమయినది, నీకెంత కిష్టముగనున్నదో నే నెఱుఁగుదును. రమ్మని అతనికి జాబు వ్రాయుము, జాబతనికి చేరగలయేర్పాటు మా అన్నయ్యచే చేయించెదను."

విభభర్త చంద్రద్వీపాధీశుఁడు, రామచంద్రరాయలు; వారిద్దఱు నిప్పుడు మాటలాడుచుండినది, అతనిని గూర్చియే.

విభ తలవంచుకొని జబాబీయనారంభించెను—"అతడు ఇచ్చటకు రావలసిన అవసర మిచ్చటివా రెవ్వరికిని కనఁబడనప్పుడు కాని, ఇక్కడ అతనికి జేరగవలసిన మర్యాదలు జేరగకపోయినప్పుడు కాని, అతడిచ్చటికి రాకపోవుటయే మేలు. తనంతటతానే రావలెనని యనుకొనినగూడ రావద్దని నేను చెప్పెదను. ఆయన మహారాజు, మర్యాద జరుగని స్థలమున కేల

రావలెను ? ఏవిషయములో నతడు మనకంటె తక్కువ? నాన్నగా రతని నవమానపఱచుట ఏల?" విభ మఱి, యాపు కొనలేక ముఖమెఱ్ఱ చేసికొని ఏడ్వ నారంభించినది.

విభముఖమును సురమ తనవక్షముపై బెట్టుకొని యామె కనులు తుడుచుచు ననెను—"నీ వన్నది సరియా విభా? నీవు మగవాఁడవైనచో నేమి చేసియుందువు? పిలువలేదని ఎన్నఁటి కిని అత్తవారియింటికి వెళ్లకయుందువు కాఁబోలు!"

విభ—"నేనే పురుషుఁడనై యుండినచో తత్క్షణమే వెళ్లి యుందును, మానావమానములమాట యాలోచించుచుఁ గూర్చుండను. అట్లని చెప్పి పిలువకపోయినను ఆయన యిక్కడకు రావలెనని కాదు నా యభిప్రాయము."

విభ ఇంతగా మాటలాడు స్వభావము కలది కాదు; ఉద్రేకముకొలది నేడిన్ని మాటలనినది. ఇప్పుడది జ్ఞప్తికి వచ్చి సిగ్గుపడి, "నేఁడెంత యధికముగా మాటలాడితిని! ఎట్టిమాటలాడితిని!" అని తనలోఁ దా ననుకొన్నది. క్రమక్రమముగ ఉద్రేకముతగ్గి, గొప్పబాధ యామె నుండెనైఁ గూర్చున్నది. విభ కనులను చేతులతో నొక్కకొనుచు సురమయొడిలో తల నుంచినది. సురమ ముందుకు వంగి చేతులు విభ తలమీఁద నుంచి, కడుముద్దుతో నామె దట్టమైనజుట్టును దువ్వుచుండెను. కొన్ని నిమిషము లిట్లు గడచినవి. ఇద్దఱిలో నొకరైన మాటాడ లేదు. విభ కనులనుండి యశ్రుబిందువు లొకొక్కటిగ రాలుచుండెను; వానిని సురమ నెమ్మదిగ తుడుచుచుండెను.

ఇట్లు చాలసేపయినది; సంధ్య సమీపించినది. విభ లేచి కూర్చుండి కనులు తుడుచుకొని చిఱునవ్వు నవ్వినది—"చిన్న పిల్లవలె నేఁడు నేను ప్రవర్తించితిని," అని ఆ నవ్వున కర్థము. విభ ముఖమును త్రిప్పుకొని బయటికి పారిపోవలెనని ప్రయత్నించుచుండెను. సురమ ఏమియు ననక విభ చేయిమాత్రము పట్టుకొని వెనుకటిప్రసంగము నెత్తక, "తాతయ్య వచ్చినాఁడని నీకు తెలిసినదా విభా?" అని యనెను.

విభ—"తాతయ్య వచ్చినాఁడా?"

సురమ—"వచ్చినాఁడు."

"ఎప్పుడు వచ్చినాడు?" అని అత్యుత్సాహముతో నడిగినది విభ.

సురమ—"వచ్చి కొంతసే పయినది."

విభ—"మనలను జూచుటకు రాలేదే!"

విభ మనస్సునకు కొంచెము కష్టము కలిగినది; తాతగారి-మీఁద తనకుఁగల హక్కును సదా జాగ్రత్తతో కాపాడు-చుండెను. మును పొకనాఁడు వసంతరాయలు వచ్చి ఉదయా-దిత్యునితో మాటలాడుచు కూర్చుండి చాలసేపటివఱకు విభను జూచుట కంతఃపురములోనికి రాలేదు. దానివలన విభకు మిక్కిలి బాధకలిగినది; తాతయ్యతో దానివిషయమై పోట్లాడక పోయినను, అతనితో మనసార మాటలాడలేక పోయినది.

వసంతరాయలు ఇంటిలో నడుగుపెట్టుచు పాట ప్రారంభించెను.

పాట విని విభ తలవంచుకొని నవ్వుచుండెను, ఆమె కానందము కలిగినది; ఆనంద మంత స్పష్టముగుచో దొరకి పోయెదనేమో యని కొంచెము కలతఁ జెందుచుండెను.

సురమ విభ ముఖమును ఎత్తి పట్టుకొనుచు, "తాతయ్య గారు విభ నవ్వు చూచుటకు దాఁగొనియుండ నవసరము లేదు!" అనినది—"దాఁగొని వెనుకనుండి నవ్వుముఖ మెక్కుమాఱు-చూచి పోయెదనని సూచించుచు తాతయ్య పాడుచుండిన పాటకు సురమ యిచ్చిన ప్రత్యుత్తర మిది.

వసంతరాయలు—"అవును, అవసరము లేదు. నవ్వ నిచో తాత అసలు వెళ్లఁడేమో, కొంచెము నవ్వి వద లించుకొనుట మంచి"దని విభ అనుకొనుచున్నది; ఆ గయ్యాళి యభిప్రాయము నాకు బోధపడకపోలేదు, నన్ను పంపివేయవలె. నని వేసిన ఎత్తు ఇది. కాని ఆ పని శీఘ్రముగా నెఱవేర లేదు. వచ్చితిని గనుక బాగుగా కాల్చుకొని తినకుండ వెళ్లను; మఱల చాలదినములవఱకు రా లేక పోయిన జ్ఞాపక ముండవలెనుగదా!"

సురమ—"తాతయ్యా వింటివా, విభ నా చెవిలో ఏమనుచున్నదో—జ్ఞాపక ముంచుకొనునట్లు చేయుటయే నీ యుద్దేశమైనచో ఇప్పటివఱకు నీవు కలిగించిన బాధ చాలునఁట"

విని మహానందముతో వసంతరాయలు పకపక నవ్వ నారంభించెను.

"నే నట్లనలేదు. నే నేమియు ననలేదు" అని విభ సిగ్గు-పడుచు నన్నది.

సురమ—"తాతయ్యా, నీకోరిక నెఱవేఱినదా? నవ్వు ముఖము చూడవలెనని కోరితివి, చూచితివి; మాట వినవలెనని కోరినావు మాట వింటివి. ఇంక నీవు వెళ్లిపోవుట న్యాయము!"

వసంతరాయలు—"వెళ్లలేను తల్లీ, వెళ్లలేను. నేను తెచ్చినవి పదునైదు పాటలు, నెత్తిపై పండువెంట్రుకలు. అవి యిక్కడ ఒప్పజెప్పనిదే వెళ్లలేను."

విభ నవ్వు ఆపుకొనలేకపోయినది—"సగము మేర నీతలను వెంట్రుకలే లేవు తాతయ్యా."

తాతగారి సంకల్పము సిద్ధించినది. చాలకాలమైనతరువాత కలసికొనినప్పుడు ఎంతో ప్రయత్నముపైనగాని విభ నోరు విడునది కాదు. కాని తాతగారిదగ్గఱ విభనోరొకమాఱు తెఱచినచో దానిని మూయుట అతి కష్టము. తాతగారి ఎదుటతప్ప మఱియెవరియెదుటనుగూడ నెట్టి యవస్థలోనైన విభను మాటలాడించుట సులభమైన పని కాదు.

వసంతరాయలు బట్టతలపై చేయి త్రిప్పుకొనుచు ననెను "నా నెత్తినిండ నెత్తిపై వెంట్రుక లుండురోజులు పోయినవి. నేడా రోజులే ఉన్నయెడల ఇంతదూరము నడచి వచ్చియుందునా? నాలుగు వెంట్రుకలు పండునంతలో మీవంటిరూపసులు పదియుంది నాదగ్గఱకు వచ్చి ఆ పండువెంట్రుకలను, వానితోపాటు పది నల్లనివెంట్రుకలను తీసివేయుచుండరా?"

విభ నవ్వాపుకొని గంభీరస్వరముతో, "అది నిజమే గాని

తాతయ్యా, తలనిండ జుట్టుండురోజులలో నీవు ఇంతకంటె అందముగా నుండువాఁడవా?" అని యడిగెను.

ఈవిషయమై విభకు సందేహ ముండకపోలేదు. తాత బట్టతల, ఆ మీసములు గీయించిన పెదవులు, అతని ప్రశాంత-మగు నవ్వు, పండినమామిడిపండువంటి తాతగారి నిండుబుద్ధి— వీనిలో నొక్కటైనను లేనట్లూహించినంతమాత్రమున విభ కసంతుష్టికలుగుచుండెను— తాతకు బట్టతల లేకపోయిన యెడల రాణించదు; మీసము లున్నయెడల వికారముగా నుండును, అని విభ తనలోఁ దానను కొనినది. మీసములున్న యెడల ఎంతవికారముగా నుండునో ఊహించుకొని న వ్వాపుకొనలేకపోయినది—'తాతయ్యకు మీసములా! బట్టతలలేని తాతయ్యా!"

వసంతరాయలు—"ఈవిషయములో గొప్పమతభేదము కలదు. నామనుమరాండ్రు నాబట్టతలను చూచి మోహిత లగు-చున్నారు, వారు నాజుట్టును చూడలేదు. నా నాయనమ్మలు, అమ్మమ్మలు, నాజుట్టునుచూచి మోహితలగుచుండిరి, వారు నా బట్టతలను చూడలేదు; రెండింటినికూడ చూచియున్నవారేది యందమో ఇప్పటికిని స్థిరపఱచ లేకున్నారు."

తొందరతొందరగ విభ తాతగారి దగ్గఱకు బోయి ప్రక్కను నిలిచి, "తాతయ్యా—నీ పండువెండ్రుకలను తీయ నీయవా?" అనెను.

సురమ—"నే ననునది- "

విభ—"చూచుము తాతా నీ—"

సురమ—"నీవు మాటలాడకుము విభా ఊరకుం-
డుము—! తాతయ్యా నీవు వెళ్ళి—

విభ—"తాతయ్యా, నీతలను బాదుకొంద్రుకలుతప్ప
మఱేమియు లేవే. అవియన్నియుఁ కిరివేసినయెడల దల
పూర్తిగా బోడియైపోవునే!"

వసంతరాయలు—"నన్ను విసనీయక చీకాకుపెట్టిన
యెడల మలయమారుత మాలాపన ప్రారంభించెదను జాగ్రత!
ఇట్లనుచు తన చిన్నవీణ శ్రుతివేయుట మొదలుపెట్టెను. విభకు
మలయమారుత మనిన చీకాకు.

"అట్లైన నేను పారిపోయెదను," అనుచు విభ గదిలో
నుండి బయటికి వెళ్ళినది.

అప్పుడు సురమ నెమ్మదిగాఁ జెప్పెను—"విభ నిశ్శబ్ద-
ముగ తనలోఁ దాను భరించుచున్న దుఃఖమును గుఱించి తెలి-
సినయెడల మహారాజుగారికి గూడ దయపుట్టును తాతయ్యా!"

"ఏమూ ఏమీ? విభ కేమైనది?" అని మిక్కిలి యాతు-
రతతో నడుగుచు వసంతరాయలు సురమ దగ్గఱకువచ్చి
కూర్చుండెను.

సురమ— "అల్లుని పిలిపింపవలెనని మున్నూటఅరువది
రోజులలో నొక్కనాఁడైన నెవ్వరికిని తోఁచలేదేమి?"

"నిజమే!" అనెను వసంతరాయలు, ఆలోచించుచు.

సురమ—"భర్త కిట్టి అమర్యాద చేయుచున్నప్పుడు

వహించి యూరకుండఁగల స్త్రీలెంక ఉందురు, చెప్పుము, విభ బహుసాధువు గనుక దొంగతనముగా తనలో తానేడ్చుచు కూర్చుండును."

"లోలోపున నేడ్చుచు కూర్చుండునా?" అని వసంత రాయలు దుఃఖముతో నడిగెను.

సురమ—"నేటి సాయంకాలమంతయు నాదగ్గఱ కూర్చుండి ఏడ్చుచుండెను."

"సాయంకాల మేడ్చుచు కూర్చుండి యుండెనా?"

సురమ—"ఏడ్చుచుండెను."

వసంతరాయలు—"విభ నొకమాఱు, పాపము, తీసి కొని రమ్ము మాతము."

సురమ విభను జేయిపట్టుకొని తీసికొనివచ్చినది. వసంత-రాయలు ముద్దుతో విభగడ్డము పట్టుకొని అనెను— "ఎందుచేత నేడ్చుచుంటివి తల్లీ? నీ కెప్పుడు దేనివలన నెట్టి కష్టముకలిగినను తాతయ్యతో చెప్పుచుండ వేల? దానికేదైన నుపాయము చేయుదుననెడవా? ఇదిగో ఇప్పుడే వెళ్లి ప్రతా పునితో చెప్పివచ్చెదను."

విభ—"తాతయ్యా, నీకాళ్లు పట్టుకొనెదను. నాన్నతో నేమియు చెప్పకుము, నీ కాళ్లుపట్టుకొనుచున్నాను తాతయ్యా!"

విభ ఇట్లనుచుండఁగనే వసంతరాయలు బయటకుఁబోయి ప్రతాపాదిత్యుని యొద్దకు వెళ్లి యిట్లనెను— "అల్లుని ఇన్నాళ్లింటికి పిలువకపోవుట అతని కమర్యాద చేసినట్లు కనఁ

బడును. యశోవార పురాధీశుని యల్లునికి తగినమర్యాద చేయకపోవుట నీకే యవమానము, దానివలన నీ కెట్టిగౌరవ మును కలుగదు."

ప్రతాపాదిత్యుఁడు పినతండ్రిమాట కడ్డు చెప్ప లేదు, అల్లుని పిలిపింపుమని యాజ్ఞాపించెను.

అంతఃపురమున విభా సురమలయొద్దనుఁ బోయి వసంత-రాయ లుత్సాహముతో వీణవాయించుట మొదలుపెట్టెను.

"తాతయ్యా! నాన్నతో నంతయు చెప్పివేసితివా?" అని విభ సిగ్గుపడుచు నడిగినది.

వసంతరాయ లది వినిపించుకొనక వీణవాయించు చుండెను.

విభ వీణతీగలపై చేయివేసి పాట నాపి, "నాన్నతో నాసంగతి చెప్పితివా?" అని మరల నడిగెను.

అప్పుడు ఉదయాదిత్యుని చిన్నతమ్ముఁడు, ఎనిమిదేండ్ల బాలకుడు, సమరాదిత్యుఁడు, గదిలోనికి తొంగిచూచి, "అక్కా చూచినానులే, తాతయ్యతో మాటలాడుచున్నావు—అమ్మతోఁ జెప్పెద నుండుము," అని యనెను.

"ఇటు రా నాయనా, తాతా ఇటు రమ్ము" అనుచు తాతగా రా పిల్లవానిని పట్టుకొనిరి.

వసంతరాయలును సురమయుఁ గలసి యుదయుని పాడుచేయుచున్నారని యింటి యందఱి యుద్దేశము. ఆ కారణముచేత వసంతరాయ లాయింటికి వచ్చునప్పుడెల్లను అంద

ఉను మిగుల జాగ్రత్తతో నుందురు. సమరుఁడు తాతగారి చేతినుండి తప్పించుకొనవలెనని చేతులు లాగుకొనుచు ఇటు నటు కొట్టుకొనుట ప్రారంభించెను. తాత వీణ నతనిచేతనుంచి, సులోచనముల తనికి పెట్టి, వానిని భుజముమీఁద నెక్కించుకొని, నాలుగునిమిషములలో వానిని పూర్తిగా వశపఱచుకొనెను. తరువాత మనుమఁడు తాతను మఱి విడువలేదు, తాతగా రున్నంతసేపును అతని వెనకనే తిరుగుచుండి, తాతగారి వీణను వాయించి వాయించి వీణతీగలలో ఐదింటిని త్రెంచివేసెను; చివరకు వీణవాయించు నక్కూడ తాతగారి కీయక తానే యుంచుకొనెను.

## ఏడవ పరిచ్ఛేదము

చంద్రద్వీపాధిపతియైన రామచంద్రరాయలు రాజసభా మందిరమున గూర్చుండియుండెను. అతఁడు కూర్చుండియున్నది ఎనిమిది కోణముల హాలొకటి. బట్టలు కప్పియున్న గాజుబుడ్లు పైనుండి వ్రేలాడుచున్నవి గోడలనుండు గూళ్లలో, ఒకదానిలో మాత్రము విఘ్నేశ్వరుని ప్రతిమ యున్నది, మిగిలినవానిలో వేరువేరు అవస్థలను నిరూపించిన శ్రీకృష్ణుని ప్రతిమలున్నవి. అవి యూరోపులో ప్రఖ్యాతిచెందినవంట, కృష్ణ కుంభకారుని స్వహస్తఘటితములు. హాలునంతటను తివాసులు పఱచియున్నవి, మధ్యను జరీపనిచేసిన సింహాసన మున్నది. సింహాసనముపై నున్నవి రెండుపదార్థములు—ఒకరాజు ఒక బాలీసు. నాలుగు వైపులను జరీజాలరు వ్రేలఁబడియున్నది. గోడలను స్వదేశమున తయారైన అద్దములున్నవి. ఈ స్వదేశదర్పణములలోఁ జూచు వారికి ముఖములు సరియైన పరిమాణముతోఁ గనఁబడవు. రాజుగారిచుట్టునున్న మానవదర్పణములుకూడ స్వదేశదర్పణములవంటివే, వానిలో రాజుగారి ముఖము మిక్కిలి పెద్దదయి కనఁబడుచుండును. రాజుగారి యెడమప్రక్క నొక పెద్ద హుక్కాదానున్నది. మంత్రి హరిశంకరుఁ డున్నాఁడు. కుడి వైపున రమాయి-విదూషకుఁడును, సులోచనములు పెట్టుకొని యున్న ఫర్నాండిజ్ సేనాపతియు నున్నారు.

రాజు—"ఏమోయి రమాయ్"

రమాయి—"చిత్తము మహాప్రభూ!"

రాజుగారు క్లాంతిఁ జెందునంత నవ్వసాగిరి, మంత్రి రాజు గారికంటెఁగూడ నధికముగ నవ్వెను. ఫర్నాండిజ్ చప్పట్లు కొట్టుచు నవ్వ నారంభించెను. రమాయి సంతోషముకొలఁది కండ్లు చికిలించుచుండెను. రమాయిమాటలకు నవ్వకయుండుట రసికత లేకపోవుటయని రాజుగారి యభిప్రాయము. రాజుగారు నవ్వుచున్నప్పుడు నవ్వుట కర్తవ్యమని మంత్రి మతము. నవ్వఁ దగినట్టిదేదో అందులో నుండవలెనని ఫర్నాండిజ్ దొరగారి యూహ. ఇంతే కాక తనమాటలకు నవ్వని యభాగ్యుని నేడ్పింపక వదలఁడు రమాయి. ఈ కారణముచేత నేతప్ప రమాయి హాస్యములు విని ఎవ్వరికిని నవ్వు రాదు— అనాదిగా వినివచ్చుచున్న హాస్యములే అవి. భయమువలన కొందఱు, కర్తవ్యపాలనమని కొందఱు—రాజుగారు మొదలు ద్వారపాలకుని వఱకు, అందఱును రమాయిమాటలకు నవ్వుచుందురు.

"సంగతు లేమి రమాయ్?" అని రాజావా రడిగిరి.

రసికత కనపఱుపవలెనని రమాయి అర్థము చేసికొని, "సేనా పతిగారియింటిలో దొంగలు పడ్డట్టు విన్నాను," అని రమాయి ప్రారంభించెను.

ప్రాఁతపురాణము. మరల తన్నెగతాళి చేయఁబోవు చున్నాఁడని ఫర్నాండెజ్ బోధపఱచుకొనెను. సేనాపతి భయ పడుచున్నకొలది రమాయి మఱింత యుత్సాహముతో తన

హాస్యములను ఆతనిపై నే ప్రయోగించుచుండెను. ఇదిచూచి రాజావారికి మిగుల యుల్లాసము కలుగుచుండును. అందుచేత రమాయి వచ్చినతోడనే ఫర్నాండెజ్ ను పిలిపించుచుందురు. రాజుగారి కామోదము నిచ్చువానిలో ముఖ్యమైనవి రెండుండెను. మొదటిది గొఱ్ఱపోతులపోట్లాట, రెండవది ఫర్నాండెజ్ దొరగారిని పిలిపించి ఆ పోట్లాట ఎదుట నిలబెట్టుట. ఉద్యోగములో ప్రవేశించినప్పటినుండి సేనాపతికి బాణముల దెబ్బల వలన దేహముపై నొక్క గీరైనను పడలేదు, కాని నవ్వు తెప్పించు నన్ని హాస్యపుగుండ్లు ప్రతిదినము తగులుచుండును. రమాయి రసికతను అధికాంశము వదలివేయకుండ వర్ణించుట రసహీనులకుతప్ప సాధ్యముకాని పని.

"తరువాత?" అని ప్రశ్నించిరి రాజావారు కండ్లు చికిలించుచు.

"మనవిచేయుచున్నాను మహాప్రభూ, (ఫర్నాండెజ కుడితినీగుండె తీసి కుటిల తగిలించుచుండెను.) మూడు నాలుగు రోజులనుండి సేనాపతిగారియింటికి దొంగలరాకపోకలు జరుగుచున్నవి. ఇంటియిల్లాలు దొరవారిని లేపవలెనని ఎంతో ప్రయత్నము చేయుచున్నది. కాని దొరవారికి మెలకువ తెప్పించ లేకున్నది."

రాజుగారు—"హాః హాః హాః హాః"

మంత్రి—"హాాః హాాః హాాః హాాః హాాః"

సేనాపతి—"హిః హిః"

"తెల్లవాఱినది, భార్యసాధింపులు మఱి సహింపలేక క్షమాపణకోరుకొని దొరవారు, "ఈరాత్రి ఏలాగునన్నైన దొంగను పట్టుకొనెదనని," భార్యతో ననిరి. రాత్రి రెండు గంటలవేళప్పుడు దొంగ యింట ప్రవేశించెను. "ఇదిగో దొంగ వచ్చుచున్నాఁడు చూచితిరా?" అనెను గృహిణి. "ఇంట దీపము వెలుఁగుచున్నది. ఆ వెలుతురులో దొంగకు మనమగపడుదుము, మనను చూచినతోడనే వాడు పారిపోవును," అని దొరవారు ప్రత్యుత్తరమిచ్చి దొంగతో నిట్లనిరి—"దొంగా! నేఁడు బ్రతికిపోతివిరా, ఇంట దీపము వెలుఁగుచుండుటచే నీవు పాఱిపోఁగలుగుదువు. రేపు వచ్చినయెడల చీఁకటిలో నేమి జరుగునో చూచెదవు."

రాజు—"హా హా హా హా!"

మంత్రి—"హాా హాా హాా హాా హాా!"

సేనాపతి—"హిః"

రాజు—"తరువాత?"

రాజుగారు తృప్తిపొందలేదని కనిపెట్టి రమూాయి మరల ప్రారంభించెను. "ఎందుచేతనోగాని దొంగకు భయము పూర్తిగా గలుగక వాఁడా మఱుచటి రాత్రికూడ దొరవారియింటికి వచ్చెను. ఇంటియావిడ, "అంతయు ఆఖరైనది లేవండి లేవండి," అని కేకలువేసినది. "నీవు లేవఁగూడదా?" అని దొరవారనిరి, "నేను లేచిన నేమి ప్రయోజనము?" అని యన్నది భార్య.

"ఏమి ప్రయోజనమూ! లేచి దీపము వెలిఁగించుము, చీఁకటిలో నేనేమియుఁ జూడలేకున్నాను," అని యనిరి సేనాపతిగారు. భార్యకు చాల కోపగించినది. భర్త అంతకంటె కోపగించి, "నష్ట-మునకు నీవే కారణము, దీపము వెలిఁగించి తుపాకి తీసికొని రావేల?" అని యనెను. ఇంతలో దొంగ తనపని ముగించు కొని, "అయ్యా నేను చాల అలసి పోయినాను, కొంచెము గుడు గుడు పీల్చనీయండి," అనెను. "ఆహా ఉండుము, గుడుగుడు సిద్ధముచేసి యిచ్చెదను, కాని నాదగ్గఱకు వచ్చినచో, ఇదిగో, ఇది చూడుము, ఈ తుపాకితో నీతల గుఱుగుఁగొట్టెదను, జాగ్రత," అని సేనాపతి దొంగను పెద్దగర్జనతో బెదరించెను. గుడుగుడు పీల్చినతరువాత దొంగ, "స్వామీ కన్నముతీయు గునపము పడిపోయినది ఎంతవెదకినను కనబడకున్నది, మీరు దీపము వెలిఁగించినయెడల నాకును మేలగును," అని యనెను. "గాడిద భయపడుచున్నాఁడు...దగ్గఱకు రావలదు, జాగ్రత" అని కేకవేసి దొరగారు దీపము వెలిఁగించిరి. దొంగ సావకాశ ముగ సామానులు మూటగట్టుకొని నిర్భయముగ బయటకు వెడలెను. "గాడిద భయపడిపోయినాడు," అని దొరగారు భార్యతో ననిరి.

రాజుమంత్రులు నవ్వాపుకొనలేకున్నారు. ఫర్నాండిజ్ బలవంతముగ నవ్వుతెచ్చుకొని ఉండియుండి, 'హిః హిః' అనుచు బయటకు వెడల ప్రయత్నించును.

రాజు—"నేను మా అత్తవారియింటికి పోఁబోవుచు-న్నాను నీ వెఱుఁగుదువా?"

రమారాయి—"అసారం ఖలు సంసారం సారం శ్వశుర-మందిరం (నవ్వు—మొదట రాజుగారు, తరువాత మంత్రి, చివరకు సేనాపతి). "ఆమాట నిజమే. శ్వశురమందిరములో నుండునవన్నియు సారవంతములైనవి—అక్కడనుండు ఆహా-రము, ఆదరము—అన్నియు సారవంతములే, పాలలోని మీఁగడ దొరకు నక్కడ, చేపలకూర తినునప్పుడు తలలు మన-వంతుకు వచ్చును. అక్కడ దొరకు నన్నివస్తువులును సారవంత ములే సందేహములేదు, (నిట్టూర్పు విడుచుచు) నిస్సారమైనది భార్యమాత్రమే!"

"అది యెట్లు రమారాయి! నీ అర్ధాంగి—" అని నవ్వుచు ననుచుండ, రమారాయి చేతులుజోడించి జబాబు మొదలు పెట్టెను—"ఆమె నర్ధాంగి యనకూడదు మహారాజా; మూఁడు జన్మములపాటు తపస్సుచేసినచో నేనామె యర్ధాంగుఁడ నౌదు నేమోగాని, నావంటి అర్ధాంగుల నైదుగురిని కలిపికట్టినను ఆమెతో సమానముకాలేరు!" (యథావిధి నందఱును నవ్వ సాగిరి). ఆ హాస్యములోని రస మందఱకును బోధపడినదిగాని మంత్రిగారికి మాత్ర మవగాహన కాలేదు, అందువలన మంత్రి గారు నలుగురికంటె అధికముగ నవ్వవలసివచ్చినది.

రాజు—"మీయింటి యిల్లాలు మహాశాంతస్వభావము

గలది యనియు, ఇంటిపనియం దాసక్తిగలదియనియు, నేను వినుచున్నాను!"

రమాాయి—"దానివలన ప్రయోజనమేమి మహారాజా! మాయింట నన్నిరకముల చెత్తకు స్థలమున్నది, నాకుమాత్రము లేదు. ప్రతిదినమును ప్రాతఃకాలమున నామె యాడ్చిన యాడ్పువలన నేను మహారాజావారి ద్వారముదగ్గఱ వచ్చి పడుచుందును."

ఈసందర్భమున రమాాయి భార్య విషయమై కొంత చెప్పవలసియున్నది. ఆమె అతి కృశాంగి, రోజుకురోజు మఱింత సన్ననై పోవుచున్నది. రమాాయి ఇంటికి వచ్చుసరి కామె యతని కంటి కగపడకుండ నేదో ఒకమూలను దాఁగొనుచుండును. రమాాయి రాజసభయందు పండ్లిగిలించువిధము వేఱు, ఇంటికి వచ్చి ఇగిలించువిధము వేఱు. గృహిణి యథార్థస్వరూపమును వర్ణించినచో మన మనస్సున హాస్యరస ముదయించుటకు మాఱుగ దుఃఖరస ముదయించును. కావుననే భర్తవారు రాజసభయం దామెను స్థూలకాయగను ఉగ్రచండిగను వర్ణించు చుందురు. అది విని రాజును మంత్రియు న వ్వాపుకొన లేకున్నారు.

న వ్వాగిన పిదప, "నీవుకూడ నాతో రావలసియుండును రమాాయి, సేనాపతినికూడ కొనిపోసితివుచున్నాను," అని రాజుగారనిరి.

రమాాయి సేనాపతిమీఁద మఱియొక మా ఆతనిబుద్ధి ని

ప్రయోగింపబోవుచున్నాడని బోధపఱచుకొని అతఁడు కండ్లకు సులోచనములు తగిలించుకొనెను; చొక్కాకు గుండీలు తగిలించి విప్పుచుండెను.

రమాయి—"ఉత్సవస్థానమునకు వచ్చుటకు సేనాపతి దొరగారికి ఎట్టి సంకోచమును నుండఁగూడదు, ఉత్సవస్థానము యుద్ధభూమి కాదు గదా!"

గొప్ప నవ్వును తెప్పించుమాటలు రమాయి చెప్పఁబోవుచున్నాఁడని నమ్మి రాజును మంత్రియు మిగుల కుతూహలులై "యుద్ధమునకైనచో మాత్రము సంకోచ మేల?" అని యడిగిరి.

"దొరగారిముక్కున రాత్రింబగళ్లు సులోచనము లంటియే యుండును. నిద్ర పోవునపుడుగూడ దొరగారు అవి పెట్టుకొనియే యుందురు, లేనిచో స్పష్టముగా కలనుగనుటకూడ కష్టమగును. యుద్ధమునకుఁ బోయినయెడల గుండుదెబ్బకు అద్దములు ముక్కలయి కండ్లు కన్నములగునేమో యని దొరగారు భయపడుచుందురు. అంతేకదా, సేనాపతి మహాశయా!"

సేనాపతి కండ్లు చికిలించి, "ఇంక మఱేమి కాఁగలదు!" అనుచు లేచి నిల్చుండి, "మహారాజా! ఆజ్ఞనిండు నేను పోయెద నిఁక," అని యనెను.

రాజు- -"ప్రయాణమునకు సిద్ధముగా నుండుము, నా అఱువదినాలుగుగడలయోడ సిద్ధపఱచి యుంచవలెను" మంత్రియు సేనాపతియును బయటికి పోయిరి.

రాజు "గతతూరి మా యత్తవారియింట నన్ను మిక్కిలి

ముద్దుచేసి పాడుచేసి పంపినారు, నీకంతయుఁ దెలిసియే యుండును రమాయి?"

రమాయి—"చిత్తము మహాప్రభూ, మహారాజువారికి తోఁక యొకటి తగిలించినారు."

రాజుగారు నవ్విరి—నిజమే; నోటిలోనిపండ్లు మెఱపు-వలె మెఱసినవి, నిజమే; కాని లోనమాత్రము ఘోరాంధకారమువంటి మేఘ మావరించినది. ఆవృత్తాంతము రమాయికిఁ దెలిసినదని విని రాజుగారానందించ లేదు ఇంకెవరికేఁ దెలిసినను రాజుగా రింతసిగ్గుపడియుండరు—తదేకదీక్షగా గుడుగుడు పీల్వ నారంభించిరి.

రమాయి—"తమ బావమఱఁదులలో నొకడువచ్చి నాతో నిట్లనెను, మహారాజా,—'పడకగదిలో ప్రవేశించుచుండ మీ మహారాజుగారికి తోఁక యున్నదని బయలుపడినది. అతఁడు నిజముగా రామచంద్రుఁడో, లేక రామదాసుఁడో నీవు చెప్పఁగలవా? మునుపెన్నఁడును నిట్టిసంగతి మేము వినలేదే!' నేను దానికి తత్క్షణమే ప్రత్యుత్తర మిచ్చితిని. 'మునుపిట్లు వినఁగలిగియుండరు, అది పూర్వమునుండి యుండిన వస్తువు కాదు. వివాహమునకై మీ దేశమునకువచ్చి, 'యస్మిన్ దేశే యదాచారం' గనుక, మీ యాచారము నవలంబించిరి—ఏ దేశమునకున్న యా దేశాచారముల నవలంబింపవలెను కదా!"

జవాబు విని రాజుగారమితానంద మొందిరి.

రమాయివలన తనముఖమే కాక తనపూర్వులముఖములు

కూడ నుల్లాసముచే వికాస మొందినవనియు, ప్రతాప  ని-
లోని ఆ  ్డుడు శాశ్వతముగా రాహుగ్రస్తుఁడాయె ననియు
రాజుగారికి తోఁచినది. యుద్ధమనిన నెట్లుండునో రాజుగా
రెన్నఁడును జూచియుండలేదు, ఇట్టి చిన్నచిన్న ఘటనలనే
యుద్ధమని యూహించి సంతోషించుచుండిరి. ఈనాఁటివఱకు
తనకు జేరిగినఘోరావమానము తలఁపునకు వచ్చునప్పుడెల్ల
రాజేగారు చావుగోరుచుండిరి, కాని నేఁడుమాత్రము రమా-
యియు సేనాపతియు యుద్ధమునందు జయముఁపొంది వచ్చి-
నట్లువలె నానందమునొందిరి. ఐనను అతని సిగ్గు పూర్తిగాఁ
పోలేదు.

రాజు—"రమాయ్, ఈమాఱుకూడ మనము జయము-
పొంది రావలెను, మనకే జయముకలిగినచో నీకీ యుంగర
మును బహుమతిగ నిచ్చెదను."

రమాయి—"సందేహమేల మహారాజా? తమరు
రమాయిని అంతఃపురములోనికిఁ దీసికొనిపోఁగలిగినచో అతఁడు
తమయత్తగారిచే నాలుగు చెఱువులనీళ్లు త్రాగింపనిదే విడిచి
పెట్టఁడు."

రాజు—"ఆవిషయమై అంత యాలోచనయేల? ని
న్నంతఃపురములోనికి అతిసులభముగ తీసికొనిపోఁగలను."

రమాయి—"తమ కసాధ్యమైన దేమున్నది?"

రాజుగారి నమ్మకముకూడ నదియే! తాను చేయలేని-
దేమియుండఁగలదు? రాజుగారి యనుగతవర్గములోని వాఁ

డెవఁడైన వచ్చి, 'మహారాజుగారికి జయమవుగాక' యనుచు, 'దాసుని ప్రార్థన నెరవేర్పుడు మహాప్రభూ' అనినచో, మహా మహిమాన్వితుఁడైన రామచంద్రరాయలుకూడ ఆ ప్రార్థన నంగీకరించి అట్లేయగాఁగాక అని యనుచుండును. తాను చేయ-లేనిపని యేదైన నుండఁగలదని యెవ్వరును అనుకొనఁకూడదు, ఇదియే రాజుగారికోరిక. తాను రమాయిని అంతఃపురములోనికి తీసికొనిపోవలెను; అక్కడ, రాజమహిషియైన తనయత్తగారిని రమాయి యెగతాళిచేయవలెను; అప్పుడే తనపేరు రామచంద్ర రాయలు కాఁగలదు; ఈ గొప్పకార్యము నెఱవేర్పలేనిచో తాను రాజయి యేమి ప్రయోజనము?

చంద్రద్వీపాధిపతి యప్పుడు రామమోహనమాల్‌ను పిలిపించెను. రామమోహనుఁడు పరాక్రమమున భీమునివంటి-వాఁడు, సుమారు నాలుగుమూరలజేనెడు పొడవు, చక్కని కండలు తీరిన శరీరము. మోహన్ పెద్దరాజుగారి కాలమునాఁటి వాఁడు. రామచంద్రుఁడు చంటివాఁడుగా నున్నప్పు డతని నాడించుచుండెను. కోటలో నుండునందఱును రమాయిని చూచి జడియుచుందురు, రమాయిని జడిపింపఁగలవాఁడు, రామమోహనమా లొక్కఁడే. మోహానునకు రమాయిని జూచిన పరమాసహ్యము. మోహనుఁడు తనను తృణీకరించు చున్నాఁడనుమాట యనుకొనినంతమాత్రమున రమాయి సంకోచమువలన కృంగిపోవుచుండువాఁడు, మోహనునిఁ దప్పించుకొని పాఱిపోవుటకు యవకాశమును వదలువాఁడు

కాఁడు. రామమోహనుఁడు వచ్చి రాజుగారియెదుట నిలిచి యుండెను. రాజుగారు తమతోఁ నేఁబదిమంది యనుచరులను దీసికొనిపోవుచున్నారనియు మోహనుఁడు వారికి సర్దారుగా రావలెననియు మోహనునితోఁ జెప్పిరి.

రామమోహనుఁడు "చిత్తము మహాప్రభూ! రమాయి ఠాకూర్*గారుకూడా వచ్చెదరా?" పిల్లికన్నులను, హ్రస్వాకారమునుగల రమాయిఠాకూర్ ఒకమూలను అంటిపెట్టుకొని నిలిచియుండెను.

* 'శాస్త్రులువారు' 'పంతులుగారు' అని మనము పేరునకు కలుపు-నట్టుగా కలిపిన పదము.

## ఎనిమిదవ పరిచ్ఛేదము

యశోహారపుర రాజప్రాసాదమున నౌకరుచాకర్లకు నేడు పనితొందర విశేషముగా నున్నది. అల్లుడు వచ్చునని అనేక-విధములైన యేర్పాట్లు జరుగుచున్నది, భోజన సరాంజాములు కూడ జరుగుచున్నవి. చంద్రద్వీపరాజవంశము యశోహారపుర రాజవంశముతో పరిపోల్చి మాటాడుటకైనను దగినది కాదు. ఈవిషయములో రాణికికూడ రాజుగారి మతమే, ఐనను అల్లుడు వచ్చుచున్నాడు గదాయని రాణికి నేడు మహానంద-ముగ నున్నది. ఉదయము లేచినది మొదలు రాణి తనచేతు-లతో విభను ముస్తాబుచేయుట మొదలుపెట్టినది—దీనివలన విభకు చీకాకు గలుగుచున్నది. ముస్తాబులో చిన్నచిన్న విషయ ములలోకూడ వృద్ధురాలైన తల్లిరుచి వేఱు యువతియైన కొమార్తె రుచి వేఱు, కాని విభయభిప్రాయములతో పనియే మున్నది, కొమార్తె కేది బాగుగనుండునో తల్లికే కొమార్తె కంటె బాగుగ దెలియును గదా! ఆకాశము రంగుగాజులు మూడేసి తొడగించుకొనినయెడల దన తెల్లని లేతచేతు లెంతయో చక్కగ నుండు నని విభ యభిప్రాయము. వానికి మారుగా చేతికి నెనిమిదిచొప్పున లావైన బంగారు గాజులు తొడిగించి వజ్రములుతాపిన మోటుకంకణములు పెట్టి ఆ చేతు-లను చూచి భరింపలేని యానందములో తల్లి అంతఃపురములో

నుండు ముసలివాండ్రను, విధవగాణులను పిలిపించి తెప్పించినది. తన చక్కని చిట్టిముఖమునకు నత్తు ఎంతమాత్రము బాగుగ నుండదని విభయెఱుంగును, ఐననేమి, తల్లి ఒక పెద్దనత్తు తెచ్చి విభముక్కునఁ దగిలించి, యామె గడ్డముక్రింద చేయినుంచి ఇటు నుండి అటు, అటునుండి ఇటు త్రిప్పుచు గర్వముతో కొమార్తె ముఖము చూచుచుండెను. ఇదియంతయు సహించి ఊరకుండిన విభ, తల్లి పెట్టినకొప్పు అద్దమున చూచుకొని సహించి యూర-కుండలేక సురమకడకుఁ బోయి తనకు నచ్చినట్లు సిగవేయించు కొనివచ్చినది. తల్లికండ్లు తక్షణమే దానిపై పడినవి;ఇంత చక్కని ముస్తాబంతయు కేవల మీ సిగవలననే పాడైపోయినదని తల్లి యనుకొనినది. విభ అందముగా నుండుట చూచి యోర్వలేక సురమ అంత చక్కనికొప్పును పాడు చేసినదని నమ్మి రాణి విభకు మెలకువ తెప్పించచలేనని సురమ నీచస్వభావమును వర్ణింప మొదలుపెట్టినది. చాలసేపు సురమను దిట్టినతరువాత రాణి తన ప్రయత్నము సఫలముగుట కనిపెట్టి విభ సిగను విప్పి తన యిష్ట ప్రకారము కొప్పుపెట్టినది. ముక్కునుండు నత్తు, తలపైనుండు కొప్పు చేతులను నింపియుండుగాజులు, హృదయమును నింపు చుండుఆనందము వీనినన్నియు భరించుచు విభ మిగుల యాందోళన పడుచుండెను. తనహృదయమును నింపి, ఎంత నొక్కియుంచి నను బయటికి వచ్చుచుండు నాహ్లాద మింక దాగియుండదని విభ తెలిసికొనినది. లోనుండి తొంగిచూచుచుండు మెఱపా యను నట్లు మధ్య మధ్య విభముఖమున నది వ్యక్తమగుచుండెను.

ఇంటిగోడలు సహితము తన్నెగతాళి చేయుచున్న ట్లామెకుఁ దోఁచుచుండెను. యువరాజుదయాదిత్యుఁడు వచ్చి సిగ్గుతోను ఆనందముతోను నిండియున్న చెల్లెలిముఖమును ముద్దుతోఁ జూచుచు నానందించెను; చెల్లెలి యానందమువలన కలిగినసంతోషమును భరింపలేక తనగదిలోనికిఁ బోయి నవ్వుచు నతిప్రేమతో సురమను ముద్దుపెట్టుకొనెను.

సురమ—"ఏమి జరిగినది?"

ఉదయాదిత్యుఁడు—"ఏమియు లేదు."

అంతలో వసంతరాయలు విభను చేయిపట్టుకొని బలవంతముగ లాగుకొని వచ్చి గదిలో నిలువఁబెట్టి, "తాతా ఒక్కమారు, మా ముసలమ్మవైపు చూడుము; సురమా, నీ వాఁడదలిముఖ మొక్కమారు చూడుము," అనెను. వసంతరాయలు ఆనందపరవశుఁడై న వ్వాపుకొనలేక దేహ-మంతయు కదలించి నవ్వుచు విభముఖము చూచి, "నీ కానంద-ముగ నున్నయెడల మనసార ఒక్కమారు నవ్వుము తల్లీ చూడవలెనని యున్నది," అని యనెను.

"ముసలివాఁడ నయిపోతిని, వయస్సు మరలిపోయినది. అట్లుకాకుండిన నీముఖము చూచుచు నిక్కడనే పడియుండి, ఇక్కడనే చచ్చియుందును — ముసలివాఁడ నైపోతిని, మరణించువయస్సు దాఁటిపోయినది. యౌవనమున నుండినచో ప్రతిక్షణము చావగలిగియుందును, ఇప్పుడు రోగమేదైన రానిదే చావు ప్రాప్తింపదు."

అల్లుని సన్మానించి తీసికొనివచ్చుట కెవరు వెళ్లినారని బావమఱఁది ప్రతాపాదిత్యుని అడిగెను. "ఏమో" అన్నారు మహారాజావారు. "దారివెంట దీపములు తప్పక పెట్టింప వలెను," అన్నాఁడు బావమఱఁది. "తప్పక పెట్టింపవలెను, అను దానికి అర్థములేదు," అనిరి రాజావారు. కండ్లు పెద్దవిచేయుచు బావమఱఁది సంకోచముతో, "నహబత్ ఏర్పాటుచేయనక్కర లేదా?" అని యడిగెను. అట్టి విషయములన్నిటివి గుఱించి మీ రాలోచింప నవసరములేదు," అనిరి రాజావారు—బాజా భజంత్రీతో అల్లుని నింటికిదీసికొనివచ్చుట ప్రతాపాదిత్యునిపని కాదు—అది అసలు సంగతి.

మామగారు తన్ను ఇచ్ఛాపూర్వకముగా అవమాన పఱచుచున్నారని నమ్ముటవలన రామచంద్రరాయలలో కోపము, పౌరుషము పుట్టినవి. ఇంతకుఁబూర్వము, రెండుమాఱులును, అల్లుని సన్మానించి తీసికొనిరమ్మని ప్రతాపాదిత్యుఁడు తనరాజ ధానికి కొంతదూరముననున్న 'చకదిహి'యను గ్రామముపఱకు భటులను పంపియుండెను. ఈ మా ఱా గ్రామము దాఁటి రెండు క్రోసు లివతలనున్న "వామన్ హాటీ" యను స్థలమునకు వచ్చు వఱకు దివానుగారు రామచంద్రుని కలియలేదు, సన్మానించుటకు వచ్చిన దివానుగారితో నిన్నూటయేఁబదిమంది మనుష్యులు మాత్ర ముండిరి, యశోహారపురమంతయు వట్టిదైపోయినదా? మనుష్యులు మఱి దొరకలేదేమో! అల్లుని నెక్కించి తీసికొని పోవుటకువచ్చిన ఏనుఁగుకంటె స్థూలకాయుఁడైన దివానే

భారీవిగ్రహమని నిశ్చయించి, రమాయి దివానుతో, "ఈ ఏనుఁగు మీకనిష్ఠభ్రాత గాఁబోలు," అని యనెను. దివాను మంచివాఁడు, ప్రశ్న విని ఆశ్చర్యపడి, "లేదు అది ఏనుఁగు," అని ప్రత్యుత్తరమిచ్చెను.

"మీ మంత్రి ఎక్కుచుండు ఏనుఁగు ఇంతకంటె చాల పెద్దది," అని కోపముతో రామచంద్రరాయలువారు సెలవిచ్చిరి.

దివాను—"యేనుఁగులన్నియు రాజ్యకార్యములపై పోయియున్నవి, మిగిలియున్నది ఇది యొక్కటిమాత్రమే."

తన్నవమానపఱచుటకే మామగారు ఏనుఁగులను దూరదేశము పంపించియుందురని రామచంద్రుఁడూహించెను—అది కాక వేఱుకారణమేమి యుండఁగలదు? రాజాధిరాజగు రామచంద్రరాయలు ముఖ మెఱ్ఱచేసి, "ప్రతాపాదిత్యరాయలకంటె నే నేవిషయమున చిన్న?" అని యడిగెను.

రమాయి—"వయస్సున మీరు చిన్న, సంబంధమునుబట్టి మీరు చిన్న, మఱిదేనియందును మీరు చిన్నకాదు,—వారికొమార్తెను మీరు వివాహమాడితిరి కనుకనే..."

రామమోహనుఁడు సమీపముననే నిలిచియుండెను. వాఁడది విని సహించి ఊరకుండలేక, "అనవసరముగ మాటలాడుట మీకభ్యాసమైపోయినది. మా రాణియమ్మగారి విషయమై మీరేమియుననఁగూడదు, అది జ్ఞప్తియుంచుకొనుఁడు," అని కోపముతో పలికెను.

ప్రతాపాదిత్యుని సూచించుచు రమాయి ఇట్లనసాగెను —“నే నిట్టి యాదిత్యుల ననేకులను చూచియున్నాను. ఇట్టి యాదిత్యుని చంకను నొక్కియుంచగలవాఁడు రామచంద్రుని దాసులలో లేకపోలేదు. అది మహారాజువా రెఱుఁగని విషయము కాదు.”

రాజుగారు నోటికి చేయి యడ్డము పెట్టుకొని నవ్వసాగిరి. రామమోహనుఁ డప్పుడు మెల్లఁగ నడుగులు వేసికొని రాజుగారి యెదుటకు వచ్చి, “ఈ బాపనవాఁడు మీ మామగారివిషయమై నోటికి వచ్చినదంతయు కూయుచున్నాఁడు, అదిచూచి సహించి యూరకుండుట నాకు సాధ్యముకాని పని, మీ యాజ్ఞయైనచో ఈక్షణమే అతని నోరు మూసెదను,” అని యనెను.

రాజుగారు—“నీ వూరక యుండుము రామమోహన్!”

నేఁడు జరిగిన ప్రతిసామాన్యవిషయమును గుఱించియు ఆలోచించి యాలోచించి, ప్రతాపాదిత్యుఁడు తన్నవమానపఱపవలెనని చాలకాలమునుండి ప్రయత్నించుచున్నాఁడని రామచంద్రరాయలు నిర్ధారణచేసెను. ఈ నమ్మకము తన పౌరుషమును మఱింత వృద్ధిచేసినది. తానెంతవాఁడో చూటగల యాకారము ప్రతాపాదిత్యునియెదుట ధరించియుండవలెనని అతఁడు నిశ్చయించుకొనెను.

రామచంద్రరాయలు ప్రతాపాదిత్యుని చూచుటకు వచ్చునప్పటికి ప్రతాపాదిత్యుఁడు మంత్రులతో కలసి సభచేయుచుండెను. ప్రతాపాదిత్యుఁడు కనఁబడినతోడనే అల్లుఁ డాయన కడకు పోయి ఆయనకు ప్రణామ మొనరించెను.

ప్రతాపుఁడు కొంచెమైనను సంతోషముగాని చీకాకు గాని కనఁబడక "క్షేమమా?" అని బహు నిరుత్సాహముతో నడిగెను.

'చిత్త' మని రామచంద్రుఁడు మృదుస్వరముతో ప్రత్యుత్తర మిచ్చెను.

ప్రతాపాదిత్యుఁడు మంత్రివైపు చూచుచు, "భాంగామాథీపరగణా తహసీల్దారుపై వచ్చిన ఫిర్యాదును గురించి యేమిచేసితివి?" అని యడిగెను.

మంత్రి పెద్దకాగిత మొకటి పైకితీసి, రాజావారిచేతి కిచ్చెను. రాజావా రది చేదువ నారంభించిరి. చేదువుచు చదువుచు ముఖము కొంచె మెత్తి, "గత సంవత్సరమునకువలె ఈయేఁటకూడ మీవైపు వరదలు రాలేదు కదా?" అని అల్లుని ప్రశ్నించిరి.

రామచంద్రుఁడు—"చిత్తము, లేదు. ఆశ్వయుజమాసమున నొకమాఱు—"

ప్రతాపాదిత్యుఁడు—"దీని నక లొకటి ఉంచితివా, మంత్రీ?" అని మంత్రితో ననుచు మంత్రి వ్రాసినది చదువు చుండెను. చదువుట పూర్తియైన పిదప, "అంతఃపురములోనికి వెళ్లుము బాబూ," అని అల్లునితో ననెను.

రామచంద్రుఁడు నెమ్మదిగ లేచెను, మామగారు తన కంటె ఏ విషయమున పెద్దవారో తెలిసికొనెను.

## తొమ్మిదవ పరిచ్ఛేదము

రామమోహనుఁ డంతఃపురములోనికి వచ్చి, విభను నమస్కరించి, "అమ్మా! నిన్ను చూడవలెనను నాశతో వచ్చితిని," అని చెప్పినప్పుడు విభమనస్సున నెంతయో ఆనంద ముదయించినది, మోహానునియెడల ఆమె కెంతయో ప్రేమ! నానావిధములగు పనులనడుమ సందుచేసుకొని మోహనుఁడు విభను చూచి పోదమని అప్పుడప్పుడు వచ్చుచుండెను. ఎట్టియావశ్యకత లేకున్నను, తనయవకాశమునుబట్టి, విభను చూడవలెనని యే కేవలము వచ్చిపోవుచుండువాఁడు. రామమోహను నెదుట విభ కేవిధమైన సిగ్గును లేదు. బలిష్ఠుఁడును, వృద్ధుఁడును దీర్ఘకాయుఁడునైన మోహనుఁడు "అమ్మా" యనుచు వచ్చి యెదుట నిలిచియున్నప్పుడు వాని హృదయముననుండునది అలంకారరహితమగు సరళానురాగము. అట్టి సమయముల యందు విభకు తానొక చిన్నబాలిక యని తోచుచుండును. రామమోహనుడు ఆమె కిన్నినాళ్లుగ కనబడకుంటకు కారణ మేమియని విభ యడిగినది.

రామమోహనుఁడు—"పుత్రులలో కుపుత్రుఁ డుండ వచ్చునుగాని కుమాత యనునది లోకములలో నుండదు కదా అమ్మా! అమ్మ నన్ను పిలువనంతకాలము వెళ్లకూడదని నాలో నిశ్చయించుకొంటిని—ఎంతకాలమునకు నేను మనస్సునకు

వత్తునో చూడవలెనని వేచియుంటిని—కాని, అమ్మకెన్నటికిని నామాట జ్ఞప్తికి రాలేదు !"

విభ గొప్పచిక్కులలో పడినది. తాను కబురుపంపకుండు-టకు కారణ మతనితో చెప్పజాలదు కాని కబురు పంపకుండు టకు తాను మఱచిపోవుట కారణము కాదు, అయినను అది పొరపాటెట్లనదగునో మోహానునకు బోధపఱచుట యెట్లు ?

విభ కంగారుపడుచున్నదని కనిపెట్టి రామమోహానుఁడు "లేదమ్మా, రాకపోవుటకు నిజమైనకారణ మది కాదు, నాకు తీరికలేక రాలేకపోతిని," అని యనెను.

విభ—"కూర్చుండుము మోహన్, కూర్చుండి మీ యూరిమాటలు చెప్పుము."

కూర్చుండి రామమోహానుఁడు చంద్రద్వీపము వర్ణింప నారంభించెను. గడ్డము చేతిపై నానుకొని విభ తదేకధ్యాన-ముగ వినుచుండెను. ఆమాటలు విభమనస్సున నెట్టియూహా-లను పుట్టించుచుండెనో, విభ ఆనాఁడాకాశమున నెన్నెన్ని-మేడలను, ప్రాసాదములను నిర్మించుచుండెనో చెప్పుట కెవరి తరము! మోహా నప్పుడు గతసంవత్సరపు వరదలమాట చెప్ప నారంభించెను—తన ఇల్లు వరదలలో కొట్టుకొనిపోయినది; అతఁడు ముసలితల్లిని వీఁపుపై కూర్చుండఁ బెట్టుకొని ఈఁదు కొనిపోయి ఆమెను దేవాలయశిఖరముపై కూర్చుండబెట్టెను, వారిద్దఱు నారాత్రియంతయు నచ్చటనే గడపవలసివచ్చినది—విభ

యీకథ మిగుల యాతురతతో వినుచుండ ఆమెలోనుండు చిట్టిగుండె దడదడ కొట్టుకొనసాగినది.

కథ పూర్తియైనతోడనే మోహానుఁడు రెండుజతలు గాజులు బయటికి తీసి, "ఇవి నీకొఱకు తీసికొనివచ్చితిని, ఇవి నీవు తొడుగుకొనియుండగా నాకు చూడవలెనని ఉన్నది," అని యనెను.

విభ తనచేతినున్న బంగారుగాజులలో నాల్గింటిని తీసి మోహాను తెచ్చినవానిని తొడుగుకొని నవ్వుచు తల్లియొద్దకుఁ బోయి, "అమ్మా మోహానుఁడు నీ విచ్చినగాజులు తీయించి ఈగాజులు తొడిగించెను," అని చెప్పెను.

తల్లి కోపపడక నవ్వుచు, "మోహాను నీకు ముస్తాబు చేయుచున్నాఁడా! నీ చేతు లిప్పు డెంతయో అందముగా నున్న"వని యనెను.

దీనివలన రామమోహానునకు ఉత్సాహమును, సంతో-షమును కలిగినవి. రాణి మోహానుని తీసికొనిపోయి, తానే స్వయముగా దగ్గఱనిల్చుండి, వానిచే భోజనము చేయించినది.

మోహానుఁడు కడుపార భోజనముచేయుట చూచి రాణి మిగుల సంతసించి, భోజనానంతరము, "ఆ 'ఆగమని' లోని పాట పాడుము మోహన్ వినవలెనని యున్నది." అని యనెను.

మోహాను విభవైపు చూచుచు పాట ప్రారంభించెను.

రామమోహానుని కనులనుండి నీటిధారలు పడు-

చేెండెను; విభవైపు చూచుచు రాణికూడ కనులు తుడుచు-కొనుచుండెను; అగమునిపాట వినుటవలన రాణికి తన 'విజయ' మాట జ్ఞప్తికి వచ్చినది.

సాయంకాల మగుచున్నది, పురనారీగణముతో నంతఃపురము నిండుచున్నది. అల్లునిఁ జూచుటకును, తమతమ సంబంధముల కుచితమగునట్లు అతనితో హాస్యమాడుటకును ఇరుగుపొరుగులవారు ఒక్కొక్కరుగ వచ్చుచున్నారు. ఆనం-దము, సిగ్గు, సంకోచము—వీనియన్నిటితో కలసి, "ముందు కేమి కాఁబోవుచున్నదో" యను నొక అస్పష్టమగుదిగులు విభ మనస్సున ఉదయించుచున్నది. ఆమె ముఖ మెఱ్ఱనగుచున్నది; కాళ్లుచేతులు చల్లనగుచున్నవి, మనస్సున పుట్టుచున్నది సుఖమో భయమో ఆమెకే తెలియలేదు.

అల్లుఁ డంతఃపురమున ప్రవేశించినతోడనే రమణీమణు లతనిని నాలుగువైపులను ముట్టడించిరి. నవ్వులు వరదలై పరుగెత్తుచున్నవి; నలుదిక్కులనుండి హాస్యపుమాటలు కోకిల స్వరముతో వచ్చి తగులుచున్నవి; మృణాళ హస్తములతో మొట్టికాయలు తలుగుచున్నవి ; పుష్పముబవంటి వ్రేళ్ల చివర నుండు గోళ్లతనిని గిల్లుచున్నవి. రామచంద్రుఁడు ఏమియు చేయలేక ఇటునటు చూచుచు నిలిచియున్న సమయమున నడివయస్సుననుండు స్త్రీ యొకతె అతనిపక్షమయి దగ్గఱకు వచ్చి నిలిచినది. ఈమె యాఁడు మాటలు మృదువైనవి కావు. అవి యంతకంతకు మఱీ మోటగుచువచ్చినవి. చిట్ట

చివర కెవ్వరును వినరానిమాటలుకూడ నామె పలుకుట ప్రారంభించినది, పురస్త్రీలనోళ్లు మూసికొనిపోయినవి. 'థాకో దీదీ'* మతి నోరు తెఱవలేక పోయినది. 'విమలాదీదీ' నోరుమూసికొని బయటికి వెళ్లిపోయినది. 'మాలతి' తల్లి మాత్రము జోరైన మాటలు నాలుగు వినిపించుచున్నది. ఆ మధ్యను పెద్దకేకలు వేయుచు, "నీముఖమున నుండునది నోరు కాదే, చీపురు," అని యన్నది, ఆ క్రొత్తగా వచ్చిన యామెది. "నీముఖము పెంట-కుప్పకంటె తక్కువైనదే, చీపురుతో నెంత తుడిచినను శుభ్రము కాదు," అని యనుచు గదిలోనుండి పైకి వెళ్లినది మాలతితల్లి. ఈవిధమున, ఒక్కొక్కరుగ, గదివిడిచి అందఱును బయటికి పోయిరి, రామచంద్రరాయలునకు కొంతవిరామము దొరకినది.

అప్పు డా ప్రౌఢ రాణిగదిలోనికిపోయెను. రాణి యప్పుడు దాసివాండ్ర నందఱిని నొక్కచోట కూర్చుండబెట్టి వారికి విందు చేయుచుండెను. రామమోహనుఁడుకూడ నొకమూలను కూర్చుండి భోజనము చేయుచుండెను. ప్రౌఢ రాణియొద్దకు పోయి, "ఇదిగో రాణిగారు యిక్కడ!" అన్నది. ఈమాటలు రామమోహనునిచెవిని పడగానే వాఁడు ఉలికిపడి అటువైపు చూచెను; తత్క్షణమే విస్తరవిడిచి పెద్దపులివలె నుఱికి ఆ ప్రౌఢపై బడి తన రాక్షసబలముతో నామెచేతులను గట్టిగా పట్టుకొని, "మీ సేవలో నేనెటుఁగుదును ఠాకూర్" అనెను. అట్లనుచు, ఆ తలమీఁదనున్న ముసుగు నూడలాగెను—ముసుగులో

*దది=అక్క

నున్నది, వే తెవ్వరును కాదు, రమాయి ఠాకూరుగారే! కోపమువలన రామమోహానుని దేహమున కంపము పుట్టినది, తన మీఁదనుండు కండువా పారవైచి రమాయిని సునాయాసముగా ఆకాశముపై కెత్తిపట్టుకొని, "నేఁడు నాచేతిలోనున్నది నీచావు," అనుచు అతనికి దిగులుగల్గునట్లు ఇటునుండి అటు, అటునుండి ఇటు వడిగా త్రిప్పసాగెను. రాణి అది చూచి మోహానునొద్దకు పరుగెత్తుకొని వచ్చి, "ఏమి మోహాన్, ఇది ఏమి?" అని గడిబిడపడుచు అతని వారించెను. రమాయి "శరణు శరణు బాబూ, బ్రహ్మహత్య చేయకుము, నన్ను క్షమింపుము," అని భీతితో వేఁడుకొనెను. అందఱు కేకలు వేయసాగిరి. రామమోహానుఁడు రమాయిని క్రిందికి దించి కోపముతో వణఁకుచు, "ఓరి యభాగ్యుఁడా, పశువా, నీకు చచ్చుటకు వేతేస్థలమును దొరకలేదఁట రా, ఇక్కడి కేల వచ్చితివి?" అని యనెను.

"మహారాజావారు న న్నిక్కడికి పంపినారు," అని రమాయి యనెను. మోహానుఁ డది విని, "ఏమంటివి రా, విశ్వాసఘాతకుఁడా! ఆమాట నీనోట మఱియొకతూరి వెడలినచో నీముఖమును ఆ నేలపై రాసెదను," అనుచు వాని దగ్గరకుపోయి వానిపీక పట్టుకొనెను.

రమాయి యప్పుడు మిగుల భీతిఁజెంది కేకలువేయ నారంభించెను. రామమోహానుఁడు రమాయిని తన కండు-

వాలో కట్టి మూటవలె చేతులలోనుండి వ్రేలాడించుచు బయటకు వచ్చెను.

ఈ కథ ఇంతలో నాలుగువైపుల సల్లుకొనినది. అప్పటికి రాత్రి పదిపదునొకండు దాటినది. బావమఱది వచ్చి ప్రతాపాదిత్యునితో నల్లుఁడు రమాయిని స్త్రీవేషముతో నంతఃపురములోనికిఁ దీసికొనిపోయెననియు, అక్కడ నా విదూషకుఁడు పురరమణులతోనే కాక రాణితో కూడ నెగతాళి చేయఁ దొడగెననిఁ జెప్పెను.

అది విని ప్రతాపాదిత్యుఁ డొక భయంకరరూపమును దాల్చెను. కోపముచే నతని దేహమంతయు కంపింపసాగెను. కేసరములు పొదుచుకొని వచ్చుచున్న సింహమువలె లేచి పఱుపుపై కూర్చుండి రాజు, 'లఛ్మన్'* సరదార్ను పిలుచుకొనిరమ్ము," అని దగ్గఱనున్న నౌకరుతో బిగ్గఱగా ననెను. లక్ష్మణ్ సర్దార్తో, "రామచంద్రరాయని నఱికి అతనితల నా కీరాత్రియే చూపవలెను,"అని రా జాజ్ఞాపించెను. లక్ష్మణ్ సర్దార్ సలాముచేయుచు, "చిత్తము మహాప్రభూ!" అన్నాఁడు. బావమఱది రాజుగారికాళ్లు పట్టుకొని "క్షమింపుడు మహారాజా, అట్టిపనిచేయఁబోకుఁడు, విభమాట కొంచె మాలోచింపుడు," అనెను.

ప్రతాపుఁడు మొదటికంటె రౌద్రుఁడగుచు, "నేటిరాత్రే

*లక్షణ

రామచంద్రునితల నేను చూడవలెను," అన్నాఁడు, బావ మఱఁది ప్రార్థనకు జవాబుగా. బావమఱఁది రాజు కాళ్లను వదలక, "వా రిద్దఱును నే డంతఃపురమున పండుకొనియున్నారు. క్షమింపుడు మహారాజా, క్షమింపుఁడు!" అని మరల ప్రార్థించెను. ప్రతాపాదిత్యుఁడు కొంతసేపూరక యుండి, "విను లఛ్మన్, రామచంద్రుఁ డుదయమున అంతఃపురమునుండి బయటకు వచ్చుసమయమున అతనిని చంపవలెను—ఆ పూచీ నీపై నుంచితిని మఱువకుము," అని యనెను. తా ననుకొన్నదాని కంటె కథ చాలదూరము వెళ్లినదని కనిపెట్టి బావమఱఁది విభ గదికడకు వచ్చి తలుపు తట్టెను. దూరమున అర్ధరాత్రి వేళ వాయించు నహబత్ వాఁగుచున్నది. ఆ నిశ్శబ్దమున దూరము నుండి వచ్చుచున్న నహబత్ ధ్వనియు, మెల్లగా వీఁచుచున్న దక్షిణవాయువును, చల్లగా కాయుచుండు వెన్నెలయు— అన్నియు కలసి నిద్రించుచున్న ప్రాణులలో స్వప్నమును రేపుచున్నవి. తెఱచియున్న కిటికీలోనుండి వెన్నెల ప్రవేశించి విభమంచముపైఁ బడుచున్నది, రామచంద్రరాయలు నిద్రించుచున్నాఁడు. విభ చేతిపై తలనానుకొని ఏమో యాఁలోచించుచు పఱుపుమీఁదఁ గూర్చుండియున్నది. విభ ముఖమును వెన్నెల వంక త్రిప్పియున్నది. కనులనుండి రెండుమూఁడ శ్రుబిందువులు రాలినవి—తా ననుకొనిన ట్లేదియును జరుగలేదని, అనుకొనుచున్నదేమో! లోపున దుఃఖము పుట్టుచున్నది గాఁబోలు!

ఎంత కాలమునుండియో ఎదురుచూచుచుండిన దినము వచ్చినదే!

పల్లిపుమీఁదఁ బరుండినది మొదలు రామచంద్ర రాయలు విభతో నొక్కమాటైనను మాటాడలేదు. ప్రతాపాదిత్యుఁడతని నవమానపఱిచెను, తానెట్లు తిరిగి యతని నవమానపఱచఁగలఁడు? విభను విడిచి వెళ్లి పోవుటవలననా? అటు ప్రక్కకుఁ దిరిగి పరుండి విభతో నిట్లనవలెనని రామచంద్రుఁడు తలఁచుచుండెను—"నీవు యశోహరాధీశుఁడగు ప్రతాపాదిత్యుని కొమార్తెవు. చంద్రద్వీపమునకు రాజగు రామచంద్రుని పక్కనెట్లుండఁగలవు? అది నీకుతగినపదవి కాదే!" కాని ఆప్రక్కకు తిరిగినవాఁడు ఈప్రక్కకు మఱల తిరుగలేదు. అతని మానాభిమానములు విభ యెదుటనే కదా! విభ నిద్రలేక కూర్చుండి ఆలోచించుచున్నది, ఒకతూరి వెన్నెలవైపు ముఖము త్రిప్పుచున్నది, ఒకతూరి భర్తవైపుతిరుగుచున్నది, ఆమెగుండెలలో వణఁకుపుట్టుచున్నది, మనస్సులో బాధకలుగుచున్నది, ఉండియుండి ఆమె పెద్దనిట్టూర్పు విడుచుచున్నది. రామచంద్రుడు కొంచెము నిద్రించి హఠాత్తుగ లేచిచూచుసరికి ప్రక్కనుకూర్చుండియున్న విభకనులనుండి నీరు కారుచున్నది. చటాలున నిద్రనుండి లేచుటవలన రామచంద్రునకు తనయవమానము జ్ఞప్తికి రాలేదు, గాఢనిద్రవలన అతని మనస్సునకు స్వస్థతకలుగుటచే అందుకూడియున్న కోపమంతయు చెదరిపోయినది. అట్టి సమయమున అశ్రుధారలతో నిండియున్న విభ కోపముఖ మతనికంట-

పడినది. అతనిమనస్సు కరిగి దయతో నిండినది. అతఁడు విభ చేయి పట్టుకొని, "ఏడ్చుచున్నావేల విభా?" అని యడిగెను. విభ జబాబు చెప్పలేక తడబడుచుండెను, ఆమె కంటికేమియు కనబడు-చుండలేదు, ఆమె మాటాడక పఱుపుపై వ్రాల రామచంద్రుఁడు లేచి ఆమెతలను మెల్లగ తనయొడిలోఁ బెట్టుకొని ఆమె కనులను తుడువసాగెను. అట్టి సమయమున ఎవరోవచ్చి తలుపు కొట్టిరి. "ఎవరది?" అన్నాఁడు రామచంద్రరాయలు. "తలుపు తీయవలెను తత్క్షణమే," అని జబాబు వచ్చినది బయటినుండి.

## పదియవ పరిచ్ఛేదము

రామచంద్రరాయలు పడకగదితలుపు తెఱచి బయటకు వచ్చెను. మహారాజుగారి బావమఱఁది రమాపతి యతనినిజూచి, "నీవు ఈక్షణమే పాఱిపోవలెను, ఒక్కనిమిషమైన నాలస్యము చేయఁగూడదు," అనెను.

అర్ధరాత్రివేళ అకస్మాత్తుగా ఆమాట చెవినిపడగానే రామచంద్రునికి మతిపోయినట్లైనది, ముఖము తెల్లఁబారినది, "ఏమి, ఏమి, జరిగిన దేమి?" అని యడిగెను,

"అదంతయు నేనిప్పుడు చెప్పజాలను, నీవుమాత్రము క్షణమైన నాలస్యముచేయక పాఱిపోవలెను."

విభ మంచము దిగివచ్చి, "ఏమి జరిగినది మామా? ఏమి జరిగినది?" అని యడిగెను.

"అదియంతయు నిప్పుడు చెప్పిన లాభములే దమ్మా."

విభ వణఁకుట మొదలుపెట్టినది. ఆమెకు వసంతరాయలు జ్ఞప్తికివచ్చె నొకమాఱు, ఉదయాదిత్యుఁడు జ్ఞప్తికివచ్చె నొక-మాఱు, "ఏమి జరిగినదో చెప్పవు మామా," అని మఱియొక తూరి యడిగెను.

ఆప్రశ్నకేమియు నుత్తర మీయక రమాపతి రామ-చంద్రునితో, "ఆలస్యము చేయక యిక్కడనుండి పాఱిపోవు-నుపాయ మొకటి చూచుకొనుము," అని యనెను.

చేటూలువ సందేహముకలిగి విభ, వెళ్లిపోఁబోవుచున్న మామ కడ్డపడి, "మామా, నీకాళ్లు పట్టుకొనుచున్నాను, ఏమి జరిగినదో చెప్పు" మని యన్నది.

రమాపతి భీతిఁజెంది, నాలుగువైపులఁ జూచుచు, "బిగ్గ-రగా మాటలాడుకు మమ్మా, అంతయు నీతోఁజెప్పెద." ననెను.

రమాపతి కొంచెము కొంచెముగ జరిగినదంతయు విభతోఁ జెప్పెను. అది విని విభ బిగ్గరగ నేడ్వఁబోవుచుండుట చూచి రమాపతి యామె నోటిని మూసి, "ఊరకుండుము తల్లీ, అంతయు మంటఁగలసిపోవును, జాగ్రత" అనెను. విభ నోరు బిగించుకొని యేడ్చుచు నక్కడనే కూలఁబడినది.

రామచంద్రరాయలు మిగులభీతితో, "నే నిప్పు డేమి చేయవలెను? పాఱిపోవుటకు దా రేదైన నున్నదా? నే నేమియు నెఱుగనే!" యనుచుండెను.

"ఈ రాత్రి అన్నివైపులను పహారా మిక్కిలి చురుకుగా జరుగుచున్నది. నేను నాల్గుదిక్కుల చూచి వచ్చెద. దారేదైన నుండునేమో!" అనుచు రమాపతి అచ్చటనుండి వెళ్లఁబోవుచుండ, విభ యాతనిఁ బట్టుకొని, "ఎక్కడికి వెళ్లెదవు మామా? నీవు మమ్ములను విడిచిపోవద్దు, ఇక్కడనే యుండుము," అనెను.

"విభా, నీకు పిచ్చెత్తినది, నే నిక్కడ కూర్చుండుటవలన నెవ్వరికిని ఎట్టిమేలును గలుగదు, నాలుగువైపులకును పోయి పరిస్థితు లెట్లున్నవో చూచివచ్చుట దానికంటె మేలు."

విభ బలము తెచ్చుకొని లేచి నిలిచినది, కాళ్లు గజగజ వణఁకుచున్నవి, "మామా, నీవు మఱికొంచెము సే పిక్కడనే యుండుము, నే నొక్కరుూఱు అన్నయ్యదగ్గఱకుఁ బోయి వచ్చెదను," అని యనుచు ఉదయాదిత్యునిగదిలోనికి వెళ్లినది.

క్షీణచంద్రుఁ డప్పుడే అస్తమించుచున్నాఁడు. అంధకార మన్నివైపులను గ్రమ్ముకొని వచ్చుచున్నది. అన్ని వైపులను నిశ్శబ్దము. రామచంద్రరాయలు గడపపైః నిలిచి చూచు-చున్నాఁడు — రాజాంతఃపురమునుండు రెండు వరుసల గదులలోను ఒక గదితలుపైనను దెఱచియుండలేదు, అందఱును నిశ్చింతగా నిద్రించుచున్నారు. ఎదుట నంగణమున, ప్రక్కల నుండు ప్రహరిగోడలనీడ పడుచున్నది; ఒక ప్రక్కనుమాత్రము వెన్నెలింకను పడుచుండెను, అదికూడ నీడతోపాటు మెల్ల మెల్లగ జరుగుచున్నది. అంధకారము ఒక్కొక్కయడుగు వేయుచు పృథ్వినాక్రమించుకొనివచ్చి దూరమున కొబ్బరి తోఁటలో వరుసలుతీరి నిలిచియున్న చెట్లనడుమను జముకూడ-చు క్రమముగా అక్కడనుండు వారి ఒడిలినిదాకునంత దగ్గరకువచ్చు చున్నది. నలుదిక్కుల క్రమ్మియున్న యంధకారమధ్యమున నాకొఱకు కత్తి యొకటి ఎక్కడ వేచియున్నను యుండవచ్చు నని రామచంద్రుఁ డనుకొనుచుండెను. 'వెనుకనా ముందునా, కుడివైపుననా ఎడమవైపుననా? అదిగో ఈ మూలను! ఆమూల నేదో కదలుచున్నట్లున్నది. ఎవరైన ఆమూలలలో నొకమూలను ముసుఁగువేసికొని కూర్చుండియుండలేదు కదా!

నాగదిలో నెవరైన దాఁగొని యుండలేదు కదా! మంచము క్రింద నెవఁడైన నుండునేమో లేక గోడమూలలను నక్కియున్నాఁడా!'—ఇదేరీతిని పలుపలువిధముల ననుకొనుటవలన రామచంద్రునియొడలు భయముచే గగురుపొడుచుచున్నది, దేహమున చెమట క్రమ్ముచున్నది. మామ యేమైన చేయఁదలఁచుకొని ఇక్కడకు వచ్చెనా యని అతనికి భయముకల్గిన దొకమాఱు. కొంచెము ముందునకుఁ బోయి నిలుచుండెను. గాలివలన దీపమారిపోయినది, మనుష్యుఁ డెవఁడో దీప మార్పి యుండును కాబోలు! గదిలో నెవఁడైన నుండవచ్చునని తోఁచినది రామచంద్రునకు. రామచంద్రుఁడు రమాపతికి దగ్గఱగా వచ్చి యతనిమీఁద చేయివేసి, "బాబయ్యగారూ!" అన్నాఁడు. "ఏమి బాబూ?" అని యడిగెను రమాపతి. విభ దగ్గఱనుండిన నెంతబాగుగనుండునని తోఁచినది రామచంద్రునికి రమాపతిపై నమ్మక మతనికి చాలదు.

విభ అన్నదగ్గఱకు పోయి యేడ్చుచు నేలకూలినది, నోట మాటరాలేదు. సురమ యామెను లేవఁదీసి కూర్చుండఁబెట్టి, "ఏమి జరిగినది విభా?" అని యడిగెను. విభ సురమను రెండుచేతులతో గట్టిగా కౌఁగిలించుకొని ఏడ్చుచుండెను, నోటితో నేమియుఁ జెప్పలేకపోయెను. ఉదయాదిత్యుఁడు ముద్దుతో విభ తలపై చేయివేసి, "ఏమి చెల్లీ, ఏమి జరిగినదమ్మా?" అని యడిగెను. అన్నచేతులను పట్టుకొని

"నాతో కలసిరమ్ము, నీ కంతయు బోధపడు నన్నయ్యా," అన్నది విభ.

ముగ్గురునుకలసి విభగదిలోనికిఁ బోయిరి. అక్కడ, చీఁకటిలో రామచంద్రుఁడు కూర్చుండియున్నాఁడు, రమాపతి నిలుచుండియున్నాఁడు. "జరిగిన దేమి మామా?" అని ఉదయాదిత్యుఁడు కలతఁజెందుచు నడిగెను. రమాపతి వృత్తాంతమును సవిస్తరముగఁ దెలియఁజేసెను. తనపెద్దకండ్లను మఱింతపెద్దవిచేసి సురమవైపు చూచుచు నుదయాదిత్యుఁ డిట్లనెను—"నే నిప్పుడే నాన్నయొద్దకువెళ్లెదను, ఏదెట్లైనను, ఆ పని మాత్రము, నాన్నను చేయనీయను—ఎంతమాత్రము చేయనీయను."

సురమ—"మీరు పోవుటవలన లాభమేమి? అంతకంటె తాతయ్య నక్కడకు పంపుట మేలు, ఆయన యేమైన చేయగలుగవచ్చును!"

యువరాజు—"ఔ నది నిజమే!"

వసంతరాయ లప్పు డగాధనిద్రలో నుండెను. కళ్లు విప్పినతోడనే ఉదయాదిత్యుఁడు కనఁబడెను. తెల్లవాఱవచ్చిన దని యనుకొని వసంతరాయలు లలితరాగముపై పాట మొదలు పెట్టఁబోయెను.

"కొంపమునిఁగినది తాతయ్యా!" అన్నాఁడు, పాట నాఁపుచు.

వసంతరాయలు పాట నిలిపి దిగులుబడుచు, హాఁ! ఏమి? ఏమయినది తాతా, ఏమిటా ప్రమాదము!" అని యడిగెను.

ఉదయాదిత్యుఁడు సమస్తమును తాతయ్యతోఁ జెప్పెను. వసంతరాయలు పఱపుమీఁద చతికిలపడి ఉదయాదిత్యుని ముఖము చూచుచు, "ఎన్నఁడైన నటువంటిది జరుగఁగలదా? అట్టిది సంభవమేనా?" అని యనుచుండెను.

వసంతరాయలు ప్రతాపాదిత్యునియొద్దకు వెళ్లి, "నిజ-మేనా నాయనా ప్రతాప్, అట్టి దెన్నఁడైన జెరుగఁగలదా?" అని యడిగెను. ప్రతాపుఁడు అప్పటి కింకను శయనగృహమునకుఁ బోలేదు, సభామందిరమందే యుండెను. ఆజ్ఞయిచ్చిన తరువాత 'లక్ష్మణ్ సరదారును' కొంచెమాగుమని చెప్పవలెనని ప్రతాపునకు బుద్ధిపుట్టినది. కాని యా కోరిక యెంతలో పుట్టి-నదో అంతలోనే మాయమైనది. రెండుమాటలవాఁడు కాఁడు ప్రతాపుఁడు, తన నోటితో నిచ్చిన యాజ్ఞను తన నోటితోనే నిలుపుచేయుట ప్రతాపునకు సాధ్యముకానిపని—ఆజ్ఞలతో పరిహాసమా! అట్లైన......విభమాట యేమికాను? విభ విధవ యానే! .........కాని రామచంద్రుఁ డిచ్ఛాపూర్వకముగ మంటలోనికి దుమికి చచ్చినను విభ విధవ కావలసినదే కదా! రామచంద్రుఁ డిప్పుడు చేసిన దేమి?—ఇచ్ఛాపూర్వకముగ ప్రతాపునిరోషాగ్నిలోనికి కుఱికెను, విభ విధవ యగుట దానిఫలస్వరూపమే; అది తా నెట్లాపఁగలఁడు? ఈమాట లన్నియు నింతవివరముగా ప్రతాపునిమనస్సున నుదయించ

లేదు, కాని ఉండియుండి జరిగినదంతయు కండ్లకు కట్టినట్లుగ తిరిగి జ్ఞప్తికి వచ్చుచుండెను. బహు అశాంతితో నతఁడు ఎప్పుడు తెల్లవారునా యని చూచుచుండెను. ప్రతాపుఁ డట్టి యవస్థలోనుండ వృద్ధవసంతరాయలు కలవరపడుచు గదిలోనికి వచ్చి ప్రతాపుని రెండుచేతులను పట్టుకొని, "నిజమే! నాయనా ప్రతాప్, అట్టి దెన్నఁడైన జరుగఁగలదా?" అని ప్రశ్నించెను.

ప్రతాపాదిత్యుఁడు రౌద్రుఁ డగుచు, "ఏల జరగఁ-గూడదు?" అని యనెను.

వసంతరాయలు—"వాఁడు కుఱ్ఱవాఁడు, ముందు రాఁబోవునది తెలిసికొనలేనివాఁడు—అట్టివానిపై వెళ్లఁ-బుచ్చఁదగినది కాదు నీ క్రోధము."

ప్రతాప ఁడు—"కుఱ్ఱవాఁడా! మంటలో చేయి పెట్టినయెడల చేయి కాలునని తెలిసికొను ఈడు రాలేదా వానికి! కుఱ్ఱవాఁడు, పాపము! మూర్ఖులయెదుట పండ్లిగిలించి హాస్యపుమాటలు చెప్పుచు పొట్టపోషించుకొను దరిద్ర మూర్ఖబ్రాహ్మణునికి ఆడువేషము వేయించి రాణితో నెగతాళి చేయ తీసికొనివచ్చుటకు తగిన తెలివిగలవానికి, ఆ తెలివివలన గలుగులాభనష్టముల నూహించుకొను బుద్ధి యేల కలుగ లేదు? బుద్ధి తలలో దూరుటకు ముందే తలదేహమును విడిచి పాఱి పోవును! ఇదియే దుఃఖకరమైన సంగతి!" ఇట్టి మాటలు అతని దేహమున పుట్టిన కంపమును అధికము చేయుచున్నవి, అతని ప్రతిజ్ఞను దృఢపఱచుచున్నవి.

"పాపము, వాఁడు కేవలము కుఱ్ఱవాఁడు, ఏమియు నెఱుఁగని పసిబాలుఁడు !" అని వసంతరాయలు తలయూఁచుచు ననుచుండెను.

ప్రతాపాదిత్యుఁడు మఱి యోర్చియుండ లేక ఇట్లనసాగెను—"యశోహరపుర రాయలవంశమునకు మానావమానములు దేనివలన కలుగునో ఆ జ్ఞానము నీకున్న యెడల నీపండుతలపైని మొగలాయీపాదుషాల పగిడీ పెట్టుకొని తిరుగుచుందువా *బాబా? పాదుషా ప్రసాదగర్వితుఁడవై నీవు తల మీఁదికెత్తి తిరుగుచుండుట చూచి నేను తల వాల్చుకొనవలసివచ్చుచున్నది. యవనులపాదముల మట్టిని తిలకముచేసి నీవు నొసటఁబెట్టుకొనుచున్నావు. ఆ యవనపాదధూళిమయము గు నీ తలను ధూళిపాలు చేయవలెనని నాకు కోరికగా నుండెను, కాని విధాత యడ్డుపడుటవలన అది నెఱవేఱలేదు. రాయలవంశమునకు నేఁ డెంత యవమానము జరిగినదో పోల్చుకొన లేవు! నీవు కాబట్టి మనవంశము నవమానపఱచిన వానిని క్షమింపుమని యడుగుచున్నావు!"

"నాకిప్పుడు బోధపడినది ప్రతాపా!" అన్నాఁడు వసంతరాయలు. "నీవెత్తినకత్తి యెవరో ఒకరిపైఁ బడియే తీరవలెను. గుఱియైన నేను ప్రక్కకు జరిగిపోవుటచేత మఱియొకరు నీకు కావలసివచ్చినది. నీ మనస్సులో దయపుట్టక, నీ క్రోధక్షుధ కెవ

* పినతండ్రి.

రైన నాహారముగ కావలసియుండిన, నన్నే ఆ యాహారముగఁ జేసికొనుము. ఇదిగో నీ పినతండ్రి తల," అనుచు వసంతరాయలు తన తలను వాల్చెను. "నీ కిది తృప్తినిచ్చుచో దీనిని తీసికొనుము—కత్తిని తీసికొనిరమ్ము—ఈ తలపై జుట్టులేదు, ఈ ముఖమున యౌవనము లేదు. యమునియొద్దనుండి నిమంత్రణ పత్రము వచ్చియున్నది, దాని కనుగుణమైన ముస్తాబే ఇప్పు డాతలలో కనఁబడుచున్నది. (వసంతరాయలముఖమున చిఱు-నవ్వు కనబడుచున్నది) ఏదైనను కానిమ్ము కాని, పాలుత్రాగు పసిబిడ్డయగు మన విభ కంట నీరు—" ఇట్లనుచు వెక్కి వెక్కి యేడ్వనారంభించెను. "నన్ను కడతేర్చుము ప్రతాపా, బ్రతికి నాకు సుఖ మింక లేదు, విభ కంట నీరు చూడకముందే నన్ను చంపివేయుము నాయనా!"

వసంతరాయ లిట్లనినతోడనే ప్రతాపాదిత్యుఁడు మెల్లఁగ లేచి బయటకుఁ బోయెను, కథ అందఱకును తెలిసి-పోయినదని పోల్చుకొనెను, క్రిందికిఁ బోయి ప్రహరీవాండ్రను పిలిపించి, కోటనంటియుండు కాలువలో పెద్దపెద్ద దూలముల నడ్డువేయుమని చెప్పెను. ఆకాలువలోనే రామచంద్రుని యోడ యుండెను. ఆ రాత్రి మిక్కిలి జాగ్రత్తగా నుండవలె ననియు, కోటనుండి యెవ్వరినిఁగూడ బయటకు పోనీయఁగూడ దనియు వాండ్రతోఁ జెప్పెను.

## పదునొకండవ పరిచ్ఛేదము

వసంతరాయ లంతఃపురములోనికి తిరిగివచ్చెను. విభ తాతను చూచినతోడనే యేడ్వనారంభించెను. వసంతరాయలు ఉదయునిచేతులు పట్టుకొని, "తాతా నీవు దీని కేదైన నుపాయము కనిపెట్టవలెను," అనుచు మఱి యాపుకొనలేక ఏడ్వసాగెను. రామచంద్రరాయలు భయముతో వణఁకుట మొదలు పెట్టెను. ఉదయాదిత్యుఁడు కత్తి చేతఁబుచ్చుకొని "మీరు నాతో కలిసి రండు," అనెను. అందఱును వెనుక వచ్చుచుండుట జూచి ఉదయుఁడు, "విభా నీ విక్కడనే యుండుమమ్మా, నీవు మాతో రావ"ద్దని యనెను. విభ వినలేదు, రామచంద్రుఁడు, "విభను మనతో రానిమ్ము"అని అనెను. మడమల నెత్తి వ్రేళ్లపై నడచుచు అందఱును అతిభయముతో నడచుచుండిరి, అన్ని వైపులను చిట్టచీఁకటి. అంధకారగర్భమునుండి భయంకరముగున చేదో తనచేతులను చాచుచున్నదా యనునట్లుండెను. రామ-చంద్రుఁడు ముందుకు వెనుకకు ప్రక్కలకు జాగ్రత్తగాఁ జూచుచుండెను. మధ్యమధ్య మామపై సందేహము కలుగుచుండెను. అంతఃపురమునుండి బయటకుఁ బోవుద్వారముకడకు వచ్చి చూచునప్పటికి ఆ తలుపులు మూసియున్నవి. "అన్నయ్యా, క్రిందికి పోవుద్వారము తెలిచియుండునేమో, అటుపోయి చూదము," అని భయముతో వణఁకుచు నన్నది విభ. అంద

రును అటువైపునకుపోవు మెట్ల వెంబడి దిగ నారంభించిరి. అంధకారములోనున్న ఆ మెట్లు ఎంతకును తెలుగనట్లున్నవి. ఈ మెట్లుదిగువారు మఱి తిరిగి మీదికిరారని తోచుచుండెను రామచంద్రునికి—ఇది వాసుకి నివసించు కన్నమునకు మార్గమా? పాతాళమునకు పోవు మెట్లా ఇవి? అనిపించుచున్నది. మెట్లు దిగి చూచుసరికి ఆద్వారముకూడ మూసియున్నది. అందఱును మరల నా మెట్ల నెక్కవలసివచ్చినది. అంతఃపురమునుండి బయటికిఁ బోవుద్వారము లెన్నియున్నవో అన్నియును మూసియున్నవి, రెండుమూడుమారు లందఱును ప్రతిద్వారమునొద్దకునుబోయి పరీక్షించిరి, ప్రతిద్వారమును మూసియున్నది.

బయటికిఁ బోవుటకు దారియేదియు లేదని తెలిసికొనఁ-గానే విభ కన్నీటిని తుడుచుకొనుచు భర్తను చేయిపట్టుకొని తన పడకగదిలోనికి తీసికొనిపోయినది; ధైర్యము వహించి ద్వారముకడ ఠీవిగా నిలుచుండి, "ని న్నెవ రీగదిలోనుండి బయటికి తీసికొనిపోఁగలరో చూచెదను. నీవెచ్చటకు పోయి-నను నేను నీయెదుటనే నిలిచియుండెదను, నన్నెవరడ్డగలరో చూచెదను," అని విభ దృఢస్వరముతో నన్నది. ఉదయుఁడు ద్వారముకడ నిలువఁబడ, "నన్ను చంపనిదే గదిలో నెవ్వఁడును ప్రవేశింపలేఁడు," అనెను. సురమ ఏమియు మాటాడక భర్త ప్రక్కనే నిలుచుండెను. తాతయ్య అందఱికంటె ముందుగ నిలుచుండెను, మామ మెల్లమెల్లగ జారిపోయెను. ఈ బందో బస్తువలన లాభమున్నట్లు రామచంద్రునకు తోఁచలేదు.

"ప్రతాపాదిత్యునివంటివాడు చేయలేనిదేమి? ఉదయాదిత్యుఁ-డును విధియు అడ్డువచ్చి ఏమియైన చేయగలుగుదురని నా కాశ లేదు. ఏదో యొకరీతిని ఈ యింటినుండి బయటపడువఱకు బ్రతుకాస తక్కువే!" అని రామచంద్రుడు తనలో తాననుకొనెను.

కొంచెమునేపుండి సురమ మృదుస్వరముతో ననెను, "మన మిక్కడ నిట్లు నిలబడుటవలన లాభము లేదు. పైగా అపాయముకూడ కలుగవచ్చును. అడ్డువచ్చినకొలఁది మీ నాన్నగారిసంకల్పము దృఢమౌచుండును, ఈరాత్రియే కోటవదలి పాఱిపోవునుపాయ మేదైన కనిపెట్టవలెను."

ఉదయాదిత్యుఁడు సురమవైపుచూచుచు నేదో యాలోచించుచుండెను. కొన్నినిమిషము లట్లుండి "ఔ నది నిజమే! కనుక నేను వెళ్లి బల ప్రయోగముచేసి చూచెద" నని యనెను.

సమ్మతిని సూచించుచు దృఢముగా నిలఁబడి వెళ్లుమనినది సురమ.

ఉదయాదిత్యుఁడు తన యుత్తరీయము నచ్చట పారవేసి వెళ్లిపోయెను. సురమ కొంతదూర మతనితో కలసి వచ్చి నిర్జనస్థానమునకు రాఁగానే ఉదయాదిత్యుని తనరెండుచేతులతో పట్టుకొని కౌఁగిలించుకొనెను. ఉదయాదిత్యుఁడు ముఖము దించి ఆమెను మనసార ముద్దుపెట్టుకొని చీఁకటిలో నంతర్ధానమాయెను. సురమ కండ్ల నీరుపెట్టుకొని పడకగది-లోనికి వచ్చి చేతులు జోడించి ప్రారంభించినది——"నేనే పతి-

వ్రత నైనచో నీవు నాభర్త నతని తండ్రి చేతులలో పడకుండ కాపాడుము తల్లీ! నిన్ను నమ్మియే నే నతని నిప్పుడు విపత్తులోనికి పంపితిని. నన్ను నీవు ముంచివేసినచో జగత్తున నెవ్వరును నిన్నిఁక నమ్మరు సుమీ!" ఇట్లనుచు వెక్కి వెక్కి ఏడ్వ నారంభించినది. ఆ చీఁకటిలోఁ గూర్చుండి సురమ యెన్నోమాఱులు 'తల్లీ' 'తల్లీ' అనినది, కాని తల్లి కామెమాటలు వినఁబడినట్లు లేదు. సురమ తనమనస్సులో తానా తల్లికి పుష్పాంజలి నిచ్చినది. కాని "తల్లి యాపుష్పముల నంగీకరింపలేదని సురమకుతోఁచినది. "ఏమితల్లీ నే నేమిచేసితి నే?" అని యేడ్చుచు అడిగినది సురమ, కాని తల్లి యిచ్చుజబాబు సురమకు వినఁబడలేదు. నాలుగుదిక్కులనుండు గాఢాంధకారమున నాట్యముచేయుచున్న ప్రళయమూర్తియా యనునట్లు సురమకనుల కేదో కనఁబడుచుండెను. సురమ యచ్చట నొంటరిగ కూర్చుండి యుండలేక విభగదిలోనికి వచ్చినది.

"తాత యింకను రాలేదు, ఏమయినదో కదా!" అని దిగులుతో వసంతరాయ లనెను.

గోడను చేరఁబడి నిల్చుండి, "ఈశ్వరేచ్ఛ, యేమోకదా!" అన్నది సురమ.

రామచంద్ర రాయలప్పుడు తన పురాతనభృత్యుఁడగు రామమోహనుని తనలో తాను ధ్వంసము చేయుచుండెను. దీనియంతటికిని కారణము వాఁడే, కనుక తనకు చేతనైనన్ని విధముల తనమనస్సులో తాను వానిని శిక్షించుచుండెను.

ఉండియుండి తెలివి తెచ్చుకొని, "వానిని శిక్షించు నవకాశము నాకు మఱి చిక్కదేమో!" అని యనుకొనుచుండెను.

ఉదయాదిత్యుఁ డంతఃపురము దాఁటివెళ్లి మూసియున్న తలుపులను గట్టిగా తన్నుచు, "ఎవఁ డక్కడ?" అని కేక వేసెను.

"నేను మహాప్రభూ, సీతారాముఁడను," అని బయట-నుండి వినఁబడెను.

తక్షణమే తలుపుతీయుమని యువరాజు దృఢస్వర-ముతో ననెను.

వాఁడు తక్షణమే తలుపుతెఱచెను. ఉదయాదిత్యుఁడు ద్వారముదాటి బయటకుఁబోవుట చూచి, వాఁడు చేతులు జోడించి, "క్షమింపుఁడు మహాప్రభూ, నేటిరాత్రి యెవ్వరును అంతఃపురమునుండి బయటకు రాఁగూడదని రాజావారి యాజ్ఞ యైనది!"

"నీవుకూడ నాపై కత్తినెత్తఁ బూనుకొంటివా? అట్లైన రమ్ము," అనుచు యువరాజు తనకత్తిని ఒఱనుండి బయ-టికిఁ దీసెను.

"లేదు మహాప్రభూ, తమపై కత్తి యెత్తుటకు నాకు చేయిరాదు, నా ప్రాణములను తమరు రెండుసార్లు కాపాడి యుంటిరి, అది నే నెన్నఁడును మఱవను," అనుచు యువరాజు-గారి పాదధూళిని తల నద్దుకొన్నాఁడు సీతారాముఁడు.

"నీవు చేయఁబోవున దేదో త్వరగా చేయుము అట్లైన-వ్యవధి లేదు."

"తమరు రెండుమార్లు కాపాడిన ప్రాణమును తమరే నాశనము చేయకుఁడు; నాకత్తి తీసికొనుడు—ఇదిగో, నాకత్తి. నన్నాపాదమస్తకము బంధించి మీరు పొండు, లేనిచో నాబ్రతుకు మఱి యుండదు."

యువరాజా యస్త్రమును దీసికొని సీతారాముని కండువాతీసి దానితో వానిని గట్టిగాకట్టి తాను బయటికిఁ బోయెను. సీతారాముఁ డక్కడనే పడియుండెను. దగ్గఱనే చిన్నగోడ యొకటి అడ్డుగ నున్నది దాని కొక్కటే ద్వారము, ఆద్వారము దాటినయెడల నంతఃపురమునుండి బయటపడినట్లే. ఆ తలుపుకూడ మూసియుండుటచూచి యువరాజు దానిని తెఱవఁ బ్రయత్నించక గుప్పున గోడపై నుఱికెను. ద్వారముపై చేరఁబడి హాయిగా నిద్రించుచున్న పహరావానిని జూచి యువరాజు నెమ్మదిగా గోడ దిగి విద్యుద్వేగమున వానిపైఁ బడెను. వానికత్తిని దూరముగాఁ బాఱవైచి ఏమియు బోధపడక మతిపోయి చూచుచుండు ఆ పారావాని కాళ్లుచేతులను కట్టి, వాని యొద్దనుండు తాళముచెవిని తీసికొని ఆ తలుపు తెఱ-చెను; అప్పటి కాపారావానికి పూర్తిగా తెలివివచ్చి, "ఏమి తమరు చేయుచున్నది మహాప్రభూ?" అనెను.

"అంతఃపురములోనుండి బయటికిపోవుతలుపులు తెఱచుచున్నాను."

"రేపు మహారాజావా రడిగిన నే నేమి చెప్పఁగలను?"

"యువరాజు బలప్రయోగముచే మమ్ముల నతిక్రమించి తలుపులు తెఱచె నని చెప్పుఁడు; అట్లైన మీ కేమియు శిక్ష కాదు."

అంతఃపురము వెడలివచ్చి యువరాజు రామచంద్రుని పరివార ముంచుబసకు వచ్చెను. ఆబసలో నిప్పుడు రాముమోహను రమాయిమాత్రమే పండుకొనియున్నారు, భోజనముకాఁగానే మిగిలినవారందఱును రామచంద్రుని పడవలోనికి వెళ్లి పోయిరి, యువరాజు మోహనునిపై మెల్లగ చేయి వేసెను, మోహనుఁడు ఉలికిపడి లేచి నిలిచెను యువరాజు వానిని బయటకు తీసికొనిపోయి జరిగినదంతయుఁ జెప్పెను.

మోహనుఁడు పగిడీ చుట్టి, లాఠీ చేతఁబుచ్చుకొని, కోపముతో మండిపడుచు, "లఛ్మన్ సర్దార్ ఎంతటివాఁడో నేనును చూచెదను, మా రాజుగారిని తీసికొనివచ్చి నాకొప్పఁజెప్పఁడా! ఈలాఠీతో నూరుమందిని పరుగెత్తింపఁగలను యువరాజా," అనెను.

"అది నిజమే కాని యశోహరప్రాసాదములో భటులు వందకంటె చాల నధికముందురు. బలము ప్రయోగించి నీవు చేయఁగలిగినది అంతగా లాభింపదు, వే ఉపాయ మేదైన చూడవలెను.

"అట్లైన మహారాజావారిని నాకడకు తోడ్కొని రండు. వారు నాయొద్ద నుండిన నేను నిశ్చింతుఁడ నై యేదైన

యుపాయము నాలోచింపఁగలుగుదును.” మోహనుఁ డిట్లనిన-తోడనే యువరా జంతఃపురములోనికిఁ బోయి రామచంద్రుని తీసికొనివచ్చెను; మిగిలినవారు కూడ నతనితో వచ్చిరి.

రామమోహనుఁడు కంటఁబడగానే రామచంద్రుఁ డిట్లనెను—“నీవు నా కక్కరలే దిఁక—దూరముగ పొమ్ము. చాల కాలమునుండి యున్నవాఁడవు నీవు, నీపై నంతకు మించిన శిక్ష విధించుటకు నాకు మన స్సొప్పదు; ప్రాణములతో మరల ఇల్లు చేరుకొనఁగలిగిన నీముఖ మెన్నఁడును మఱి చూడను-” కోపమువలన మాటాడలేకున్నాఁడు రామచంద్రుఁడు.

మోహనునియెడల నతనికి నిజముగా ప్రేమయే, రామ-చంద్రుఁడు చంటివాఁడుగా నున్నప్పటినుండికూడ మోహనుఁ డతని కనిపెట్టుకొనియుండెను. చిన్నప్పుడు ముద్దాడుచు నతని నాడించుచుండెను.

మోహనుఁడు చేతులు జోడించి యనెను—“నన్ను పొమ్మనుటకు నీ వెవరవు మహారాజా? నాకీ నౌకరీ యిచ్చినది భగవంతుఁడు. యముఁడు నన్నీ లోకమునుండి తీసికొని పోయిననాఁడే భగవంతుఁడు నన్నీ యుద్యోగమునుండి తప్పించఁగలఁడు. నీవు ఉంచినను ఉంచకపోయినను నేను నీ నౌకరునే!” ఇట్లనుచు మోహనుఁడు రామచంద్రుని యెదుటకు వచ్చి నిలిచెను.

“మోహనా, ఏమి యుపాయ మాలోచించితివి?” అని యువరా జడిగెను. “తమ కృప యుండవలెనుగాని నాకుపా-

యము లేకపోలేదు—నాకుండు నుపాయము ఈలాతీయును తల్లి మహాకాళిదేవి చరణాశ్రయమును."

"ఆయుపాయ మిప్పుడు పనికిరాదు," అని తలయాడించుచు "మీరాజాగారి ఓడ యెటువైపున నున్నది చెప్పుము," అని యువరాజడిగెను.

"కోటకు దక్షిణదిక్కునకున్న కాలువలో."

"డాబాపై కెక్కిచూచి వత్తము రండు," అనెను యువరాజు.

హఠాత్తుగ నేదో యొక యూహ తట్టి మోహనుడు, "ఔ నౌను మంచిమాట! అక్కడకు పోయి చూదము రండు," అని యనెను.

అందఱును డాబామీదికి వెళ్లిరి. సుమారు డెబ్బది మూరలదూరన, కాలువలో, రామచంద్రుని యెఱువదిగడల యోడ కనబడుచుండెను. రామచంద్రుని వీపునఁగట్టుకొని దానిపై కుతికెదనని మోహనుఁ డనెను.

వసంతరాయలు తడఁబడుచు మోహనునొద్దకు పరుగెత్తి వానిని గట్టిగా పట్టుకొని, "వద్దువద్దు నీవట్టి యసాధ్యమైన పని యెన్నఁడును నూహింపకుము, దానివలన ప్రయోజన ముండ"దనెను. విభ యులికిపడి భయముతో వణఁకుచు "ఏమిటి మోహన్ నీ వనునది!" అని యన్నది; రామచంద్రరాయలు, "అసాధ్యమైన దా పని," అన్నాఁడు.

ఉదయుఁడప్పుడు లోనికి బోయి దళసరిపంచెలు, కండు-వాలు దొరకినన్ని తీసికొనివచ్చెను. వానిని నులిపి ఒకదాని చివర నొకదానిని కట్టి పెద్దత్రాఁడుగా అందఱును కలసి చేసిరి. డాబామీఁదకుబోయి అక్కడనుండు చిన్న స్తంభమువంటి ఎత్తు దిమ్మ కొకదానికి ఆ త్రాడును మోహనుడు కట్టెను. ఆత్రాడు పడవ కందలేదు, మీఁద కొంతదూరమువఱకుమాత్రము వ్రేలాడు చున్నది. "మహారాజా, నీవు నా వీఁపుమీఁద నెక్కి గట్టిగా పట్టుకొని కూర్చుండియుండుము. నేను త్రాడు పట్టు కొని క్రిందికి జారెదను," అన్నాఁడు మోహనుఁడు. రామ-చంద్రుఁ డడ్డు పెట్టలేదు. మోహనుఁ డప్పు డక్కడనుండు వారందఱకును ప్రణామముచేసి ఒక్కొక్కరి పాదధూళి తీసి-కొని రామచంద్రుని వీఁపుపై నెక్కించుకొనెను; రామచంద్రుఁడు గట్టిగా వానిని పట్టుకొనికూర్చుండి కండ్లుమూసికొనెను. రామ-మోహనుఁడు దిగుచు, విభవైపు తిరిగి, నేను వెళ్లుచున్నాను చిట్టి తల్లీ; నీ బిడ్డఁడు బ్రతికియున్నన్నినాళ్లు నీకు భయములేదు తల్లీ," అనెను.

రామమోహనుఁడు త్రాడును గట్టిగా పట్టుకొని, మెల్లఁగ దిగుచుండెను. విభ స్తంభముఁనొద్దకు పోయి దానిని నొక్కిపట్టుకొని నిలిచెను. వసంతరాయలు కండ్లు మూసికొని, వణఁకుచు, దుర్గానామస్మరణ చేయుచుండెను. మెల్లఁగ దిగిదిగి, మోహనుఁ డాత్రాడుచివరకు వచ్చెను. ఆత్రాటి నప్పుడు నోటితో కఱచిపట్టి తనరెండుచేతులతో రామచంద్రుని వ్రేలాడ

వేసి మెల్లఁగా పడవమీఁదికి డించెను. పిమ్మట తానుగూడ పడవపై నఁటికెను. రామచంద్రుఁడు పడవనుచేరుకొనగానే విభ పెద్దనిట్టూర్పు విడిచి మూర్ఛిల్లెను. వసంతరాయలు కండ్లు విప్పి, "ఏమయినది తాతా?" అని యడిగెను. మూర్ఛిల్లియున్న విభ నెంతో ముద్దుతో నెత్తికొని ఉదయుఁ డంతఃపురములోనికి వెళ్లెను. సురమ యుదయుని చేయిపట్టుకొని, "ఇప్పుడు నీ కేమానో కదా!" అని భయపడుచు నడిగెను. "నే నిప్పుడు నామాట ఆలోచించుచుండ లేదని," యువరా జనెను.

ఈవల పడవ కొంతదూరముపోయి నిలిచిపోయినది, కాలువలో పెద్దపెద్ద గుగ్గిలపుదూలము లడ్డుగ పడియున్నవి. ఇంతలో పారావాండ్రు పడవపాటిపోవుట దూరమునుండి చూచి పడవపైపునకు రాళ్లు రువ్వసాగిరి, కాని ఒక్కరాయి యైనను పడవకుఁ దగులలేదు. వాండ్ర చేతులలో కత్తులున్నవి, తుపాకులు లేవు. వాండ్రలో నొకఁడు తుపాకితెచ్చు టకుఁ బరుగెత్తిపోయెను; వెదకి వెదకి తుపాకి నొకదానిని సంపాదించెను గాని కాల్చుటకు వానికి చెకుముకి దొరకలేదు. పహారావారు, "ఓరే, మందెక్కడరా? ఓరే, గుండ్లెక్కడరా?" అనుచు ఒకరి నొకరు అడుగుచుండ రామమోహనుఁడు యిత రానుచరులతోఁ గలిసి దూలములపై పడవనీడ్చి దాటించుకొని పోయెను. రామచంద్రుని వెంబడించుటకు పడవనొకదానిని తెమ్మని పహారావాండ్రు తమలో నొకనిని పంపిరి. వీఁడు దారిలో 'హరి' దుకాణమునొద్ద నొకచిలుము గుడుగుడు

పిల్చి అచ్చట పండుకొనియున్న రామశంకరుని లేపి వాడు తన కీయవలసిన బాకీ త్వరలో నీయమని తగాదా పెట్టి పడవ కొంటను బయలుదేరెను; పడవ వచ్చినను ఇక లాభము లేదను నంత జాలమైనపిదప పెద్దకేకలతోను పాటలతోను, పడవ వచ్చినది. ఆసల్యమగుటచూచి పడవకై వెళ్లినవానిని అందఱును దూషింప సాగిరి. పడవతీసికొనివచ్చుటకు ఆలస్యమగుట నిజమే, కాని తిట్లుతిట్టుకొనుచు వాదప్రతివాదములతో దానికి మూఁడంతలాలస్యముచేసిరి. రామచంద్రునిపడవ భైరవనది చేరిన తోడనే ఫర్నాండిజ్ దొరగారొక తుపాకి పేలించిరి. అప్పటికి తెల్లవాఱవచ్చినది, నిద్రించుచున్న ప్రతాపాదిత్యుఁడు తుపాకి శబ్దమునకు లేచి 'పహరా పహరా' అని కేకలువేసెను. ఎవ్వఁడును రాలేదు. పహరావారందఱు నా రాత్రియే పాఱిపోయిరి. మొదటికంటె బిగ్గఱగా "పహరా!" అని కేక వేసెను ప్రతాపుఁడు.

# పండ్రెండవ పరిచ్ఛేదము

ఎంతపిలిచినను పహారావాఁడు రాకుండుట చూచి ప్రతాపుఁడు వెంటనే మంచము దిగి బయటికి వచ్చి, "మంత్రీ" అని పిలిచెను. భృత్యుఁ డొకఁడు పరుగెత్తిపోయి మంత్రిని తోడ్కొని వచ్చెను.

"పహారావా రేరీ మంత్రీ?"

"బయటిద్వారము వదలి రాత్రి అందఱును పాఱిపో-యిరి," అని మంత్రి తత్క్షణమే జబాబుచెప్పెను. జబాబు చెప్పుట కాలస్యముచేసినను, డొంకతిరుగుడుగా జబాబుచెప్పి-నను ప్రతాపుఁడు అగ్నిహోత్రుఁడగునని మంత్రి ఎఱుఁగును. "అంతఃపురద్వారమునొద్ద నుండువా రేమైరి మంత్రీ?" అని ప్రతాపుఁ డడిగెను.

మంత్రి- "వచ్చునప్పుడు దారిలో చూచితిని, కాళ్లు చేతులు కట్టబడి నేలను వారు పడియున్నారు." రాత్రి జరిగిన కథ యేమియు మంత్రి యెఱుఁగఁడు, కాని ఘోరమైనదేదో జరిగినదని ఊహింపఁగలిగెను— ఏ విషయమై యైనను రాజు గారి నప్పు డడుగుట అసంభవము.

"రామచంద్రరాయ లెక్కడ? వసంతరాయ లెక్కడ? ఉదయాదిత్యుఁ డెక్కడ?" అని తొందరతొందరగా ప్రతాపుఁ డడిగెను.

"వారంతఃపురములోనే యున్నారని తలఁచెదను," అని మంత్రి మెల్లఁగ ననెను.

"తలఁచుట నేను చేయఁగలపనియే, నిన్నేల యడుగ వలెను?—కాని తలఁచునదంతయు నెల్లప్పుడును నిజముకా" దని ప్రతాపుఁడు చీకాకుపడుచు ననెను. మంత్రి మఱి నోరు విప్పక మెల్లఁగా బయటికి పోయి, రాత్రి జరిగినదంతయు రమాపతి చెప్పగా వినెను. రామచంద్రరాయలు పాఱిపోయి నాఁడని తెలియఁగానే మంత్రికి భయముకల్గి బయటికిఁబోవుసరి కక్కడ మతమువేసికొని కూర్చుండియున్న విదూషకుఁడు రమాయి, అతనికంటపడి, "ఇదిగో జాంబవంతుఁడు!" అని మంత్రిని పలుకరించుచు పండ్లిగిలించెను. వానినవ్వులో కనఁ బడునది పండ్లుమాత్రమే, భయముపుట్టించు ఆపండ్ల ఇగిలింపు-నకే రామచంద్రుని సభాసదులు రసికత యనుచున్నారు. ఆ విదూషకుని యభినందనము విని మంత్రి వానివైపు చూడ-నైనను చూడక అక్కడనుండు నౌకరుతో, "వీనిని తీసికొని రమ్మ"ని యనెను. వానిని ప్రతాపాదిత్యుని క్రోధానలమున కాహారముగ నీయవలెనని మంత్రికితోచినది—మహారాజుగారి చేతనున్న వజ్రాయుధ మెవరిపైనోఁబడక మానదు, కనుక ఈ అరఁటిచెట్టుపైఁ బడినయెడల గొప్పగొప్పవృక్షముల కేమియు హానికలుగదని మంత్రి ఊహించెను.

రమాయిని జూచి రాజే అగ్నిహోత్రుఁ డాయెను— మహారాజుగారి కానందము కలుగఁజేయవలెనని రమాయి

పండ్లిగిలించుచు దేహము నష్టవక్రముల విఱుచుచుండుట చూచి మహారాజుగారికి పట్టలేని అసహ్యము కలిగినది. అతఁడు ఊరకొనలేక సింహాసనము విడిచి రెండుచేతులను విసరుచు, "వీని నవతలకు గెంటుము, ఈ క్షణమే వీనిని దీసికొనిపొమ్ము. వీని నిచ్చటకు తెమ్మని చెప్పిన దెవరు?" అని మంత్రితో ననెను. కోపముతోపాటు అసహ్యముకూడ ప్రతాపునిలో పుట్టనియెడల రమాయి మరలఁ దనయింటికి వెళ్ల నవసర ముండకపోను— వానికి తగినశాస్తి యీయవలెనన్న, వానిపై చేయివేయక సాధ్యముకాదు కదా!—కాని అట్టివాని నెట్లు ప్రతాపుఁడు ముట్టుకొనగలడు! రమాయి నాక్షణమే బయటికిఁ బంపివేసెను.

మంత్రి—"మహారాజా, అల్లుఁడుగారు—"

రాజు చీకాకుపడి తలయూచుచు—"రామచంద్ర-రాయలు—"

మంత్రి—"చిత్తము మహాప్రభూ, వారు రాత్రి కోట నుండి వెళ్లిపోయిరి."

రాజు—"వెళ్లిపోయినాఁడా? మహారావాం డ్రెక్కడికి పోయిరి?"

"పాఱిపోయిరి!" అని మంత్రి మఱియొక మాటనెను.

ప్రతాపుఁడు పిడికిళ్లు బిగించి, "ఎక్కడకు పాఱిపోయి" రని అడిగెను. "ఎక్కడనున్నను వారిని వెదకి తెప్పించుము. అంతఃపురముకడనుండు మహారావారిని పిలిపించుము తత్క్షణమే"

మంత్రి బయటికి వెళ్లెను. రామచంద్రుఁడు పడవలోనికి దిగునప్పటి కింకను చాలరాత్రి యున్నది. వసంతరాయలు, ఉదయాదిత్యుఁడు, సురమ, విభ—వీరిలో నెవ్వరును రామచంద్రుని విడిచివచ్చి పండుకొనుటకుఁ బోలేదు. విభ నోటివెంబడి ఒక్కమాటయైనను రాలేదు. కండ్లవెంబడి ఒక్కనీటిబొట్టైనను లేదు. సురమ ఆమెయొద్ద కూర్చుండి ఆమె తలపై చేయుంవేసి మెల్లగ నిమురుచుండెను. వసంతరాయలుగాని ఉదయాదిత్యుఁడుగాని మాటలాడలేదు. చీఁకటిలో నొకరిముఖ మొకరికి అస్పష్టముగ కనఁబడుచుండెను. ఆ గదిలో తమ కండ్లకగపడకుండ నెవరో కూర్చుండియున్నట్లు వారికి తోఁచుచుండెను. దాని నంధకార మనవచ్చును, భయ మనవచ్చును, అదృష్టమనవచ్చును—కాని ఏదో కూర్చుండియుండుట నిజము, దాని నిశ్వాసముకూడ వారికి వినఁబడుచుండెను. సదానందహృదయుఁడైన వసంతరాయలు నాలుగువైపులనునుండు నిరానందమును జూచి బహుదుఃఖితుఁ డయ్యెను. ఎటువైపుతిరిగినను నేమియు బోధపడక ఏమియుతోఁచక చేతితో బట్టతలను తడుముకొనుచు, ఉదయాదిత్యుని చేయిపట్టుకొని, "తాతా!" అనుచుండెను. దారితప్పితిరుగుచున్న వసంతరాయల వ్యాకులహృదయములో వేయిప్రశ్న లుదయించుచుండెను. సరియైన పదములతో చెప్పలేని ఆ సహస్రప్రశ్నలు ఆ "తాతా" అను ఒక్కపదము మూలమున వ్యక్తమగుటకు ప్రయత్నించుచుండెను.

నాలుగువైపుల నుండు నంధకారములోనుండి మాట

లేవో వసంతరాయలకు వినఁబడుచున్నట్టుండెను ; కాని వాని యర్థము బోధపడుటలేదు. అట్టిసమయమున ఉదయాదిత్యుని మాట మధ్యమధ్యను వినఁబడుచుండుటవలన వసంతరాయల మనస్సునకు కొంతశాంతికల్గుచుండెను. కొంతసే పైనతరువాత వసంతరాయ లుదయాదిత్యునిచేయి గట్టిగా పట్టుకొని, "తాతా నేనే దీనికంతటికిని కారణము కాఁబోలు!" అని విచారముతో ననెను. ప్రతాపుఁడు తన్ను జంపలేకపోవుటయే దీనికంతటికిని కారణమని వసంతరాయలకు మాటిమాటికిని తోఁచుచుండెను. ఉదయాదిత్యుఁ డప్పు డధికముగ మాటలాడు నవస్థలోలేక "నీ వెంతమాత్రము కారణముకావు తాతయ్యా," అనిమాత్రము మృదుస్వరముతో ననుచుండెను. కొంతసేపు గదిలో నెవ్వరును ఒక్కమాట యైనను అనలేదు, వసంతరాయలు చివరకు, "విభా, ఏమియు మాటలాడక కూర్చుండియున్నావేమి తల్లీ?" అనుచు విభయొద్దకుఁబోయి ఆమెకడఁ గూర్చుండెను. మరి కొంతసేపూరకుండి వసంతరాయలు, "సురమా సురమా!" అని పిలిచెను. సురమ తాతయ్యవైపు ముఖ మెత్తినది, నోట వెంబడి మాటమాత్రము లేదు. తనకుఁ దెలియని విపత్తేవో వచ్చి మీఁదపడుచున్న దనుకొనుచు, తాతయ్య, తలతడవుకొనుచు, ఆవిపత్తుకొఱకై ఎదురు చూచుచున్నట్లు కూర్చుండియుండెను.

తెల్లవాఱ వచ్చినది. వసంతరాయలు స్వేచ్ఛగా నూపిరి తీయుచు బ్రతికితి మనుకొనసాగెను. అర్థముకాని యా భయ మతనిని విడిచినది. మనస్సును ధైర్యపఱచుకొని వసంతరాయలు

రాత్రి జరిగినదానిని స్మరించి ఆలోచించుచు కొంతసేపు కూర్చుండి వీథగదినుండి బయటికిఁబోయెను. అంతఃపురద్వారమున సీతారాముఁడు కనఁబడెను. వాని కాళ్లు చేతులు కట్టియుండుట చూచి, "చూడుము సీతారామా, ప్రతాపుఁడు నిన్నడిగిన యెడల నేను నిన్ను గట్టితానని చెప్పుము, నే నొకప్పుడు మహా బలశాలిని, గనుక ప్రతాపుఁడా మాట నమ్మును," అనెను.

సీతారాముఁడు ప్రతాపాదిత్యుఁ డడుగునప్పు డేమి-జబాబు చెప్పవలెనో ఇప్పటివఱకు ఎంతయాలోచించినను నిశ్చయించుకొనలేకపోయెను. ఉదయాదిత్యునిపేరు చెప్పుటకు-మాత్ర మతని మన స్సెంతమాత్ర మొప్పుకొనకుండెను. తాటి చెట్టు ప్రమాణము, మూఁడుకండ్లు వంకరకాళ్లు గల భూతము పై, అపరాధమును మోపవలెనని సీతారాముఁడు నిశ్చయించు కొనెను. అట్టి సమయమున వసంతరాయలు దొరకుటచేత నిర పరాధియైన ఆభూతము విడుదల పొందినది. సీతారాముఁడు వసంతరాయలు చెప్పినసలహా నంగీకరించెను. వసంతరాయ లప్పుడు రెండవ పహరావానియొద్దకుఁ బోయి, "భాగవత్, రాజుగా రడిగినచో నిన్నుఁగట్టినది నేనే అని చెప్పు," మనెను అప్పుడు భాగవతునిలో సత్యాసత్యజ్ఞాన మకస్మాత్తుగా ప్రబల మై వాఁ డనత్యవిముఖతను కనపఱచెను—దానికి ముఖ్యకార ణము ఉదయాదిత్యునియెడల వీనికిఁగల కోపము.

"నాతో అటువంటి వేడుకలు చెప్పఁబోకుఁడు. అట్లు చేసినయెడల పాపము," అన్నాఁడు భాగవత్.

వసంతుఁడు వాని వీఁపుమీఁద చేయివేసి,—“నామాట నమ్ముము భాగవత్, దీనివలన నేమియు పాపము కలుగదు— అబద్ధమాడి సత్పురుషుని ప్రాణముల కాపాడుట పాపమైనచో నే నేల నిన్నిట్లనమని చెప్పెదను?” అని అనుచు, వాని భుజముపై తట్టుచు అనేకవిధముల బోధపఱచెను. కాని హఠాత్తుగా న్యాయబుద్ధి పుట్టినవానియెదుట మన యుక్తి పనికి రాదు.“లేదు మహారాజా, యజమానులయెదుట అబద్ధమాడుట నాకు చేతకాదు,” అన్నాఁడు రెండవ పహరావాఁడు.

వసంతరాయలు గడిబిడిపడుచు, “నామాట వినుము, నీకేమియును పాపము కలుగ దీ యబద్ధమువలన,” అన్నాఁడు. “నామాట యుంచుము నాయనా, నిన్ను తరువాత సంతోష పెట్టెదను, నామాట ఉంచుము; ఇదిగో ఇప్పుడు నాదగ్గఱ నున్నది, ఇది పుచ్చుకొనుము.”

పహరావాఁడు తక్షణము చేయిచాచి వసంతుఁ డిచ్చిన రూపాయలు మొలను దోఁపెను. వసంతరాయలు కొంత మన శ్శాంతిని బొంది ఇంటిలోనికిఁ బోయెను.

పహరావారి నిద్దఱిని తీసికొనిరమ్మని ప్రతాపాదిత్యుని యాజ్ఞయైనది. మంత్రి వా రిద్దఱిని దోడ్కొనిపోయెను. లోపలనుండి పుట్టుచున్న కోపము నాఁపుకొని నిశ్చలుఁడై ప్రతాపుఁడు కూర్చుండి యున్నాఁడు; మాటమాటకు నాగి మాట లతి స్పష్టముగఁ బలుకుచు, “నిన్న రాత్రి అంతఃపుర ద్వారముతలుపులు ఎట్లు విడినవి?” అని యడిగెను.

సీతారామునకు లోనుండి వణఁకు పుట్టినది, చేతులు జోడించి, "శరణు మహాప్రభూ! నాత ప్పేమియు లేదు," అన్నాఁడు.

"అది నిన్నెవ రడిగినారు?" అని కోపముతో కనుటెప్పలు విఱుచుచు రాజుగా రడిగిరి.

సీతారాముఁడు తొందరతొందరగా ఇట్లనసాగెను. "చిత్తము మహాప్రభూ, లేదు,—మహాప్రభూ యువరాజు. యువరాజావారు నన్ను కట్టి అంతఃపురమునుండి బయటికి వెళ్లి పోయిరి." 'యువరాజు' అని వానినోటినుండి చేటాలున వచ్చినది. యువరాజుపే రెంతమాత్రము చెప్పఁగూడదని తనలోతాను నిశ్చయించుకొనుచుండెను, కనుకనే కాబోలు, ఆ తత్తరపాటులో అన్నిటికంటె ముం దాపేరే వచ్చినది. నోరు జారిపోయినతరువాత, పాపము, వాఁడు చేయఁగల దేమున్నది?

ఇంతలో ప్రతాపుఁడు పహారావారిని పిలిపించుచున్నాఁడని విని వసంతరాయలు గడిబిడిపడుచు ప్రతాపునిగదిలోనికి వచ్చెను—అప్పటికి సీతారాముఁడు, "యువరాజావారితో నేనెంతయో వద్దని చెప్పుచున్నను వారు వినలేదు," అని చెప్పుచుండెను.

వసంతరాయ లదివిని తొందర తొందరగా, హాఁ హాఁ, సీతారామ్, ఏమంటివిరా, అబద్ధమాడకున్న దేవుఁడు నీకు మేలుచేయును, ఉదయునిదోష మేమియు నందు లేదు," అనెను.

సీతారాముఁడు తడఁబడుచు, "ఔను మహాప్రభూ యువరాజు తప్పేమియు లేదు," అనెను.

ప్రతాపుఁ డప్పుడు "నీతప్పా అట్లైన?"అని కఠినముగా నడిగెను.

"కాదు మహాప్రభూ!"

"మఱి యెవరితప్పు?"

"చిత్తము మహాప్రభూ, యువరాజా——"

అప్పుడు భాగవతుని నడుగఁగా వాఁడు జరిగినదంతయు సరిగా చెప్పివేసెను——వాఁడు దాచినది, తాను నిద్రపోవు-చుండె ననుసంగతి మాత్రమే! వసంతరాయల కేమియు నుపా-యము తోఁచలేదు, కండ్లుమూసికొని, 'ఈశ్వరా' 'ఈశ్వరా' అనుచుండెను. పహారావారిపనులు పోయినవి——బలము ప్రయోగించి ఎవరైన వారిని గట్టినచో అసహాయులై-కూర్చుండువారు పహారా కెట్లు పనికివత్తురు? వాండ్రయప-రాధమునకై రాజావారు వాండ్రకు కొరడాదెబ్బలు విధించిరి.

ప్రతాపుఁ డప్పుడు వసంతరాయల వైపుచూచి, "ఉద-యుని యపరాధము క్షమింపఁదగినది కాదు," అని గర్జించెను. ఉదయునితప్పు వసంతరాయలదే యనినట్లు రాజావారు వ్యవహ-రించిరి. ఉదయాదిత్యునే ఎదుట నిలుచుండఁబెట్టి దూషించు చున్నట్లు ప్రతాపాదిత్యుఁడు మాటాడెను. వసంతరాయలు ఉదయుని ప్రతాపునికంటె నధికముగ ప్రేమించుచుండుటయే అతని యపరాధము!

"బాబూ, ప్రతాపా, ఉదయునితప్పేమియు లే దిందు-లో," అని వసంతరాయలు తత్క్షణమే అనెను.

ప్రతాపుఁడు రౌద్రుఁడై లేచి, "తప్పులేదా?" అనెను. "నీవు తప్పులేదనుటచే వానిని మఱింత యధికముగ దండించె-దను, నీవేల తగవుతీర్ప నడుమ దూరుచున్నావు?"

ప్రతాపుఁ డుదయాదిత్యుని శిక్షింపఁబోవుట వసంత-రాయలకు శాస్తి నిచ్చుటకే యని అతఁడు కనిపెట్టి, మఱి యేమియు ననక ఊరకుండి తనలోఁ దానేదో యాలోచించు చుండెను.

కొంతసేపటికి ప్రతాపుఁడు శాంతించి ఇట్లనెను— "ఉదయునికి తనదియనగలది ఒక్కయభిప్రాయము లేదు, నమ్మ-కము లేదు; తానుకోరి ఏదియైనను చేయఁగలవాఁడు కాఁడు వాఁడు; ఎవరియిష్టానుసారము వారు వీని నాడింపఁగలరు, కేవల మొకకనుసైఁగవలన వీనిచే నెవఁడైన నే పనినైన చేయింపఁ గలఁడు—ఇదియంతయు నేను పూర్తిగా నెఱుఁగుదును— అట్లు కాకున్న ఉదయుని రక్షింపగలవాఁడు నేఁ డెవ్వఁడును ఉండకపోను. వీడు పక్షిఱెక్కలోని వెండ్రుకవలె ఎగురుచుండుట కనిపెట్టి ఎవ రూదుటవలన వాఁడ ట్లెగురుచుండెనో క్రిందికి చూచి పోల్చుకొంటిని. ఉదయునికి శాస్తి నిచ్చుటకు నిచ్చలేక-పోవుటకు నిదియే కారణము—శాస్తి పొందుటకుఁగూడ యోగ్యతలేదు వానికి. కాని బాబా, నేననునది వినుము, నీవు మఱియొక్క తూరియైనను ఉదయునిచూచుటకు యశో

హారపురము వచ్చినచో వానిప్రాణమును కాపాడుట ఎవ్వరికిని శక్యము కాదు."

వసంతరాయలు చాలసేపు మతిపోయినవానివలె నచట నూరక కూర్చుండి, తరువాత మెల్ల మెల్లగ లేచి, "మంచిది ప్రతాప్, ఈసాయంకాలమే నేను పోయెదను," అని యనుచు వెలుపలకుఁ బోయెను.

ఉదయాదిత్యునియెడల అనురాగము గలవారిని ఉదయుఁ డెవరెవరికి వశీభూతుఁడో వారిని దూరముగ నుంచ వలెనని నిశ్చయించి ప్రతాపుఁడు, "కోడలిని ఇఁక నిచట నుండనీయకూడదు, ఏదో యొక మిషపై ఆమెను పుట్టినింటికిఁ బంపివేయవలెను," అని మంత్రితో చెప్పెను. విభయెడల ప్రతాపున కెట్టిసందేహమును లేదు—ఎంతయైనను విభ తన యింటిపిల్ల కదా!

## పదుమూఁడవ పరిచ్ఛేదము

వసంతుఁ డుదయాదిత్యుని గదిలోనికి వచ్చి, "తాతా ఇఁక నిన్ను చూచుటకు నాకు ప్రాప్తిలేదు," అనుచు ఉదయుని యొద్దకు వచ్చి వానిని గట్టిగా కౌఁగిలించుకొనెను.

ఉదయుఁడు వసంతుని చేతులుపట్టుకొని, "ఏమి తాతయ్యా, అట్లనుచున్నావేమి?" అని యడిగెను.

వసంతరాయలు జరిగినదంతయు చెప్పి, కంట నీరుపెట్టుకొని, "నీ యెడల నాకుఁగల అనురాగమే నీ కష్టములకు మూలము, కనుక నీ విక్కడ సుఖముగ నుండిన నాకు మిగిలి యున్న నాలుగురోజులు నెట్లైన గడపుకొందును," అనెను.

ఉదయుఁడు తల యూఁచుచు, "అట్లెన్నఁటికిని కానేరదు తాతయ్యా," అనెను. "మనము తప్పక కలసికొనెదము, దాని కెవ్వరును అడ్డురాలేరు. నీవు నన్ను విడిచి, వెళ్లిపోయిన యెడల నేనెంతమాత్రము బ్రతికియుండను తాతయ్యా!"

వసంతరాయలు—"ప్రతాపుఁడు నన్ను చంపక నిన్ను నాయొద్దనుండి తీసికొన్నాఁడు. తాతా, నేను నిన్ను వదలి వెళ్ళిపోవునపుడు నీవు నావైపు చూడకుము; తాతయ్య చనిపోయినాఁడని యనుకొనుము."

ఉదయాదిత్యుఁడు తనపడకగదిలోనున్న సురమకడకుఁ బోయెను. వసంతరాయలు విభగదిలోనికిఁ బోయి విభగడ్డము

పట్టుకొని, "తల్లీ విభా, ఒక్కమాఱు లెమ్ము తల్లీ!" అనుచు నామెను లేపి, "ఈ ముసలితలమీఁద నీ చేతి నొక్కసారి వేయుము తల్లీ," అనెను. విభ తత్క్షణమే లేచి తాత తలమీఁద నుండు పండువెండ్రుకలను తీయ నారంభించినది.

ఉదయాదిత్యుఁడు సురమకు నంతయుఁ దెలియఁజేసి, "సురమా, ఈజగత్తులో నాకే రవంత మిగిలియున్నదో అది కూడ తీసికొనుటకు కుట్ర జరుగుచున్నది," అనెను. సురమ చేయిపట్టుకొని, "నాచేతులు నులిపి నిన్నెవ్వరైన నాయొద్ద నుండి తీసికొని పోయెదరా యేమి?" అని ఉదయుఁడనెను.

సురమ ఉదయుని గట్టిగ కౌఁగలించుకొని, "అది యమునికి సాధ్యము కాఁగలదు, మఱి యెవ్వరికిని సాధ్యము కాదు," అని దృఢస్వరముతోఁ బలికెను.

కాని కొంతసేపటినుండి సురమ మనస్సులోఁగూడ నట్టి భయమే పుట్టుచుండెను. తనప్రియతముని తనయొద్దనుండి లాగుకొనిపోవుటకు క్రూరహస్త మొకటి తనవైపునకు వచ్చు చున్నట్లు ఆమెకు తోఁచుచుండెను. "నా ప్రాణము పోయినను నే నతనిని వదలను," అని తనలో తా ననుకొనుచు భర్తను తన గుండెపై నుంచి గట్టిగా పట్టుకొనియున్నట్లు యూహించు కొనుచుండెను.

"నేను బాగుగ నాలోచించి చూచితిని, నిన్నెవ్వరును నాయొద్దనుండి తీసికొనిపోలేరు," అని సురమ మరల ననెను.

ఉదయాదిత్యుఁడు సురమముఖమును జూచి నిట్టూర్పు విడుచుచు, "సురమా, తాతయ్యను మన మిఁక నెన్నఁడును చూడము," అనెను.

సురమకూడ పెద్దనిట్టూర్పు విడిచినది.

ఉదయాదిత్యుఁడు—"నాకష్టమువిషయమై నేనంతగా నాలోచింపలేదు సురమా, తాతయ్య కెంత దుఃఖముగా నున్నదో కదా! భగవంతుఁ డేమి చేయఁదలఁచియున్నాడో కదా!"

ఉదయుఁడు వసంతరాయలనుగూర్చి సురమతోఁ జెప్పుచుఁ గూర్చుండెను.

వసంతరాయ లెక్కడెక్క డేమేమి చేసెనో అవి యన్నియు ఉదయునికి నేఁడు జ్ఞప్తికి వచ్చుచుండెను. వసంతరాయల కరుణార్ద్రహృదయములోనుండి వచ్చుచుండిన చిన్న చిన్నమాటలను ఆయన దయార్ద్రహృదయముతోఁ జేయుచుండిన చిన్న చిన్న పనులను సురమ ఎదుట వర్ణించుచుండెను.

సురమ ఉదయునితోఁ గలసి విభగదిలోనికిఁ బోయెను.

ఉదయాదిత్యుఁ డగపడినతోడనే వసంతరాయలు నవ్వుచు నిట్లనెను—"విభ నన్ను విడువ ననుచున్నది, చూచితివా బాబూ! నేను వెళ్లెదనని విని యేడ్చుచున్నది, విభ కంట నీరుచూచి నేను భరింపలేను! అదిగో చూడుము. విభ ఏమి చేయుచున్నదో చూడుము!......ఇదిగో విభా ఇటుచూడుము, నీ విట్లేడ్చుచుండిన—" వసంతరాయలు మఱి

మాటలాడలేకపోయెను. విభకు బుద్ధిచెప్పఁబోయి తాతయ్య తనదుఃఖమునే ఆఁపుకొనలేకపోయెను. చటాలున కండ్లు తుడుచుకొని నవ్వుచు, "సురమ ఏడ్చుచున్నది చూచితివా తాతా?" అన్నాఁడు.

ఎవరినోటినుండియు మాటరాలేదు; చివరకు సెలవుపుచ్చుకొను సమయము దగ్గఱపడినది.

వసంతరాయ లుదయాదిత్యుని గట్టిగాఁబట్టుకొని కౌఁగిలించుకొని చాలసేపటివఱకు వదలక నలిచియుండెను. సురమను జూచి, "నేనుకోరునదంతయు నీవు సుఖముగా నుండవలెననియే," అని యనెను. విభవైపు ముఖము త్రిప్పి, "విభా—" అని ప్రారంభించెను కాని మఱియొక్కమాటయైనను నోటినుండి వెలువడలేదు. కన్నులు తుడుచుకొనుచు పల్లకి నెక్కెను.

## పదునాలుగవ పరిచ్ఛేదము

యశ్శ్వేరునకు సమీపమున మంగళ నివసించుకుటీరముండెను. ఆమె జపమాల త్రిప్పుచుండు సమయమున నొకనాఁడు రాణిగారి దాసి యొకతె కూరగాయలబుట్ట చేతబుచ్చుకొని అచ్చటకు వచ్చెను.

"నేఁడు సంతకు వచ్చితిని, 'మంగళ'క్కను చూచి చాల దినములైనది, ఒకమారు చూచిపోదమని చటాలున తట్టినది. కాని అక్కా, నేఁడు చాలసేపుండలేను, పనియున్నది," అని యనుచు దాసి మాతంగ, బుట్టను క్రిందపెట్టి, నేల చతికిలఁబడెను. నాయెడల అతనికి మిగుల ప్రేమ, అది నీ వెఱుఁగనిది కాదు; ఐన నేమి, మఱి యొవతెపైకో ఇప్పు డతని మనస్సు పోవుచున్నది. అది నేను పోల్చుకొంటిని. ఆమెకు మూఁడు రోజులలో చావువచ్చు నుపాయ మేదైన చేయలేవా అక్కా?"

అవులు తప్పిపోవుచుండు మంగళయొద్ద నున్నది, భర్తలు తప్పిపోవుమందున్నది. ఇంతేకాదు, ఆమె వశీకరణమున కొక గొప్పయుపాయ మెఱుఁగును—ఈ వశీకరణోపాయము కొఱకై యే రాజభృత్యులు వచ్చి మంగళకుటీరముకడ గుంపుగూడి యుందురు. మూఁడుదినములలో నెవరిచావునకై యుపాయమును తెలిసికొనుటకు దాసి మాతంగ మంగళయొద్దకు వచ్చినదో ఆమె సాక్షాత్తు మంగళయే!

మంగళ తనలోఁ దాను నవ్వుకొనుచు, "ఆమాయలాడి చచ్చుటకు తొందరలేదు. యమధర్మ రాజునకు కొంతపని కల్పించినపిమ్మటగాని ఆమె చావదు," అని యనుకొని పైకి ఇట్లనెను—"నీవంటిరూపసిని వదలి మఱియొకరికొఱకు పోవునంత రసహీనతగలవా రెవరు? నీవు భయపడవద్దు మనుమరాలా, నీప్రియునిమనస్సు నీదే యగును; నీకండ్లనుండుమందుకంటె మంచిమందు ఈ జగత్తులోనుండదు. కనుక నీకండ్లనే మఱి కొంచెము తీవ్రముగా ప్రయోగించి చూడుము. దానివలన నేమియు లాభము లేనప్పుడు ఈవేరును తాంబూలములో పెట్టి వానికిమ్ము," అనుచు లేచి ఎండిపోయిన వేరొకటి తెచ్చి మాతంగచేత బెట్టినది.

"రాజుగారి నగరువార్త లేమి మనుమరాలా?" అని అడిగినది మంగళ.

"వానితో మన కేమి పని అక్కా!" అన్నది మాతంగ చేతులు త్రిప్పుకొనుచు.

"ఔను మంచిమాట యంటివి తల్లీ, చాల మంచిమాట," అని మంగళ అన్నది.

తనయభిప్రాయమునకును మంగళయభిప్రాయమునకును సంపూర్ణమగు నైకమత్య మంత సులభముగఁ గలుగునని మాతంగ ఎన్నఁడును నూహింపలేదు. కావున మాతంగకు కొంచె మాశాభంగము కల్గి ఇట్లు ప్రారంభించినది; "ఐనను నీతో చెప్పుటలో దోషములేదు. కాని, ఇప్పుడు వ్యవధిలేదక్కా, మఱియొక

నాఁడు వచ్చి అన్ని సంగతులును చెప్పెదను," అనుచు అక్కడనే మఱికొంచెము స్థిరముగ చతికిలబడినది.

మంగళ—"అట్లైన మఱియొకనాఁడు చెప్పుకొంద మా మాటలు."

మాతంగ చీకాకుపడుచు చెప్పసాగినది; "అట్లైన నన్ను పోనిమ్మక్కా, ఇంత యాలస్య మైనందున ఎన్నితిట్లు తినవలసి వచ్చునో!—కాని అక్కా, ఆనాఁడు రాజుగారింటికి అల్లుఁడు వచ్చి, ఎవ్వరితో చెప్పక వచ్చిననాఁటిరాత్రియే పాఱి పోయెను."

మంగళ—"నిజమే! అట్లేలచేసెనో కదా! ఇప్పుడు తెలిసె నదా మనుమరాలా,—మాతంగ కనఁబడనియెడల నాకు రాజు గారింటిమాట లేవియు తెలియవు!"

మాతంగ—"అసలు సంగతి యెఱుఁగుదువా, అక్కా! మా కోడలమ్మ రెండుకండ్లతో ఎవ్వరిని చూడలేదు. ఆమేమి మంత్ర మెఱుఁగునోగాని మగఁడు మేఁకవలె ఆమె వెంబడి తిరుగు చుండును—కాని ఆమాటలన్నియు నాకేల—ఎవ రెక్కడ నుండి వినెదరో—చిట్టచివర కంతయు నామీఁదపడును—అంతయు మాతంగ చెప్పినదే అందురు."

మఱియొకక్షణము తాళియున్నయెడల మాతంగ తనంతటతానే అంతయును చెప్పివేయునని మంగళ యెఱుఁ గును, ఐనను ఓర్చియుండలేక, "ఇక్కడ నెవరున్నారు మనుమ-

రాలా, మనలోమన మనుకొనుటలో దోషమేమున్నది?"
అనుచు, "అట్లైన మీకోడలమ్మ ఏమిచేసినది?" అని యడిగెను.

"అల్లునిదగ్గఱకు వెళ్లి అతనిభార్యమీఁద ఏమి కల్పించి చెప్పినదోగాని రాత్రికిరాత్రి అల్లుఁడు భార్యను విడిచి వెళ్లి పోయెను. భార్యఏడ్పునకు మఱి అంతములేదు; రాజుగారికి కోపమువచ్చి, పిచ్చెత్తిపోవుచున్నారు; కోడలిని తత్క్షణమే పుట్టినింటికి పంపివేయుమనుచున్నారు—అదిగోచూచితివా—నవ్వవలసిన దేమున్నది నేనన్నదానిలో? పట్టలేక పట్టలేక నవ్వుచున్నావే!"

రామచంద్రరాయలుపాఱిపోవుటకు నిజమైన కారణము కోటలోనుండు దాసదాసీలందఱు పూర్తిగా నెఱుఁగుదురు, కాని ఒకొక్క రొకొక్కవిధముగ వర్ణించుచున్నారు.

మంగళ—"కోడలమ్మను పుట్టినింటికి అంత తొందరపడి పంప నవసరము లేదని మీరాణీయమ్మగారితో చెప్పుము. నాయొద్ద నొకమందున్నది, దానిని ప్రయోగించినయెడల యువరాజు మనస్సు పూర్తిగా తిరిగిపోవును."—ఇట్లనుచు పకపక నవ్వసాగినది.

మాతంగ—"మంచిమాట! రాణియమ్మతో చెప్పెదను."

మంగళ—"యువరాజునకు మీకోడలమ్మయెడల మిగుల ప్రేమ కాదా?"

"దానివిషయమై అనుకొని యేమిలాభము; ఆమెను చూడకుండ ఒక్కక్షణమైన నుండలేఁడు.

"సరే దానికి తగినమందు నేనిచ్చెదను—పగటిపూట-కూడ యువరాజు భార్యయొద్దనే కూర్చుండునా?"

"అహా!"

మంగళ—"ఓ యమ్మ, అ దేమే! యువరాజుతో నేమి చెప్పుచుండునో, నీవెన్నఁడైన వింటివా? దగ్గఱ కూర్చుండి ఏమి చేయుచుండునో నీవెన్నఁడైన చూచితివా మనుమరాలా?"

"లే దక్కా నే నెన్నఁడు చూడలేదు."

"నన్నొకమాఱు కోటలోనికి తీసికొనివెళ్లఁగలవా, నేనది చూచి వచ్చెదను."

"ఆ యనవసరమైన కష్టము నీకేల అక్కా?"

"ఔను నిజమే, కాని చూచినయెడల నామంత్రము పాఱునో లేదో తెలిసికోఁగలను."

"మంచిది, కాని నేటి కిక నన్నుపోనిమ్ము," అనుచు మాతంగ బుట్టపట్టుకొని లేచినది.

మాతంగ వెడలినతోడనే మంగళ పటపట పండ్లుకొరు-కుచు కండ్లు పెద్దవిచేసి ఏ మేమో ప్రేలసాగెను.

## పదునైదవ పరిచ్ఛేదము

వసంతరాయలు బయలుదేరునప్పటికి చీఁకటికావచ్చు-చున్నది. విభ డాబాపై కెక్కి పల్లకిని చూచుచున్నది. తాతయ్య పల్లకిలోనుండి తల పైకుంచి వెనుకకు చూచు చున్నాఁడు. పల్లకి అదృశ్యమైనది, ఐనను విభ ఆదారివైపు చూచుచు నచటనే నిలిచియున్నది. సురమ ఆమెకొఱకు రాజ్యమంతయు వెదకివెదకి ఎచ్చటను గానక చిట్టచివరకు డాబామీఁదికివచ్చెను. విభ కనఁబడినతోడనే ఆమెయొద్దకుఁ బరుగెత్తికొనివచ్చి, ఆమె భుజముపై చేతులు వేసి, ఆమెను గట్టిగా కౌగిలించుకొని, "ఏమి చూచుచున్నావు విభా?" అని యడిగెను. విభ నిట్టూర్పు విడుచుచు, ఏమియు లేదు, అనెను.

యింటిలోని కేల పోవుచున్నదో, బయటి కేల వచ్చుచున్నదో, ఏల పండుకొనుచున్నదో, ఏల లేచుచున్నదో మట్టమధ్యాహ్నమప్పుడు ఈ గదినుండి ఆ గదికి ఆ గదినుండి యీగదికి ఏల తిరుగుచున్నదో—ఏమియు నామెకే బోధపడ కున్నది! ఆ రాజప్రాసాదమున తనచిన్ననాఁటి యాటపాటలను, తన నవ్వుఏడ్పులను, చిన్నప్పటినుండి తా ననుభవించుచుండిన సుఖదుఃఖములను కలిపి, విభ తనహృదయధనమునంతయుకు వంపి నిర్మించిన తనముద్దుఇంటి నెవరు వచ్చి ఒక్కనాటిలో

విరుగఁగొట్టిరో కదా! ఆయిల్లిఁక విభయిల్లు కాదు. తాతయ్య లేడు!

కాని సుఖము పూర్తిగా ఆమెను వదలలేదు, ఏమాత్రమో యింకను మిగిలియున్నదని విభకుతోఁచుచున్నది. "అన్నయ్య ఉన్నాఁడు,ఆహా ఎట్టిప్రేమ అతనిది! నాప్రాణముతో సమానమైన సుఠము యున్నది; కాని నీడవలె ఏదో విపత్తు వెనుక నెల్లప్పుడును వచ్చుచున్నట్లు ఏలనోగాని నాకు భయమగుచున్నది; ప్రహారీలను భేదించుకొని, ఇంటదూరి, కంటికగపడకుండ, నేమూలనో ఆపద యొకటి నిద్రించుచున్నదని రాత్రింబగళ్లు మనకు భయమగుచుండిన, ఆ యిల్లు యిల్లనిపించునా?"

పని పోయి సీతారాముఁడు చిక్కులలో నున్నాఁడని ఉదయాదిత్యునకు తెలిసినది. సీతారామునిచేత ఒక్క దమ్మిడియైన లేదు, కాని వాని పీకనుచుట్టుకొని యుండినవి అనేకములగు యురులు. సీతారాముఁడు రాజుగారికోటలో పెద్దజీతము సంపాదించుచుండువాఁడు. వాని మేనత్త మగఁడు దూరదేశమున నేదో పనిలో నుండెను. వీనికి అకస్మాత్తుగా భార్యమేనల్లునిపై భరింపలేనిప్రేమ పుట్టుటచే పనివిడిచి సీతారామునియిల్లు చేరుకొనెను; వానిని చూచి, "ఆహా! ఇన్నాళ్లకు నా యాఁకలి తీరినది," అన్నాఁడు. అప్పటినుండి ఇతఁడు సీతారామునియింటనే ఉండిపోయెను. అతని యాఁకలి తీరివచుటకు అనేకప్రమాణములు కనఁబడుచుండెనుగాని, ఆయాఁకలి

తీరుట సీతారాముని చూచుటవలననే కాదు. సీతారామునికి వరుసకు అక్కయగునట యెవరో ఒకతె, ఆమె కొక కొడు కుండెను, ఆమె వాని నేదైన పనిలో పెట్ట ప్రయత్నించుచుం డెను. అంతలో, కొడుకును చిన్నపనిలో పెట్టినయెడల మేన మామకవమానముకలుగు నని యామెకు హఠాత్తుగ తట్టుట వలన, కొడుకును పనిలోనికి వెళ్ళనిచ్చినదికాదు. ఈ మాన రక్షణోద్యమము సీతారాముని ఋణగ్రస్తుని చేయుచుండినను, దీనివలన అక్కయల్లుని ప్రాణరక్షణోపాయములే ఏర్పడు చుండెను. ఇంతేకాదు ఇంటిలో సీతారాముని ముసలి విధవతల్లి యున్నది, పెండ్లి కావలసిన పెద్దకూతు రొకతె యున్నది. ఈవల, సీతారాముఁడు బహు సుఖవాసి, ఆమోదప్రియుఁడు, ఆటపాటలు మరిగినవాడు. సీతారాముని అవస్థ మాటినదిగాని వాని బంధువుల బస మాఱలేదు. మేనల్లునివయస్సు పెరుగు చున్నది, దానితోపాటు వానిపొట్ట పెద్దదగుచున్నది, మామ మానావమానములయెడఁగల శ్రద్ధకూడ హెరుగుచున్నది.

ఉదయాదిత్యుఁడు సీతారాముని దురవస్థనుగూర్చి విని వానికిని, భాగవతునకును మునుపటివలె నెలనెలకు జీతము పంపుచుండెను. యువరాజు పంపుచున్నడబ్బు పుచ్చుకొను చుండుటకు సీతారామునకు మిక్కిలి సిగ్గుగానుండెను. మహా రాజావారియెదుట యువరాజుపేరు తన నోటిలోనుండి వచ్చిన నాఁటినుండి తా నపరాధియే యని వానికిఁ దోఁచుచుండెను. ఒకనాఁ డెప్పుడో యువరాజావా రెదుటపడుట తటస్థించినది;

అప్పుడు వా డాయన పాదముల పైఁబడి, "నీవే నాకు భగ-వంతుఁడవు, నీవే జగదీశ్వరుఁడవు, నీవు దయామయుఁడవు," అని ఏడ్చుచు నాయనను క్షమింప వేఁడుకొనెను.

భాగవతుఁడు అత్యుదాసీనస్వభావముగలవాఁడు, గుడు గుడుపీల్చుచు చతురంగమాడుకొనుచుఁ గూర్చుండును; ఇరుగు పొరుగువారిని స్వర్గమునకు కొంతమందిని, నరకమునకు కొంత మందిని పంపుచుండును. ఉదయాదిత్యుఁడు పంపినరూపాయ లతనియొద్దకు వచ్చినప్పుడు కనుబొమ్మలు చిట్లించుచు, మూఁతి విరుచుచు, "యువరాజు నాకొంప ముంచి ఈ నాలుగురూపా-యలతో తాను చేసినతప్పు దిద్దుకొనవలెనని చూచుచున్నాఁడు గాఁబోలు," అన్నాఁడు, కాని రూపాయలుమాత్రము తిరుగ-గొట్టలేదు.

పనిపోయిన యిద్దఱునౌకర్లకు మునుపటి జీతము యువ-రాజుమూలమున ముట్టుచున్నదని మహారాజావారికిఁ దెలిసి-నది. పూర్వ మిట్టివిషయము లాయన సముఖమునకు వచ్చునవి కావు. ప్రతాపుఁడు కొడుకును మిగుల తృణీకరించుచుండుటచే కొడుకు చేయుపనులనుగుఱించి ఎవరును అతనికి చెప్పువారు కారు. ఉదయా ఁడు ప్రజలతో కలిసిమెలసి యుండునని ప్రతాపుఁ డెఱుఁగును, ప్రజలపక్షమై తనకువిరుద్ధుఁడగుచుండు-నని యెఱుఁగును, గాని అతఁడు జోక్యము కలుగఁజేసికొను-విషయములు మిక్కిలి సామాన్యమైనవగుటచే తండ్రి వానిని గుఱించి దఖలుపుచ్చుకొనువాఁడు కాఁడు; ఏదో పెద్దవిషయ

ములో యువరాజెప్పుడో దూరినప్పుడుతప్ప యువరా జొకం డున్నాఁడనియే ప్రతాపునికి జ్ఞప్తికివచ్చుటలేదు. మహారాజా వా రిప్పుడు మునుపటివలె యువరాజువిషయమై నిర్లక్ష్య- ముగా నుండకపోవుటవలన ఆయన నౌకర్లిద్దఱికిని జీతముపంపు చున్నట్లు రాజావారిచెవిని తత్క్షణమే పడినది. ప్రతాపా దిత్యుఁడు మిగుల కోపగించి ఉదయుని పిలిపించి, "సీతా రాముని, భాగవతుని పనిలోనుండి తీసివేయుటకు కారణము రాజకోశములో వారిజీతమునకు తగినధనము లేదని కాఁబోలు వారికి జీతమును నీవు పంపుచున్నావట?" అని యడిగెను.

"దోషిని నేను, వారిని నీవు దండించుటవలన శిక్ష- పొందినది నేను, నీవు విధించిన శిక్షప్రకారము ప్రతిమాస- మును నేను జరిమానా వారిచేతి కిచ్చుచున్నాను," అని ఉదయుఁడు శాంతముగా జబాబుచెప్పెను,

ఇంతకుముం దెన్నఁడును ఉదయాదిత్యునిమాటలు చెవియొగ్గివినుటకు ప్రతాపాదిత్యుని కవసరము లేకపోయినది. నిశ్చలభావముతోను వినయముతోను ఉదయాదిత్యుఁ డిప్పు- డిచ్చినజబాబు విన్నప్పుడు తండ్రిమనస్సున శాంతయాశ్చర్య మును ఆనందమును పుట్టకపోలేదు. కొడుకుమాటలకు ప్రత్యు త్తరమీయక, "వారికి నీ వెట్టిమర్థసహాయమును చేయఁగూడ దని నాయాజ్ఞ, ఉదయా!" అని ప్రతాపుఁ డనెను.

"మఱింత పెద్దశిక్ష విధించుచున్నావు," అని చేతులు- జోడించి ఉదయుఁ డనెను—"ఇంత కఠినశిక్ష పొందవలసిన

యపరాధము నే నేమిచేసితిని? ఏఁడెనమండుగురు మనుష్యులు తిండికిలేక, నిరాశ్రయులై, ఏడ్చుచు, ఊరివెంబడి తిరుగుచుండఁగా చూచుచు నేనే దానికి కారణమని యెఱిఁగికూడ నేమియుచేయక ఊరకుండుట నాకెట్లు శక్యమగును? నాకు భోజనమునకుఁ గొదువలేదు, నా కవసరమున్నదానికంటె పది రెట్లు నీ విచ్చుచున్నావు. కాని నా విస్తరిని పలువిధములైన పిండివంటలతో నింపి, ఎదుటను కడుపుమాడుచు ఏడ్చుచున్న ఆ పదిమందిని గూర్చుండఁబెట్టి వారి కొకపిడుచయినను పెట్టనీయక నన్ను భోజనముచేయుమనిన, నేను దినునది నాకు విషమనిపించదా నాన్నా?"

ఉదయుఁడు తేజితుఁడై యాడినమాటలకు తండ్రి యడ్డురాలేదు, మాటలు విని మెల్లగ నిట్లనెను, "నీవు చెప్పవలసినదంతయు విన్నాను, నేను చెప్పఁబోవున దిప్పుడు వినుము. సీతారామునికిని భాగవతునకును జీతము నేను నిలిపితిని, దాని నిప్పుడు మరల నెవరైన నిచ్చినచో ఆ యిచ్చువాఁడు నాకు విరోధియగును." ప్రతాపునికి లోలోపున చాలకోపము పుట్టినది, ఆకోపమునకు నిజమైనకారణము తనకే తెలియదేమో! కాని అతఁడు తనలో తా నిట్లనుకొనసాగెను—"నే నేదో గొప్ప దౌర్జన్యముచేసినట్లును, దయామూర్తియైన ఉదయుఁడు దానికి ప్రతీకారము చేయుచున్నట్లునా? నేనును చూచెదను—నేను కఠినముగా నుండినచో దయ చూపుట కెవడు సాహసించునో!"

ఉదయాదిత్యుఁడు సురమయొద్దకుపోయి సమస్తమును తెలియఁ.

జేసెను. అది విని సురమ ఇట్లనెను,—“మొన్న సాయంకాలము సీతారామునితల్లి వానిచిన్నకొమార్తె నెత్తుకొనివచ్చి నా యెదుట నేడ్చుచు కూర్చుండెను; రోజంతయు ఇంట నెవ్వరికిని తిండిలేదఁట. సీతారామునికూఁతురు పాలుత్రాగుబిడ్డ, ఆనాఁడు ఉదయమునుండియు పాలులేవట, ఆ చంటిదానిముఖము చూచుచు ఎవరూరకుండఁగలరు? వారు మనలను వదలి ఎక్కడికి పోఁగలరు?”

ఉదయాదిత్యుఁడు—“అంతేకాదు, వారిని మనకోటలో నుండి తరిమివేసితిమని తెలిసినతరువాత నాన్నభయమువలన వారి కెవ్వరు పని యిచ్చుటకుగాని, సహాయముచేయుటకుగాని సాహసింపరు. అట్టి యవస్థలోనున్నప్పుడు మనము కూడ వారిని దూరముగ నుంచినయెడల వారి గతి ఏమి కాగలదు? వారికి నేను సహాయముచేసితీరెదను, ఆ విషయమై నీకెట్టి సందేహము వద్దు. నే నాలోచించుచున్నది ఆవిషయమై కాదు—నాన్న కేవలము సబబులేనివాఁడు, ఆయనకు కోపము తెప్పించుట మంచిదికాదు, అతనికి తెలియకుండ మన కోరిక నెరవేర్చుకొను మార్గము చూడవలెను.”

భర్తచేతులు పట్టుకొని, “నీవేవియు చేయనక్కరలేదు, చేయవలసినది నేను చేసెదను, ఆ పూచీ నామీఁదనే వదలిపెట్టుము నాథా,” అనెను. తాను ముందుండి, ఉదయాదిత్యుఁడు వెనుకనుండి పనిచేయవలెనని సురమసంకల్పము. ఉదయాదిత్యునికి మంచిరోజులు కావివి. భాగ్యదేవత ఉదయాదిత్యునిచేతి

కొప్పుఁజెప్పిన పనులన్నియు అతని తండ్రిమతమునకు విరుద్ధము లైనవే; ఐనను సురమవంటిభార్య నిరుత్సాహపఱుపవలసినది కాదు. భర్త ధర్మయుద్ధమునకు పోవలసివచ్చినప్పుడు తనచేతు-లతో తానే భర్తకు కవచముతొడిగి భర్త వెడలినపిమ్మట ఇంటి-లోనికిపోయి మూలకూర్చుండి ఏడ్వవలసినస్త్రీకాదు సురమ; లోలోపున వణకుపుట్టుచుండినను భర్తకు ధైర్యము చెప్పు-చుండెను. ఆపదసమయముల పెక్కుమాఱు లుదయా-దిత్యుఁడు సురమ ముఖమువైపు చూచియుండెను, సురమ నేత్రములనుండి అశ్రుధారలు కారుచుండెను, గాని యామె కాళ్ళలోగాని చేతులలోగాని, వణకు, భయము, లేశమైన కానరాలేదు.

విశ్వాసముగల దాసియొకదానిచే సీతారామునితల్లికిని, భాగవతునిభార్యకును ప్రతిమాసము సొమ్ముందఁజేయు ఏర్పాటు సురమ చేసినది. దాసి నమ్మఁదగినదేగాని ఈకబురు మంగళకు తెలియకుండ నుంచవలసిన యవసరము దానికి కనఁబడలేదు; కనుక ఈసంగతి మఱియెవ్వరికిని తెలియకపోయినను మంగళకు మాత్రము తెలియకపోలేదు.

## పదునాఱవ పరిచ్ఛేదము

సీతారాముననును, భాగవతుననును జీతము రహస్యముగా వెళ్లుచున్నదని తెలియఁగానే ప్రతాపాదిత్యుఁడు మాటలు వృథా వ్యయముచేయక సురమను పుట్టినింటికి తత్క్షణమే పొమ్మని అంతఃపురములోనికి ఆజ్ఞ నంపెను. ఉదయాదిత్యుఁడు మనస్సును దృఢపఱచుకొనెను. విభ ఏడ్చుచు సురమవద్దకు పరుగెత్తినది; "నీవు వెళ్లిపోయినయెడల నే నీ శ్మశానపురిలో నెట్లుండఁగలను వదినా?" అనుచు సురమను కౌఁగిలించుకొని వెక్కసాగెను. సురమ విభగడ్డము పట్టుకొని ఆమెను ముద్దు పెట్టుకొనుచు, "నే నేల వెళ్లెదను విభా? నే నెక్కడికి వెళ్లను; నా సర్వము నిక్కడనే ఉన్నదికదా!" అనెను. కాని త్వరలో ప్రతాపాదిత్యునియాజ్ఞ సురమ కందినది, అప్పుడామె యిట్లని నది, "అమ్మగారింటికి వెళ్లుటకు నాకు కారణ మేమియు నగ పడలేదు. అక్కడనుండి రమ్మని వార్త లేదు, నన్ను తీసికొని వెళ్లుటకు మనుష్యులురాలేదు. నా భర్తయభిప్రాయముకూడ నే నిప్పుడు పోవలెనని కాదు. ఎట్టికారణమును లేక హఠాత్తుగ పుట్టినింటికిఁ బోవలసినయవసరము నాకు కనబడకున్నది." అది విని ప్రతాపుఁడు మండిపడెను, కాని కొంచె మాలోచింపఁగా కోపమువలన లాభము లేదని తెలిసికొనెను—సురమను బలప్రయోగమువలన బయటికి పంపుటకు వీలులేదు, దేహాబల

మంతఃపురములో పనికిరాదు. స్త్రీల విషయములలో ప్రతా పుఁడు కేవల మజ్ఞాని. బలవంతులయెడల బలప్రయోగించుట ప్రతాపుఁడు బాగుగ నెఱుఁగును, గాని అబలలవిషయమున నెట్లు ప్రవర్తింపవలెనో అతని తలలోనికి దూరునది కాదు. మోటుత్రాళ్లను తెంచు బలము అతనిలో నుండెనుకాని సన్నని దారమున పడినముడులను విప్పు నేర్పు అతని మోటవ్రేళ్లకు లేకుండెను, స్త్రీలు బోధపఱచుకొనుటకు సులభమైన పదార్థములు కావు, బోధపఱచుకోఁదగిన వస్తువులు కావు. స్త్రీల సంబంధమున ఏచిక్కు వచ్చినను దానిని విప్పుభారము రాజు రాణిమీఁదనే వేయుచుండెను. ఆఁడువారినిగుఱించి ఆలోచించుచుకూర్చుండవలె ననుకోరిక లే దాయనకు; కూర్చుండుటకు సమయములేదు, దానికితగిన యోగ్యత లేదు—అట్లు చేయుట కేవలము నిష్ప్రయోజనమైన పని. ప్రతాపుఁడు రాణిని పిలిపించి, “సురమను అమ్మగారింటికి పంపివేయుము,” అనిచెప్పెను. “అట్లైన నాబిడ్డఁడు ఉదయునిపని యేమౌను?” అని దుఃఖముతో రాణి యడిగెను. రాజు చీకాకుపడుచు—“ఉదయుఁడింకను చంటివాఁడు కాఁడు; రాజకార్యములు సులభముగా సాధించుకొనుటకై సురమను అమ్మగారింటికి పంపవలెను—ఇది నా యాజ్ఞ,” అని ప్రత్యుత్తరమిచ్చెను.

రాణి ఉదయునిఁ బిలిపించి, “నాయనా, సురమను పుట్టినింటికి పంపివేయనిమ్ము,” అని యనెను. “ఎందుచేత నమ్మా, సురమచేసిన యపరాధ మేమి?” అని ఉదయాదిత్యుఁ డడిగెను.

రాణి—"నాకేమి తెలియును నాయనా, మేము ఆఁడు వాండ్రము మా కేమియు బోధపడదు. కోడలిని పుట్టినింటికి పంపుటవలన రాజకార్యములకు కలుగులాభ మేమో మహా-రాజావారికే తెలియవలెను."

ఉదయాదిత్యుఁడు—"నన్ను దుఃఖపెట్టుటవలన రాజ్య-మున కెట్లు ఉన్నతికలుగునో నాకు తెలియకున్నదమ్మా. సహింపగలిగినంత సహించుచునే యున్నాను. నాకు మఱి సుఖము లేదని నే నెఱుఁగుదును, సురమకుమాత్ర మేమి సుఖమున్నది? ప్రతిదినమును ఆమె భరించుచున్న తిట్లే యామె ధరించు ఆభరణములు. ఉదయమువెుదలు రాత్రివఱకు మన మామె నవమానించనిరోజు లేదు. చివర కామెకెక్కడ స్థానము కూడ లేదనుచున్నారు. ఆమెతో మన కెట్టిబాంధవ్యమును లేదా, అమ్మా? ఆమె మనగడపకువచ్చిన ముష్టిదా—మన కిష్టమున్నంతకాలము మనయింటనుంచి ఇష్టము లేనప్పుడు పొమ్మనుటకు? అట్లేయైనచో ఈరాజప్రాసాదములో నాకుఁ గూడ స్థానము లేదు, నాకుఁగూడ సెలవిమ్ము, అమ్మా!"

రాణి ఏడ్చుచు నిట్లనెను, "మహారాజుగారికి ఎప్పటి కేబుద్ధి పుట్టునో నా కేమియు బోధపడదు తండ్రీ. కాని, కోడలు మాత్రము మంచిది కాదు, ఆమాట నిజమే నాయనా! అది యింట కాలుపెట్టినది, మనఇంట మఱిసుఖమున్నది లేదు-ఈమాట తలఁచుకొనినమాత్రాన నాకు లోలోపున మంట పుట్టుచున్నది. కనుక నామాటవిని రెండురోజులపాటు కోడలిని

అమ్మగారింటికి వెళ్లనిమ్ము నాయనా; చూతము, లక్ష్మి తిరిగి మన యింటికి వచ్చునేమో!"

ఉదయాదిత్యుఁడు తల్లిమాటలకు జవాబీయక కొంచెము సేపు కూర్చుండి లేచి బయటికి పోయెను.

రాణి ఏడ్చుచువచ్చి ప్రతాపాదిత్యునిమీఁద పడినది— "సురమను పంపివేసినయెడల ఉదయుఁడు మఱి బ్రతుకఁడు మహారాజా! కాని వాని తప్పేమియు లేదు. ఆ రాక్షసి వానిని మంత్రముతో కట్టియుంచినది." ఇట్లనుచు వెక్కివెక్కి ఏడ్వ సాగెను.

"సురమ పోకుండిన ఉదయుని చెరసాలలో పెట్టి యుంచెదను," అని మహారాజు అతికోపముతో పలికెను.

రాణి రాజుగారియొద్దనుండివచ్చి సురమపైఁ బడ్డది.— "నాకొడుకు నేమి చేసితివే నీముఖము తగులఁబడ! నా తండ్రిని నా కిచ్చివేయవే! నీవు నాయింట నడుగుపెట్టినది మొదలు వానిని పట్టుకొంటివి పిశాచమువలె, వానిని నాశనము చేసి తివి పూర్తిగా, రాజకుమారుఁడు వాఁడు, చివరకు వాని చేతులకు సంకెళ్లు వేయించనిదే నీమనస్సునకు శాంతి కలుగ-దటే!"

"నావలన ఆయన చేతులకు సంకెళ్లా అత్తయ్యా! అట్లైననే నిప్పుడే పోవుచున్నాను," అనినది సురమ. భయముతో వణఁకుచు విభకడకుఁబోయి సురమ ఆమెతో నంతయుఁ జెప్పినది; విభ భుజములపై చేతులువేసి ఆమెను కౌఁగిలించు

కొని "విభా, నే నీక్షణమే పోవుచున్నాను, బహుశః నన్ను మఱియిక్కడకు రానీయరు" అనినది. విభ యేడ్చుచు సురమను పట్టుకొన్నది. సురమ అక్కడనే చతికిలఁబడిపోయినది.

ఆమె యెదుటనున్నది అంతములేని భవిష్యత్తు; ఆ భవిష్యత్తున అందరాని అద్దరినుండి ఒక్కమాటమాత్రము వచ్చి సురమచెవిని పడుచున్నది.—"మఱి లేదు, మఱి నేను రాలేను, మఱి లేదు, మఱియేమియు మిగిలియుండ లేదు...." ఆమె కనుల యెదుట వ్యాపించియున్నది శూన్యమగు భవిష్యత్తు. ఆమెకు సదా కనబడుచుండెడిముఖము ఆభవిష్యత్తులో లేదు, మునుపటియాటపాటలు లేవు, ఆదరణము లేదు. ఆభవిష్యత్తులో హృదయమునకు హృదయమునకుగల మునుపటి సంయోగము లేదు, ప్రాణమునకు' ప్రాణమునకు మునుపటి కలయిక లేదు; ఒకరిపై యొకరు చూచుచున్నప్పుడు కనులలో అనురాగము లేదు, గుండెలుపగిలించు దుఃఖము సంభవించినను అణుమాత్రమైనను అనురాగము లేదు, ప్రేమ లేదు. ఎంత భయంకరమైనది ఆ భవిష్యత్తు! సురమగుండె గడగడ కొట్టుకొనుచున్నది, తలతిరుగుచున్నది, కన్నుల నీ రెండిపోయినది. ఉదయాదిత్యుఁడు గదిలో కాలుపెట్టియుఁ బెట్టకమునుపే సురమ అతనికాళ్లు పట్టుకొని, ఆ పాదములను గుండెపై నొక్కకొనుచు, గుండెపగులునట్లు వెక్కివెక్కి యేడ్వసాగినది. సురమ ఎన్నఁడు నింత యేడ్వలేదు. అంత గట్టిపఱచుకొనిన మనస్సైనను నేఁడు ముక్కలుముక్కలై పోయినది.

ఉదయుఁడు తత్క్షణమే నేల చతికిలఁబడి సురము తలను ఒడిలో పెట్టుకొని, "ఏమి సురమా, ఏమైనది?" అని యడిగెను. సురము ఉదయాదిత్యుని ముఖమువైపు చూచుచు, వెక్కివెక్కి ఏడ్చుచున్నది, నోట మాట రాలేదు—ఏమి జవాబు చెప్పఁగలదు పాపము! చివరకు అన్నది—"ఆ ముఖము నాకిఁక కనబడదా సాయంకాలము వచ్చి నీ వా కిటికీలో కూర్చుండియున్నప్పుడు నే నాప్రక్కనుండనా? రాత్రి దీపము ముట్టించినతరువాత నీవు వచ్చి ఆద్వారమున నిలువఁబడియుండఁగా నేను చిఱునవ్వు నవ్వుచు నీరెండుచేతులను పట్టుకొని నిన్ను గదిలోనికి తీసికొని రానా? నీ విక్కడనే యుందువుగాని నే నెక్కడనో గదా!" ఆ "ఎక్కడనో" అను దానిలో నెంత నిరాశయుండెను! ఎంత అందలేని దూరము! ఎంత దాటలేని ఎడఁబాటు!

"ఎంతకోరిక కలిగినను నీముఖమైనను నాకు కానరానప్పుడు నేను బ్రతికియుండుటయేల! నాగుండెపై నీపాదముల నుంచుకొని ఈ క్షణమే ప్రాణత్యాగము చేయుట పరమ-సుఖము," అనుచు ఆమె ఏడ్వసాగినది.

## పదునేడవ పరిచ్ఛేదము

కథాప్రారంభమున సూచింపఁబడిన రుక్మిణియే ఇప్పుడు రంగమున ప్రవేశించిన మంగళ. ఆమె రాయగడ విడిచివచ్చి మాఱుపేరుపెట్టుకొని యశోహారప్రాంతమున నివాసము చేయుచున్నది. రుక్మిణిలో నసాధారణగుణము లేవియును లేవు. విషయావేశతోను ఈర్ష్యతోను నిండియుండి, నలుగురను లోఁబఱచుకొనఁగోరు నీచస్వభావముగల అతిసామాన్య స్త్రీయామె. నవ్వు, యేడ్పులు ఆమెకు చేతిలోనిపనులు. ఇవి అవసరమున్నప్పుడు ఒక్కనిమిషములో బయటికి వచ్చుచుండును, అవసరమైనచో ఒక్కక్షణములో మాయమగుచుండును. కోపమువచ్చునప్పుడామె యొక ప్రచండస్వరూపము ధరించి ఆకోపమునకు కారణమగువారిని తనగోళ్లతోను, కోరలతోను చీల్చివేయునా యనునట్లు ప్రవర్తించును. అట్టిసమయములనామె అంతగా మాటలాడదు, గజగజ వణఁకుచుండును; ఆమె కండ్లలోనుండి అగ్నిజ్వాలలు వెలువడుచుండును, కరఁగి మరుగుచున్న ఇనుమువలె కోప మామెహృదయకటాహమందు కుతకుతమని ఉడుకుచుండును. తోక నిటునటు కొట్టుచు బుస్సుబుస్సు మనుచుండుపామువలె ఈర్ష్య ఆమె హృదయమున లేచుచుండును. ఇది యిట్లుండ మఱియొకమూలనుండి యామె వ్రతములును తాంత్రికానుష్ఠానములును సల్పుచుండును.

ఆమెతో పరిచయమున్నవా రందఱిమనస్సులను ఆమె అత్య ద్భుతముగ తెలిసికొనఁగలదు. యువరాజు సింహాసన మెక్కి నప్పుడు అతని హృదయమునఁ దనసింహాసనమును స్థాపించు కొని అతని హృదయరాజ్యముతోపాటు యశోహారరాజ్య-మునుగూడ పాలించుచుండవలె ననుకోరిక యామెను స్వప్నము లోనైన విడువకున్నది. ఆ కార్యము సాధించుట కామె చేయ లేనిపని యేమియు లేదు. రాజప్రాసాదమునసుండు దాసదాసీ లందఱితో ననేకదినములనుండి యెంతయో ప్రయత్నముపై స్నేహము కలిపియుంచినది. అక్కడ జరుగుచుండు చిన్నచిన్న సంగతులుకూడ నామె తెలిసికొనుచుండును. సురమముఖ మేనాడైన కొంచెము వాడియున్నచో ఆ కబురువచ్చి ఇంతలో మంగళ చెవిని పడుచుండును. ప్రతాపాదిత్యునిశరీరమున నెట్టియస్వస్థతగలిగినను ఆమె కామాట నిమిషములమీఁదఁ దెలియును—అది విని ఇంతకాలమున కా శనీశ్వరునకు చావు వచ్చునని యాశించుచుండును. ప్రతాపాదిత్యుని మృత్యువును గూర్చియును, సురమ మరణమునుగూర్చియును, నామె యెన్నియో యనుష్ఠానములు చేయుచుండెను, కాని నేటి వఱకు నొక్కటైనను సఫలముకాలేదు. "నేఁడు సురమయో లేక ప్రతాపాదిత్యుఁడో తెల్లవాఱునప్పటికి మంచముపై చచ్చిపడియుండు," ననుయాశ యామెలో ప్రతిదినము ప్రాతః కాలమున ఉదయించుచుండును.

రాజుగారికిని రాణికిని సురమయెడలగల విముఖత దిన

దినము పెరుగుచుండుట రుక్మిణికిఁ దెలిసినది. చివరకు సురయను నగరునుండి పంపివేయు ప్రస్తావముకూడ జరిగినదని విని యామెకు అమితానందము కల్గినది, ఐనను సురను అచ్చటనుండి పోకుం-డుట కనిపెట్టి ఉపాయ మొకటి పన్నినది.

అనేకవిధములైన మంత్రములు, తంత్రములు, మందులు ఎఱిఁగిన మంగళయనుపేరుగల విధవ యొకతె ఆ సమీపమున నున్నదనువార్త రాణిచెవిని వేయించినది. సురను నచ్చట నుండి పంపివేయకమునుపు యువరాజుమనస్సు నామెపైనుండి మరలించుట మంచిదని రాణికి తోఁచి, రాణి దానికి తగిన మందును మంగళయొద్దనుండి రహస్యముగ తీసికొనిరమ్మని మాతంగను బంపినది.

మంగళ అనేకరకముల వేళులను దెచ్చి, వానిని ముక్కలుచేసి, దంచి, నూరి, మంత్రములు ఏకరవుపెట్టుచు రాత్రియంతయుఁ గూర్చుండి, వానినన్నిఁటిని కలిపి యొకవిష తుల్యమైన యౌషధమును తయారుచేయుచున్నది. ఊరి బయటను, ఎటువైపునను నెట్టి శబ్దమును లేని ఆ యర్ధ-రాత్రివేళ, ఆచెట్లనడుమ దాఁగియున్న కుటీరములో, అమాన్దస్తాశబ్ద మొక్కటివినబడుచున్నది. ఆ నిశ్శబ్దమగు నడురేయిని ఈశబ్ద మొక్కటియే నామెకుతోడు; ఆ యేకతాళము అవి-రామముగ చెవిని పడుచుండుటవలన నామె మనస్సు మఱింత యుత్సాహముతో నాట్యము చేయుచున్నది.

ఔషధము తయారగుట కైదుదినములు పట్టినది. ఐదు

దినములు పట్టకపోవునుగాని సురమ మృత్యువువలన ఉదయాదిత్యునిమనస్సున కెట్టిదుఃఖమును కలుగకుండునటుల మంగళ యనేకమంత్రములు పారాయణచేయుచు నానావిధములగు అనుష్ఠానములు చేయవలసివచ్చెను.

మహారాజావారితోఁజెప్పి రాణి సురమ నచ్చటనే మఱికొన్ని దినము లుండనిచ్చినది. సురమను పంపివేయుదురని విని నప్పటినుండి విభకు ఎటుచూచినను మహాసముద్రమే. సురమ తోడనే యుండి నోటమాటలేక ఛాయవలె దినమంతయు సురమవెనుకనే తిరుగుచుండెను. ఒక్కొక్కరోజు గడచుచున్నది, సాయంకాల మగునప్పటికి విభను తొలినాఁటికంటె దగ్గఱకు లాగుకొని, గట్టిగా కౌఁగిలించి పట్టుకొనియుంచుకొనవలెనని సురమకు కోరికపుట్టుచున్నది. తనప్రాణములనుండి చీల్చి, వేరుచేసి దినముల నెవరో బలవంతముగ లాగుకొని పోవుచున్నట్లనిపించుచున్నది సురమకు. ఎటుచూచిన నంధకార మనిపించుచున్నది విభకు. సురమకుఁగూడ నెటుచూచినను శూన్యమే! ఆమె ఉదయాదిత్యుని పాదములకడఁ బడియుండు నొకప్పుడు; ఒకప్పు డతనియొడిలో తలపెట్టి మాటాడక యతని ముఖమువైపు చూచుచు పండుకొనియుండును.

సాయంకాలము కావచ్చుచున్నది; మరునాటిప్రాతఃకాలమున సురమను అమ్మగారియింటికి పంపివేయుదురు. ఒక్కొక్కటిగా, సురమ తన సర్వమును విభచేతి కప్పజెప్పినది. సురమను తనతోడ నుంచుకొనఁగలిగిన సరే, లేనిచో తానును

ఆ ప్రాసాదమునుండి వెడలిపోయెదనని దృఢప్రతిజ్ఞ చేసికొని ఉదయాదిత్యుఁడు ప్రశాంతుఁడై కూర్చుండియుండెను. చీఁకటి పడఁగానే సురమకాళ్లలో వణకు పుట్టినది, తల తిరుగుట మొదలు పెట్టినది, మఱి నిలిచి యుండ లేక ఆమె తనగదిలోనికి బోయి మంచముపైఁబడి, "విభా, విభా, అన్నయ్య నొకసారి పిలుచుకొనిరమ్ము, ఒకనిమిషమైనను ఆలస్యముచేయకుము," అని యనెను.

ఉదయాదిత్యుఁడు గదిలో నడుగు పెట్టినతోడనే సురమ "నాథా, రమ్ము రమ్ము నాకేమైనదో చూడుము," అని రెండు-చేతులను భర్తవైపు చాచెను. ఉదయాదిత్యుఁడు మంచము-దగ్గఱకు రాఁగానే అతని రెండుకాళ్లను పట్టుకొనెను. ఉద-యాదిత్యుఁ డామంచముపై కూర్చుండెను; సురమచేతులును కాళ్లును చల్లఁబడిపోవుచుండెను. ఉదయాదిత్యుఁడు, "ఏమై నది సురమా, ఏమైనది?" అని భయముతో తడఁబడుచు నడి-గెను. సురమ ఉదయాదిత్యునివైపు మెల్లఁగ ముఖము నెత్తి, చేతుల నుదయాదిత్యుని భుజముపై వేయఁ బ్రయత్నించినది. కాని చేతులు లేవలేదు. ఉదయుఁడు సురమతలను తన రెండు చేతులతో నెత్తఁబోయి, "నన్ను విడిచి నీవెక్కడికి పోవు చున్నావు సురమా? నీవు లేనిచో నాకు మఱియెవరున్నారు సురమా!" అనుచు నేడ్వసాగెను.

విధి మతిపోయినదానివలె శూన్యనేత్రములతో సురమవైపు చూచుచుండెను, సురమయు నామెవంక చూచుచుండెను.

సురమయు నుదయాదిత్యుడును ప్రతిసాయంకాలమును కూర్చుండు కిటికీతలుపులు తీసియున్నవి. ఆకాశమున నక్షత్రములు కనబడుచున్నవి, మెల్లమెల్లగ గాలి వీచుచున్నది, అన్నివైపులను నిశ్శబ్దము, గదిలో చిన్నదీపము మిణుకు మిణుకుమనుచున్నది, దేవాలయమునుండి వచ్చుచున్న జేగంటశబ్దము, శంఖనాదము, క్రమక్రమముగా నిలిచిపోయినవి. సురమ మృదుస్వరముతో, "నాకు కనులు కనబడుటలేదు, నీ నోటితో నేదైన నను ము నాథా," అనెను.

సురమ విషముతిని చచ్చిపోయినదని అంతఃపురములో అనుకొనుచున్నమాట విని, రాణి సురమగదిలోనికి పరుగెత్తుకొనివచ్చెను.

అంతఃపురములోనివారందఱును నామె వెంటబడిరి. రాణి సురమను జూచి, "సురమా, నా తల్లీ, నీవెక్కడకును పోనక్కరలేదే, నీవు మాయింటి లక్ష్మి వమ్మా, నిన్నెవరు వెళ్లమన్నారు తల్లీ?" అని మొరపెట్టుచు నేడ్వ నారంభించెను. సురమ అత్తగారిపాదధూళి తలపై నుంచుకొనెను. రాణి యేడ్పు రెండింతలైనది. "అమ్మా, నీవు కోపమువచ్చి వెళ్లి-

పోవుచున్నావే, తల్లీ!" అనుచు రాణి ఏడ్చెను. సురమ నోట మఱి మాటలేదు, ఆమె ఏమో చెప్పఁబోయినదిగాని చెప్పలేక పోయెను. తెల్లవాఱుచున్నది. "అంతయు ముగిసినది," అని చెప్పి వైద్యుఁడు వెళ్లిపోయెను.

"అన్నయ్యా! అన్నయ్యా!" అని ఏడ్చుచు విభ సురమ గుండెపై బడి, యామెను కౌఁగిలించుకొనెను. కొంతసేపటికి తెల్లవాఱినది. ఉదయాదిత్యుఁడు సురమతల నింకను తనయొడిలోనే యుంచుకొని కూర్చుండెను.

## పదునెనిమిదవ పరిచ్ఛేదము

సురమ లేనే లేదా ? లేనట్లు విభ ఊహించుకొనలేకున్న దేలనో? 'సురమ కనఁబడును, ఇక్కడెక్కడనో యున్నది!' అనుకొనుచు విభ ప్రాణములు సురమను వెదకుచు తిరుగుచుండ ఆమె ఈగదినుండి యాగదికి, ఆగదినుండి యీగదికి తిరుగుచున్నది. సాయంకాలము తలదువ్వుకొనువేళ యగుచున్నది, సురమ ప్రతిదినమువలె తనకు జడవేయుటకు వచ్చునని కనిపెట్టుకొనియున్నట్లు విభ యూరక కూర్చుండియున్నది. వేళ దాటిపోయినది. చీఁకటిపడినది, ఐనను సురమ రాలేదే! నేఁడు జడ వేయుట మఱి జరుగదు. నేఁడు విభ ముఖ మెంతయో వాడియున్నది. విభ యేడ్చుచున్నది. ఐనను సురమ రాలేదు, సురమ యెన్నఁడును నిట్లు చేయదే! విభముఖమున కొంచెము విచారము కనఁబడినంతమాత్రాన సురమ దగ్గఱకువచ్చి భుజములపై చేతులువేసి గట్టిగా కౌఁగిలించుకొని ఆమెను వదలక ముఖము చూచుచు కూర్చుండునదే? నేఁడు—నేఁడు గుండె బ్రద్దలై పోయినను సురమ రాదు ! రాదు ! రాదు !

ఉదయాదిత్యుని బలములో సగము తగ్గినది. ప్రాణములలో సగము పోయినవి. ఉదయుడుచేయు ప్రతికార్యములోను దాఁగియుండు నాశ యామెయే, ఆమెయే అతనికి యుత్సాహదాత, ఆమెయిచ్చు సలహాయే అన్ని సహాయముల

కంటె నెక్కువ, ఆమె చిఱునవ్వే అతఁడు పొందఁగోరు బహుమానము—సురమ మఱి రాదా! అతఁడు తనపడకగదిలోనికిఁ బోయి, ఏమి బుద్ధిపుట్టినదోగాని, నాలుగువైపులను పరీక్షించి చూచెను—కాని ఎవ్వరును లేరు! మెల్లఁగఁబోయి కూర్చుండెను. సురమ కూర్చుండుస్థలముమాత్రము వెలితిగా నున్నది. నాలుగువైపులను ఆ వెన్నెలయే, ఎదుట నా యరణ్యమే. మునుపటివలెనే గాలి వీఁచుచున్నది. ఇట్టి రాత్రి సురమ నా కడకు రాకుండ నుండఁగలదా! అని కాబోలు ఉదయుని హృదయము తనలో తా ననుకొనుచున్నది.

విభ వాడినముఖముతో ఇటునటు పిచ్చిదానివలె తిరుగుచుండుట చూచినప్పుడెల్లను ఉదయునిగుండె బ్రద్దలగుచుండును. ఉదయుఁడు చెల్లెలిని పిలిచి దగ్గఱకూర్చుండబెట్టుకొని ముద్దుతో మాటలాడుచుండును. చిట్టచివరకు మఱియాపుకొనలేక విభ యేడ్చుచుండును. ఉదయుఁడుకూడ కన్నుల నీళ్లు పెట్టుకొనును. ఒకనాఁడు అన్న విభతో, "చెల్లీ, నీ కీయింట నేమి మిగిలియున్నది, నిన్ను మీ అత్తవారియింటికి పంపు నేర్పాటు చేయనిమ్మమ్మా," అని అనెను. విభ యేమియు నుత్తరమీయలేదు; కాని చంద్రద్వీపమునకు పోవుటకై యామె ప్రాణము కొట్టుకొనుచుండవలెను. కాని యామెను తీసికొనిపోవుట కింకను ఎవ్వరును రాలేదేమియో కదా!

విభ నత్తవారియింటికి పంపుటనుగూర్చి ఉదయుఁడు తండ్రితో నొకనాఁడు ప్రసంగించెను. తన కేమియు నభ్యం

తరము లేదని తండ్రి యనెను, కాని "విభయెడల వారి కెట్టి యాదరణమున్నను వారే ముందు కబురు పంపియుందురే, అది లేనప్పుడు మనమేల తొందరపడవలయును?" అని తండ్రి చెప్పెను.

విభ కనఁబడునప్పుడెల్లను తల్లి యేడ్చుచుండును. భర్త యుండికూడ విధవవలె నుండవలసినవిభను చూచిన నెవరికి దుఃఖముకలుగదు? ఇదియునుగాక రాణికి అల్లునిపై మిగుల దయ. అతఁడు కేవలము కుట్టితనముకొలఁది చేసినదాని ఫల మిట్టిది యగుట రాణి కెంతమాత్రము నిష్టములేదు. "విభ నత్తవారియింటికి పంపుము మహారాజా," అని రాణి ప్రతాపుని వేఁడుకొనినది, "విభను పంపుమని వారు నన్నెప్పుడు వేఁడుకొనెదరో అప్పుడే విభ వారికి లభించును," అని ప్రతాపుఁడు కోపగించుచు ననెను.

రాణి—"అత్తవారియింటికి వెళ్లక పిల్ల యిక్కడనే చాలకాల ముండిపోయినయెడల నలుగురు నేమందురు?"

రాజు—"తానుకోరి ప్రతాపాదిత్యుఁడు తనకొమార్తెను పంపినప్పుడు రామచంద్రరాయ లామెను తనయింట ప్రవేశింపనీయక గడపయొద్దనుండి పొమ్మనిన నలుగురు ననున దేమి?"

మహారాజావారు చేయుపనులకు దారి తెన్ను ఉండదనుకొనుచు రాణి యేడ్వసాగెను.

## పందొమ్మిదవ పరిచ్ఛేదము

మానావమానములనుగుఱించి రామచంద్రరాయలకుఁ గల జ్ఞానము మహాసూక్ష్మమైనది. ఒకనాటిసాయంకాలము రాజావారు విమానారూఢులై బయలువెడలిరి. మూఢులగు సాలెవాండ్రిద్దరు, దారిప్రక్కను తమగుడిసెయెదుట బట్టలు నేయుచుండిరి. రాజావా రాదారిని పోవుచున్నప్పుడు సాలెవాండ్రు లేచి నిలుచుండలేదని, రాజావారు గొప్ప గందరగోళము చేసిరి. ఈయన యశ్శోరులో మామగారియింట నున్నప్పుడొకనాఁడు నౌకరుతో నేదో పనిచేయుమని చెప్పెనట— పాప మా మూఢుఁడు పొరపాటున ఒకపనికి మఱియొకపని చేసికొని వచ్చెనట. పౌరుషశాలియగు రామచంద్రరాయలు మిగుల కోపగించి అత్తవారియింట తనకుఁ దగినమర్యాద జరగకున్నదనియు, త న్నవమానపఱచుట నౌకర్లుగూడ యజమానులయొద్ద నేర్చుకొనుచున్నారనియు, సిద్ధాంతపఱచెను. ముఖ్యముగా, అది జరిగిననాటి యుదయమే యువరాజు, ఉదయాదిత్యుఁడు, ఆ నౌకరు కేమియో చెవిలో జెప్పుచుండెను. ఆ చెప్పునది రామచంద్రుని యవమానపఱుపవలెనని కాక మఱియేమి కాఁగలదు? ఒకనాఁ డెవరో నలుగురు పిల్లవాండ్రు కలసి మంటిసింహాసన మొకదానినిచేసి, మంటితోనే రాజును, మంత్రిని, కొంతమంది సభ్యులను చేసి, "రాజదర్బా

రాట" ఆడుకొనుచుండిరి. ఈవృత్తాంతము రాజావారు విని ఆ బాలకులతండ్రులను పిలిపించి భయపెట్టిరి.

నేఁడు రాజుగారు సింహాసనమున బాలీసుపైఁజేరఁబడి గుడుగుడు పీల్చుచుఁ గూర్చుండియున్నారు.ఎదుటనిలిచియుండు అపరాధి దరిద్రుఁడొకఁడు. అతని విచారణ జరుగుచున్నది. రామచంద్రరాయలు మామగారియింట నున్నరోజున జరిగినకథను గురించి వీఁడేదోసందర్భమున కొంత విని, తనస్నేహితులతో కలసి ఆ ఘటననుగూర్చి వాదనచేయుచుండెనఁట—ఈసంగతి వానివిరోధి యెవఁడో విని రాజుగారి చెవిని వేసెను. రాజుగారికి కోపమువచ్చి వానిని పిలిపించి వానికి శాశ్వత కారాగారవాస మిచ్చుట యుచితమా లేక వానిని యురితీయించుట మంచిదా యని ఆలోచించుచున్నారు.

"మహాయోగ్యుఁడవురా నీవు!" అని యనుచున్నారు రాజుగారు.

"శరణు మహాప్రభూ, నే నట్టిపని చేయగలవాఁడను కాను," అని ఏడ్చుచు వాఁడు ప్రత్యుత్తరమిచ్చుచున్నాఁడు.

ప్రతాపునితో మన మహారాజావారిని సరిపోల్చుట నీ కెంతసాహసమురా మూర్ఖుఁడా!" అని మంత్రి యనుచున్నాఁడు.

దివాను— "ప్రతాపాదిత్యుని తండ్రికి రాజుపదవి మొదట లభించినప్పుడు రాజతిలకముపెట్టి రాజ్యాభిషేకము చేయింపమని వచ్చి అతఁడు మనమహారాజావారి తాతగారిని

ప్రార్థించెను. అతఁ డెంతయో యేడ్చి వేఁడుకొనఁగా తాతగారు తమ ఎడమకాలి చిటికెనవ్రేలితో అతని నొసట తిలకము పెట్టిరి, ఆమాట నీవు వినలేదేమో, మూర్ఖుఁడా!"

రఘూయి—"ప్రతాపాదిత్యుఁడు, ప్రతాపాదిత్యుని తండ్రి విక్రమాదిత్యుఁడు—వారివంశమున రాచేజీకము ఈ రెండుతరాలనుండియే. ప్రతాపునితాత వానపాము, వానపాము బిడ్డడు జలగ—ఆజలగ ప్రజలరక్తము పీల్చిపీల్చి ఉబ్బినది. జలగ బిడ్డఁడు తలను నేల కొట్టికొట్టి చేటవలె చేసికొని ఆచేట తలను పడగవలె నెత్త నేర్చుకొన్నాఁడు. వంశపారంపర్యముగా మేము రాజసభలలో నుండువారము—పాము మంత్ర గాండ్రము మేము, జాతిపా మేదో పోల్చుకొనలేమా!" రాజావారికి మహాసంతోషము కలిగినది. నవ్వుచు గుడుగుడు పీల్చుచున్నారు. రాజసభయందు ప్రతాపుని నేదో కారణముపై తిట్టనిదినము లేదు. రామచంద్రుని రాజసభ నలంకరించియున్న సైనికులు వాగ్బాణములను ప్రతాపుని వీఁపుపై గురిపించి తమ యమ్ములపొదులను ఖాలి చేయక సభ యేనాఁడును ముగియ కున్నది. అది ఎట్లున్నను, నేఁటి యపరాధిమాత్రము మిక్కిలి యేడ్వసాగెను; అప్పు డాప్రచండ ప్రతాపముగల రామచంద్ర రాయలువారు, "ఈమాఱుమాత్రము నిన్ను ప్రాణములతో విడుచుచున్నాను, ఇటుపైని జాగ్రతగా నడచుకొనుము," అనిరి.

సభ్యులందరును నిష్క్రమించిరి, మంత్రియు, విదూష-

కుండును మాత్రము సభాస్థలమందున్నారు. ఇంకను ప్రతాపుని మాటలే జరుగుచున్నవి.

"తమరు యశోహరు విడిచిన తరువాత నక్కడ పెద్దగొడవ జరిగినది. కొమార్తె విధవరాలైనయెడల గాజులను, మురుగులను అమ్మి ఖజానా వృద్ధిచేయవలెనని యాశించెనట ప్రతాపాదిత్యుఁడు. ఉదయాదిత్యుఁడు దాని కడ్డువచ్చెనట—దీనిని గురించి గొప్పపోట్లాట జరిగినదట."...

రాజుగారు నవ్వుచు, "వహా వ్వా!" అన్నారు.

మంత్రి—"ప్రతాపుఁ డిప్పుడు మిక్కిలి దుఃఖించుచున్నాఁడని వినుచున్నాను మహారాజా; ఎట్లైన కొమార్తె నిచ్చుటకి పంపుటకు వీలౌనా యని నిద్రాహారములు విడిచి రాత్రింబగ ళ్లాలోచించుచున్నాఁడు."

రాజుగారికి మహాఆనందముకలిగి గుడుగుడు నడిగా పీల్వనారంభించిరి.

మంత్రి—"పిల్ల నత్తవారింటికి పంప నవసరము లేదు; మా మహారాజావారు మీయింటిపిల్లను పెండ్లాడుటవలన మీపూర్వపురుషులు ఏడుతరములు వెనుకనుండ తరించిరి, మీపిల్లను తమయింటికి తిరిగి తీసికొనిపోయి తమవంశమును నింకను నీచపఱచుకొనగోరు నంతపుణ్యము మీరేమియు చేయలేదని నేను చెప్పితిని—నేనన్నది ఎట్లున్నది రమాయ్?"

రమాయి—"ఎట్లున్నదని యడిగెద వేల! మహారాజా, మీరు బురదలో కాలుపెట్టుట బురదయబ్బ చేసికొన్న

పుణ్యము—అట్లని ఇంటికి వచ్చి లోన ప్రవేశించునప్పుడు కాలు కడుగుకొనక మఱియేమి చేయఁగలరు, మహారాజా!"

ఈవిధమున హాస్యపరిహాసములు జరుగుచుండెను. ప్రతాపాదిత్యుఁడును ఉదయాదిత్యుఁడును ఎదుట నిలువఁబడి యున్నట్టూహించి వారినవమానపఱచుచుండిరి. ఉదయాదిత్యుఁడుచేసిన యపరాధ మేమో తెలిసికొనుట సులభము కాదు. అతఁడు తనపై పడఁబోవుఅపాయమును లక్ష్యపెట్టక రామచంద్రుని ప్రాణములను కాపాడెను—ఇది మఱచి అతఁడు ప్రతాపాదిత్యుని కుమారుఁడనిమాత్రము జ్ఞప్తియుంచుకొని ఆ యపరాధమునకై రామచంద్రుఁ డతనిని దూషించుచుండెను, ఎగతాళి చేయుచుండెను. దీనినిబట్టి రామచంద్రునిది క్రూర స్వభావమని మన మూహింపఁగూడదు, అతనిస్వభావమున నుండి నది లఘుత్వము —లఘుహృదయుఁ డనవచ్చునతనిని; విశాలత లేని మనస్సతనిది. ఉదయాదిత్యుఁడు తనప్రాణమును గాపాడెనని రామచంద్రుని కెట్టికృతజ్ఞతయు లేదు—కాపాడక మఱి ఏమి చేయగలరు? రామచంద్రుఁ డాపదలోనున్నప్పు డందఱును కలసి యతనిని కాపాడుటకాక మఱియేమిచేయఁగలరు? అతని కాలిలో ముల్లుగ్రుచ్చుకొనిన జగత్తులో నందఱకును బాధకలుగక మానదని అతని నమ్మకము. ప్రపంచములో సామాన్యులలో నతిసామాన్యునికైనను తనయాపదముందఱ మహారాజాధిరాజైన రామచంద్రరాయల యాపద లెక్కలోనిదికాదని రామచంద్రునికి తట్టలేదు. స్తోత్ర

పాఠకులు తమచేతులలోఁ బట్టుకొనియున్న తక్కెళ్లలో రామచంద్రరాయల నొకప్రక్కను, సమస్తప్రపంచమును మఱియొకప్రక్కను ఉంచి, ప్రపంచమునకంటె అతఁడే బరువైన పదార్థమని అతనిమనస్సులో తప్పుఅభిప్రాయమును పుట్టించుచుండిరి. అట్టివారి మనస్సున నెవరియెడలను కృతజ్ఞ సులభముగ నుదయింపదు. ఉదయాదిత్యునియెడల రామ చంద్రునకు కృతజ్ఞతలేకపోవుటకు మఱియొక కారణముకూడ నున్నది—ఉదయాదిత్యుఁడు తన ప్రాణములను విభకొఱకై నిలఁబెట్టెనుకాని తనను కాపాడవలెనని ఎంతమాత్రము కాదని రామచంద్రుని నమ్మకము. అతని మనస్సున నుదయునియెడల కృతజ్ఞత యుండినను వానిని గూర్చి జరుగుచుండు హాస్యపరి హాసముల కడ్డువచ్చుసాహస మతనిలో లేదు. నలుగురును గలసి నవ్వులాటలు జరుపుచున్నప్పుడు—అందులో ముఖ్య ముగా రమాయి ఎవరినైన నెగతాళి చేయుచున్నప్పుడు— దానికి అడ్డువచ్చుటకుఁగాని, వారి పరిహాసములలో చేరకుండు-టకుఁగాని తగినమనోబలము రామచంద్రునిలో లేదు. ఏవిష-యములోనైనను "అందఱు నేమనుకొందురు?" అని ఆలోచించ వలసినవాఁడు రామచంద్రుఁడు.

విభయెడల నిప్పటికిని రామచంద్రునికి ఒక విధముగు అపేక్షవంటిభావము లేకపోలేదు. ఆమె రూపవతి, యౌవన-ములో నిప్పుడే యడుగుపెట్టినది, రామచంద్రుఁడు విభను బహు అల్పదినములుమాత్రమే చూచి యుండెను. ఆనాఁటి

రాత్రి యకస్మాత్తుగా రామచంద్రుఁడు నిద్రనుండి లేచి చూచు నప్పుడు, విభ ప్రక్కనుకూర్చుండి ఏడ్చుచుండెను; ఆమె ముఖముపై వెన్నెల పడుచుండెను; పైటచెంగు ప్రక్కకు సగము జారియుండెను, గుండె లేచి పడుచుండెను; మధురములగు నామెకరుణానేత్రములనుండి నీరు వఱదలయి కారుచుండెను; లేతచిగుళ్లవంటి నామెపెదవులు వణఁకుచుండెను. రామచంద్రునిమనస్సున నెట్టిభావము హఠాత్తుగా ఉదయించి-నదోగాని విభతలను తనయొడిలో పెట్టుకొని యామెకనులను తుడిచెను. అప్పుడే వికాసము పొందుచున్న విభ యౌవన మంతయుముం దతని కంటఁబడలేదు, అప్పు డతనిలో పులకరింపు పుట్టినది, సగము తెఱచియున్న కనులు తడిసియైనవి, గుండె వడిగా కొట్టుకొనసాగినది. విభను ముద్దుపెట్టుకొనవలె ననుకోరికపుట్టి ముఖము దించుచున్నసమయమున తలుపుపై శబ్దము వినఁబడి-నది, తలుపు తెఱవఁగానే రాఁబోవు విపత్తుసంగతి తెలిసినది. అతనిలో నప్పుడే వాంఛ వ్యక్తమగుచున్నది, అతని హృదయ మునకు మెలఁకువ వచ్చినది—ఎట్టితృప్తియు పొందక మునుపే వేరగుటవలన అతనిలో పుట్టిన యాకర్షణము మఱింతప్రబలమైనది. కాని ఇది శాశ్వతముగా నుండవలసిన ప్రేమ కాదు, రామచంద్రుని లఘుహృదయమున కట్టిప్రేమ సాధ్యముకాదు. కులాసాపురుషునకు విలాసపదార్థముపై మనస్సు హఠాత్తుగ పోవురీతి, రామచంద్రునిలో నట్టియాకర్షణ మకస్మాత్తుగఁ బుట్టినది. ఎట్లైననేమి, అతని యౌవనస్వప్నముఁ

విభ ఉదయించినది, విభనుగూర్చి యభిలాష అతనిలో జన్మించి-నది. కాని విభను తీసికొనివచ్చిన నలుగురు నేమనుకొనెదరో? భార్య చేతిలో నుండవలసినవాఁడని సభాసదులు తనవిషయమై యనుకొనెదరేమో! మంత్రి యిష్టపడఁడు, రమాబాయి లోలోపుల నవ్వుకొనును. ఇంతేకాక, విభను తీసికొనివచ్చినచో ప్రతాపాదిత్యునికి శాస్తినిచ్చుట యెట్లగును? మామగారిపై నతఁడు పగఁదీర్చుకొనవలసియున్నదే! ఇట్లు పలువిధముల నాలోచించుటవలన విభను తెప్పించుటకు తగినబల మతనిలోపుట్టకుండెను. విభనుగూర్చి జరుగుచున్న హాస్యముల కడ్డువచ్చుటకైన నతనికి సాహసము లేకుండెను, ప్రతాపాదిత్యునిమాట జ్ఞప్తికివచ్చుట వలన అడ్డువచ్చుట కిష్టముకూడ లేకుండెను.

మంత్రియు విదూషకుఁడును బయటికి పోయినతరువాత రామమోహనుఁడు వచ్చి, "మహారాజా!" అనుచు చేతులు జోడించి నిలుచుండెను.

"ఏమి రామమోహన్?"

"సెల విమ్ము మహారాజా, నే నిప్పుడే పోయి రాణి యమ్మను తీసికొనివచ్చెదను."

"ఏమది, అట్లేల నడుగుచున్నావు?"

"మహాప్రభూ, అంతఃపురము శూన్యమైయుండుట నేను చూడలేను. లోనికి పోయి చూచునప్పుడెల్ల మహారాజా వారిగదిలో నెవ్వరును కానరాక నాకు మిక్కిలి దుఃఖము కలుగుచున్నది. రాణి, నాతల్లి, ఈయింటికి మహాలక్ష్మి, ఆమె

నిచ్చటికి తీసికొనివచ్చి కనులను సార్థకపఱచుకొననిమ్ము, మహారాజా."

"మోహనా, నీకు పిచ్చియెత్తినది, ఆమెను నాయింటికి-రానిచ్చెద ననుకొనుచున్నావా?"

మోహనుఁడు కన్నులు పెద్దవిచేసి, "రాణియమ్మచేసిన యపరాధమేమి మహారాజా." అని యడిగెను.

"ఏమి నీవనునది మోహనా! ప్రతాపాదిత్యుని కొమార్తెను నాయింటికి తీసికొనిరమ్మనుచున్నావా?"

"తీసికొనిరావేల? ప్రతాపాదిత్యునితో నామె కేమి-సంబంధము? పిల్ల పెండ్లి కానంతసేపే తండ్రిది; పెండ్లియైన పర-క్షణమే తండ్రి యధికారముపోవును. ఆమె యిప్పుడు మీరాణి. ఆమె నిచ్చటికి తీసికొని వచ్చి తగినమర్యాద మీరుచేయని-యెడల మఱియెవరు చేయుదురు?"

"ప్రతాపాదిత్యునికొమార్తెను నేను పెండ్లాడుటయే చాలు చాలు. పైగా ఆమెను నాయింటికి తీసికొనివచ్చిన యెడల నామర్యాద కాపాడుకొనుట యెట్లు?"

"మీభార్యను మీ రితరులయింట విడిచిపెట్టివచ్చితిరి. ఆమెపై మీ కెట్టియధికారము లేక, ఎవరియిష్టానుసారము వారధికారము చలాయించుచుండ మర్యాద కాపాడుకొనుట యెట్లయ్యెను?"

రాజు—"ప్రతాపాదిత్యుఁడు పిల్లను పంపనియెడల?"

మోహనుఁడు—"ఏమంటిరి మహారాజా? పంపనియెడలనా? పంపకపోవునంతటిసాహస మెవరిది? ఆమె నాతల్లి, మాయింటి మహాలక్ష్మి, ఆమె నిచ్చటికి రాకుండ కట్టిపెట్టఁగలవా రెవరు? ప్రతాపాదిత్యుఁ డెంతగొప్పవాఁడైనను నతనియొద్దనుండి మాతల్లిని తీసికొనివచ్చెదను. ఇదియే మీతోఁ జెప్పుట మహారాజా, నాతల్లిని నేను తీసికొనివచ్చెదను, నాకడ్డుపడుటకు నీ కెట్టియధికారమును లేదు," ఇట్లని రామమోహనుఁడు బయటికిఁ బోయెను.

రాజు తొందరతొందరగా నిట్లనెను—"ఇదిగో ఇది వినుము మోహన్, విననిదే వెళ్లకుము......

"సరే, నీవు రాణిని తీసికొనివచ్చుటకు పోవచ్చును, నేను దాని కభ్యంతరపెట్టను, కాని యీ మాట యెవ్వరికిని తెలియఁ గూడదు, మంత్రి చెవిని గాని రమాయిచెవినిగాని పడఁ గూడదు."

రామమోహనుఁడు, "చిత్తము మహారాజా!" అనుచు బయటికిఁబోయెను.

రాణి ఇచ్చటికి వచ్చినతరువాత ఈసంగతి యందఱికిని తెలిసిపోవును, కాని వచ్చుట కింకను కావలసినంతవ్యవధి యున్నది, ఇప్పటినుండి దానికొఱకు సిద్ధపడ నక్కరలేదు—ప్రస్తుతము సిగ్గుపడు నవసరము లేకున్న చాలునని రామచంద్రుని యాలోచన.

## ఇరువదవ పరిచ్ఛేదము

ఉదయాదిత్యుని దుఃఖము తగ్గించ గోరుచు విభ రాత్రిం బగళ్లు ఏదో ఒకటిచేయుచుండెను—ఆమె తనచేతులతోఁ దానే అన్నకొఱకు వండును, అన్న భోజనముచేయుచున్నప్పుడు అతని ఎదుట కూర్చుండును—ఏవిషయములోనైన ఎట్టి లోటును ఉండనిచ్చునదికాదు. సంధ్యవేళ ఉదయాదిత్యుఁడు అఱ చేతులలో ముఖమును పెట్టుకొని తనగదిలో కూర్చుం-డును—బహుశః కండ్లవెంబడి నీళ్లు కారుచుండునేమో—విభ మెల్ల మెల్లఁగ వచ్చి అన్నకాళ్లదగ్గఱ కూర్చుండి మాటలాడ-వలెనని ప్రయత్నించును గాని మాటలు తట్టవు. ఇద్దఱిలో నొకరినోటకూడ మాటలుండవు. మిణుకుమిణుకు మనుచుండు దీపము ఉండియుండి ఘుప్పుఘుప్పున లేచుచుండును. గోడలపై నీడ యాడుచుండును. విభ ఆ నీడను చూచుచు చాలసేపు కూర్చుండి కూర్చుండి, గుండెలు బ్రద్దలగునంత పెద్దనిట్టూర్పు విడిచి, మఱియోపుకొనలేక "ఎక్కడికివెళ్లి పోయినదన్నయ్యా?" అనుచు వెక్కివెక్కి ఏడ్చును. ఉదయాదిత్యుఁడు ఉలికిపడి కనులు తుడుచుకొనుచు విన్నదాని యర్థము తెలిసికొనలేక బోధపఱచుకొనుటకు ప్రయత్నించుచు విభవైపు చూచును. అంతలో పూర్తిగా తెలివివచ్చి, కన్నులు తుడుచుకొనుచు, "చెల్లీ, నీకొక కథచెప్పెదను వినుము తల్లీ," అని విభతో ననును.

వర్షపుదినము—ఆకాశము మేఘములతో నిండియున్నది, రోజంతయు హోరున వర్షము పడుచున్నది, తోటలోని చెట్లపై నాకాశము నీటిని దిమ్మరించుచున్నది, పగలే చిట్టచీకటిగాయె యున్నది. ఉండియుండి పెద్దగాలితో ఇంటిలోపలికి జల్లు వచ్చుచున్నది. ఆకాశమున ఉఱుములు ఉఱుముచున్నవి, దూరమున మెఱపు మెఱయుచున్నది. ఉదయుఁడు ఊరక కూర్చుండియున్నాఁడు. ఆ చీకటిలో విరామము లేక కురియుచున్న వర్షప్రహారు, "లేదు, సురమ లేదు," అనుచున్నట్లున్నది. చినుకులతో తడిసియున్న గాలి మాటిమాటికిని ఝూంకారముతో, "ఏదీ, సురమ ఏదీ!" అనుచు లోనికి తోసికొనివచ్చుచున్నట్లున్నది. విభ నెమ్మదిగా దగ్గఱకువచ్చి, "అన్నయ్యా!" అన్నది. అన్నయ్య ఏమియు జబాబీయలేక ముఖము చేతులలో పెట్టుకొని తెరచియున్న కిటికీపై వ్రాలెను—తలమీఁద చినుకులు పడుచుండెను. రోజంతయు నిట్లు గడచి రాత్రి కాగానే విభ అన్నభోజనమున కేర్పాటుచేసి వచ్చి, "అన్నయ్యా వడ్డించితిని భోజనమునకు కూర్చుండుము," అనెను. ఉదయాదిత్యుఁ డేమియు ఉత్తరమీయక కూర్చుండియుండుటచూచి విభ గద్గదస్వరముతో, "ప్రొద్దుపోయినది అన్నయ్యా, భోజనమునకు లెమ్ము!" అని మరల అనెను. ఉదయాదిత్యుఁడు తలయెత్తిచూడ యేడ్చుచుండు విభముఖ మతనికంట బడెను. అప్పు డతఁడు త్వరత్వరగా లేచి విభకనులను తుడిచి భోజనమునకు కూర్చుండెను. కాని అన్నభోజనము చేయ-

కుండుట చూచి విభ పెద్దనిట్టూర్పు విడిచి పండుకొనుటకు వెళ్లిపోయెను—ఆమె విస్తరిదగ్గఱకు పోనైనలేదు.

విభ యేదో యొకటి మాట్లాడుచుండి అన్న మనస్సున నుండుభారమును కొంచెమైనను తగ్గింపవలెనని మహాప్రయత్నము చేయుచుండును గాని మాటలాడలేకుండును; అన్న దుఃఖమును తగ్గించుటెట్లో తెలియక మాటిమాటికి "అహా, ఇట్టిసమయమున తాతయ్య లేఁడే!" అనుకొనుచుండును.

ఉదయాదిత్యుని మనస్సున నిప్పుడొకవిధమగు భయము పుట్టుచుండెను. ప్రతాపుని మాట జ్ఞాపకము వచ్చినప్పుడెల్ల అతనికి వణకుపుట్టుచుండెను. విపత్తును గడ్డిపరకతో సమానముగ నెంచి ప్రాణముల నిచ్చుటకైనను సిద్ధుఁడై దౌర్జన్యము నెదిరించుచు నిలువఁబడుశక్తి పూర్వ మతనిలో నుండెను. ఇప్పు డది పోయినది—ఏపని చేయఁబోయినను సంకోచము కలుగుచున్నది.

ఆ సమీపముననున్న 'ఛాప్ రా' జమీందారుగారి కచేరీలకు రాత్రి వేళ బాణాకఱ్ఱలతో మనుష్యులను పంపి, కచేరీలు లూటీచేసి ఇండ్లకు నిప్పు ముట్టించి రమ్మని ప్రతాపాదిత్యుఁడు తనమనుష్యులను పిలిపించి చెప్పుచుండగా ఉదయాదిత్యుఁడొకనాఁడు వినెను. యువరాజు తన గుఱ్ఱమును తయారుగా నుంచుమని యాజ్ఞాపించి, బట్టలువేసికొనుట కంతఃపురము లోనికి వెళ్లెను. పడకగదిలోనికిపోయి ఏదో యాలోచించుచు నాలుగువైపులను చూచుచు నిలుచుండెను. పరధ్యానముగ

నిటునటుపోవుచు దుస్తులు మార్చుకొని బయటికివచ్చెను. భృత్యుఁడు వచ్చి, "గుఱ్ఱము తయారుగా నున్నది మహాప్రభూ, ఎక్కడికి పోవలసియున్నది?" అని యడిగెను. యువరాజు పరధ్యానముగ కొంచెముసేపతనివైపుచూచి చివరకు, "ఎక్కడకును పోనవసరము లేదు, నీవు గుఱ్ఱమును తీసికొనిపొమ్ము," అనెను.

ఒకనాఁడెవఁడో యేడ్చుచున్నట్టు వినఁబడి యువరాజు బయటికి వచ్చి చూచెను, రాజుగారి భటుఁడొకఁడెవనినో చెట్టునకు కట్టి కొట్టుచుండెను. పాప మా మనుష్యుఁడు యువరాజువైపుచూచి, "రక్షింపుము మహాప్రభూ!" అని యేడ్చుచు ప్రార్థించెను. యువరాజు వానిబాధ చూడలేక ఇంటిలోనికి పాఱిపోయెను. పూర్వ మెన్నఁడును ఇట్లు చేయఁగలవాఁడు కాఁడు—నౌకరుపై తిరగఁబడి ఆమనుష్యుని విడిపించి యుండును.

భాగవతుసీతారాములజీతములు నిలిచిపోయినవి. రహస్యముగగాని బహిరంగముగగాని యువరాజు వారికి సహాయముచేయ సాహసింపలేదు. వారు చిక్కులలో నున్నారని వినఁగానే తత్క్షణము వారికేమైన పంపవలెనని యనుకొనుచుండునుగాని పరక్షణమే భయము పుట్టుటచే, పంపుట మఱి జరుగలేదు.

తనప్రాణమున కెట్టియాపదవచ్చునోయను భయము ఉదయాదిత్యునిప్రవర్తనమునకు కారణమని అనుకొనుట పొర

పాటు. మునుపటికంటె ప్రాణముపై నాసక్తి అతనిలో నధికమైన-దనుట నిజముకాదు. ఉదయునిలో నంధ భయమొకటి పుట్టి-నది. ప్రతాపాదిత్యు డొక రహస్యమగు పదార్థ మేదో యను నట్లు ఉదయునకు తోచుచుండెను. ఉదయాదిత్యుని భవిష్య-జ్జీవనములోని ప్రతిదినము, ప్రతిక్షణముకూడ ప్రతాపా-దిత్యుని పిడికిలిలో నుండెను. ఉదయాదిత్యునిజీవితములోని చివరక్షణము సమీపించి, అతఁడు మృత్యువు నాలింగనము చేయ సిద్ధపడు చున్నప్పటికిని ప్రతాపుఁడు కనుబొమ్మలు విఱిచి యాజ్ఞాపించినయెడల ఉదయుఁ డాగవలసినదే!

## ఇరువది యొకటవ పరిచ్ఛేదము

రుక్మిణియొక్క, అనఁగా మంగళయొద్ద కొంత నగదుండెను. ఆ రూపాయలు వడ్డీకిచ్చి దానితో నామె దినములుగడుపుకొనుచుండెను. రూపు, రూపాయలు—ఈ రెండిటిబలమువలన ఆమె అనేకులను వశపఱచుకొనియుండెను. సీతారాముఁడు కులాసా-పురుషుఁడు, కాని ఇంట నొక్కదమ్మిడియైనను లేదు. కనుక రుక్మిణిరూపు రూపాయలు వీని నాకర్షింప మొదలుపెట్టినవి. వంటింటి పొయ్యిలో నిప్పులేనినాడుకూడ సీతారాముఁడు సన్నని కండువా వేసికొని, కఱ్ఱ చేతఁబుచ్చుకొని, ఛాతీవిఱుచుకొని రోడ్డుమీఁద కనబడువాఁడు, అనగా రుక్మిణియింటికై బయలుదేఱియుండువాఁడు. ఎటువంటిచింతయు ముఖమున నుండునది కాదు. "క్షేమమా సీతారామ్, రోజులేలాగు గడచు-చున్నవి?" అని ఎవరైన నడిగినచో అత్యుల్లాసముగా "హాయిగానున్నాను, రేపు మాయింట విందు, నీవు రావలెను," అనును. సీతారాముని పెద్దపెద్దమాటలు మునుపటికంటె తగ్గలేదు; పైగా అవస్థ క్షీణించుచున్నకొలఁదిని మాటలపరిమాణము పెద్దదగుచుండెను. కాని చివరకు సీతారామునకు పాడురోజులు వచ్చినవి—అతనిమామ, అనగా మేనత్తమగఁడు, తన ఆవరిమామ పదవిని విడిచిపెట్టి తనడొంకనకు పోవలెనని నిశ్చయించుకొనెను.

డబ్బవసరముండి సీతారాముఁడు రుక్మిణియింటికి వచ్చెను. వచ్చి యామె చెవిదగ్గర ముఖము పెట్టి పద్యమొకటి చదివెను. ఆపద్యము మూలమున, తనకు కావలసినది బంగారు వెండి కాదు ప్రేమ యని తెలియఁజేసెను, కాని ప్రస్తుతసందర్భమున కది కుదరకుండుట కనిపెట్టి, "లేదమ్మా, పద్యము కుదిరినది కాదు, ప్రేమకాదు నే నిప్పు డంతగా కోరునది, అది కావలసినప్పుడు తెలియఁజేసెదను, గాని తత్క్షణము కొన్నిరూపాయలు లేనిచో కథ నడవదు," అని యన్నాఁడు.

"నీకవసరమున్నప్పుడు నీకీయక మఱియెవరి కిత్తును?" అని అతిప్రేమతో అన్నది రుక్మిణి.

సీతారాముఁడు—"అబ్బే అంత యవసరముని కాదు నే ననునది, కాని జరిగినదేమన, నా రూపాయలన్నియు మా అమ్మయొద్ద నుంచుచుందును, నాయొద్ద నేమియు నుంచుకొనను; నేఁడు ఉదయమే లేచి అమ్మ జోడాఘాట్‌కు, తన అల్లుని-యింటికి వెళ్లిపోయినది; ఖర్చునకు రూపాయ లుంచుట మఱచినది, రేపే అప్పు తీర్చెదను."

మంగళ తనలో తాను నవ్వుకొనుచు నిట్లన్నది, "అంత త్వరగా తీర్చుటేల, నీకు వీలైనప్పుడే తీర్చవచ్చును, రూపా-యలు నీచేతి కిచ్చుచున్నానుగాని ఏ యేటిలోనో చెఱువు-లోనో పారవేయలేదే!" కాని అట్లు పారవేసినయెడల ఒకప్పుడు తిరిగి దొరకవచ్చును, ఇతని కిచ్చినయెడల ఆ రూపాయ లెన్న-టికి తిరిగిరావు—ఇదియే రెండిటికిని భేదము.

మంగళలో కనబడిన ప్రేమ చిహ్నములవలన సీతా రాముని ప్రేమ పొంగి పొరలివచ్చినది; రసికత కనఁబఱచవలె నని అతఁడు ప్రయత్నించెను. చేతిలో దమ్మిడి లేనప్పుడుకూడ నబాబ్ గిరి కనపరచుటయు, హాస్యరసము రవంతయైనను లేని రసికత కనపఱచుటయు సీతారామునికి స్వాభావసిద్ధము లే. నోటికివచ్చినదెల్ల పలుకుచుండును సీతారాముఁడు; పైవారు నవ్వినను నవ్వకపోయినను తానుమాత్రము నవ్వుచుండును— కాని అతని నవ్వుచూచినవారికి మాత్రము నవ్వురాకమానదు. పీఁడు రాజుగారియింట నౌకరుగా నున్నప్పుడు ఇతనికి తక్కిన నౌకర్లకు తఱచుగా పోట్లాటలు జరుగుచుండెను—సీతా రాముఁడు హాస్యము లనుకొనునవి యితరులకు హాస్యములు కావు—ఆ పోట్లాటలకు ముఖ్యకారణ మిదియే. ఒకనాఁటి రాత్రి హనుమాన్ ప్రసాద్ తెవారి యనునొక రౌతుఁడు పారా ఇచ్చుచు నిద్రతో జోగుచుండెను. సీతారాముఁడు మెల్లఁగ వెనుకనుండివచ్చి అతనివీఁపుమీఁద గట్టిగా నొక గ్రుద్దుగ్రుద్ది బిగ్గరగ నవ్వనారంభించెను. తెవారిమాత్రము నవ్వలేదు. అత-నికి వీఁపుననేకాక లోపునకూడ మంటపుట్టి గ్రుద్దునకు హాస్య రసమునకుఁగల సంబంధమునకంటె గ్రుద్దునకు దుఃఖరసముతో దగ్గఱసంబంధ మున్నదని ఉదాహరణపూర్వకముగ చూపించెను...సీతారాముని రసికత తెలియఁజేయుపనులు ఇట్టివి లెక్క-లేనన్ని యున్నవి.

సీతారాముఁ డిప్పుడు ప్రేమపరవశుఁడై రుకిణి కతి

సమీపముగ వచ్చి, "నీవు నాసుభద్రవు నేను నీజగన్నాథుండను," అనెను.

"పశువా, అటుపొమ్ము, సుభద్ర జగన్నాథుని చెల్లెలు!" అన్నది.

సీతారాముఁడు, "అది ఎట్లు కాఁగలదు? అట్లైన సుభద్రాహరణమున కర్థయేమి?"

రుక్మిణి పకపక నవ్వసాగెను; సీతారాముఁడు ఛాతీవిరుచుకొని, "అట్లు నవ్వినంతమాత్రమున నీ వన్నది నిజముకానేరదు, సుభద్ర చెల్లెలైనయెడల 'సుభద్రాహరణ' మెట్లు కాఁగలదో నాకు బోధపఱచుము," అనెను.

తా నిట్టి యుక్తి ప్రయోగించినతరువాత ఎవ్వరును మఱి మాటాడలేరని సీతారాముని నమ్మకము.

"ఛీ మూర్ఖుఁడా!" అన్నది, రుక్మిణి అతిమధురస్వరముతో.

సీతారాముఁడు—"ఔను, నేను మూర్ఖుఁడనే సందేహమేమి! నీవు నన్నెల్లప్పుడును వీఁగఁగొట్టుచునే యున్నావు, నేను నీ కడ నతిమూర్ఖుఁడను." అట్లని ఆమెకు తగినజబాబిచ్చితినని సీతారాముఁడు తనలోఁదాను బహుసంతోషించి నేడు సంభాషణ మంచితమాషాగా జరుగుచున్నదని అనుకొనెను.

సీతారాముఁడు మరల ప్రారంభించుచున్నాఁడు—"సరే, నేనన్నది నీకు బాగుగలేదు గనుక ఆప్రసంగము విడుచు

చున్నాను. నిన్నేమని పిలువమనెదవో ఇప్పుడు చెప్పుము; ఏమని పిలిచిన నీకు సంతోషము కలుగును?"

రుక్మిణి నవ్వుచు, "రాణీ యనుము."

సీతారాముఁడు "రాణీ!"

రుక్మిణి. -"ప్రేయసీ యనుము,"

సీతారాముఁడు- "ప్రేయసీ!"

రుక్మిణి—"ప్రాణేశ్వరీ యనుము."

సీతారాముఁడు—"ప్రాణేశ్వరీ!"

"అట్లైన ప్రాణేశ్వరీ, నీవు నాకు బదులిచ్చినరూపాయల కెంతవడ్డీ పుచ్చుకొనెదవు?"

రుక్మిణి ముఖము చిట్లించుకొనుచు, "పోమ్ము, అటు పొమ్ము! ఇదియే కాఁబోలును నీప్రేమ! ఏముఖముతో వడ్డీమాట యడుగుచున్నావు?" అనెను.

సీతారాముఁ డానందముతో పొంగిపోవుచు, "ఛా ఛా నే నెప్పుడైన నట్టి దనఁగలనా! హాస్యమాడితిని, ఆమాత్రము పోల్చుకొనలేకపోతివా ప్రాణేశ్వరీ! ఛా ఇటురమ్ము!" అనెను.

సీతారామునితల్లికి యెట్టి రోగమువచ్చినదో తెలియదు గాని ఇటీవల మాటిమాటికి అల్లునియింటికి పోవుచున్నది; పోవునప్పుడు ఇంటిఖర్చులకు డబ్బిచ్చి పోవలెనన్న మాట ఆమెకు జ్ఞప్తికిరాకున్నది. కనుక సీతారాముఁడు తఱచుగా రుక్మిణి యొద్దకు రావలసివచ్చుచున్నది. ఈరాకపోకలతోపాటు సీతారాముఁడు రుక్మిణి, వీరిద్దరిలో రహస్యముగ నేదో యాలోచన

జరుగుచున్నది. ఇట్లనేకదినములు గడచినపిమ్మట, చివర కొకనాఁడు సీతారాముఁడు—"అంతపని నాచేత కాదమ్మా, భాగవతునిసహాయము లేనిదే నే నాపని చేయలేను." అనియన్నాఁడు.

ఆనాటిసాయంకాలము తుపాను ప్రారంభమైనది. రాజాగారికోటలో నాలుగువైపులను తలుపులు ధూబ్ ధాబ్ మని కొట్టుకొనుచున్నవి! భయంకరముగ గాలి వీచుచున్నది, తోటలోని పెద్దపెద్దకొమ్మలు ఊగుచు భూమిని తాకుచున్నవి. ఏటివఱదలకు కొట్టుకొనిపోవుచున్న గ్రామములవలె మేఘములు తుపానుగాలికి కొట్టుకొనిపోవుచున్నవి. ఆకాశమున వినబడుచుండునవి మేఘగర్జనములు, కనఁబడుచుండునవి మెఱపులు మాత్రమే. నాలుగుతలుపులను బిడాయించుకొని గదిలో కూర్చుండి యున్నాఁడు ఉదయాదిత్యుఁడు; దీపమార్పివేసెను. అతనియొడిలో చిన్నబాలికయున్నది చిట్టచీఁకటిలో ఉదయుని యొడీలో పిల్ల నిద్రపోవుచున్నది. సురచు ఈపిల్లను మిగుల ప్రేమించుచుండెను. సురమ మృతినొందినప్పటినుండి తల్లి యీ పిల్ల నీ యింటికి పంపుటమానినది. బాలిక ఇన్నాళ్లైనతరువాత నేఁడు కోటలోనికివచ్చినది. ఉదయుఁడు హఠాత్తుగ నామె కంటఁబడగానే, 'కక్కయ్యా కక్కయ్యా,' అని కేకలువేయుచు వచ్చి అతనియొడిలోని కెగిరినది. ఉదయుఁ డామెనెత్తుకొని గట్టిగా కౌఁగిలించుకొని తనపడకగదిలోనికి తీసికొనివచ్చెను. ఉదయుని మనస్సున భ్రమ కల్గినట్లున్నది—"సురమ కీ బిడ్డయెడల బహు

ప్రేమ, ఈమెను చూచుటకు సురమ ఒకసారి వచ్చునేమో! అంతముద్దుచేయుచుండెను గదా, ఆమెను చూచుట కొకసారి రాకుండ నెట్లుండఁగలదు సురమ!" "కక్కయ్యా కక్కొమ్మ యేది?" అని పిల్ల ఒకమా అడిగినది.

"కక్కి నొకమాఱు పిలువు మమ్మా!" అని యుదయుఁ డనెను. అతనికంఠములోనుండి మాట సరిగ రాలేదు. పిల్ల "కక్కీ, కక్కీ" అని పిలిచినది. 'అదిగో ఎవరో జబాబు ఇచ్చు-చున్నా' రనిపించినది ఉదయునకు; 'వచ్చుచున్నానమా ఇదిగో నే!' అనుచున్న ట్లతనికి తోఁచినది. 'ఆముద్దుబిడ్డ పిలుపు విని ఎట్లు రాకుండ నుండగల దాన్నేహీనుయి! వచ్చి యాబిడ్డను ఒడిలో నుంచుకొని కౌఁగిలించుకొననిదే యుండలేదు పాపము! ......పిల్ల ఉదయునిఒడిలో నిద్రపోయినది. ఉదయుఁడు గదిలోనిదీపమార్పి నిద్రించుచున్న ఆపిల్లను ఒడిలో పెట్టుకొని చీకటిలో ఒంటరిగా కూర్చుండెను. అవతల హోరుమని తుపాను శబ్దము; అక్కడక్కడ టక్కుటక్కుమను శబ్దముగుచున్నది— అది యడుగులచప్పుడు; అడుగులచప్పుడే సందేహాము లేదు! లోపలగుండె దగ్ దగ్ మని గట్టిగా కొట్టుకొనుచు ఆయడుగుల చప్పుడు విననీయకుండ నున్నది! అంతలో తలుపులు చటాలున విడి లోపున దీపము వెలుతురు పడినది— నిజమే! అట్టిది, నిజముగా ఎన్నడైన జరుగఁగలదా ' దీపము చేతఁ బుచ్చుకొని స్త్రీవిగ్రహ మొకటి లోనికి వచ్చుచున్నది—ఉద యునికండ్లు మూతఁబడినవి—"ఎవరది సురమయేనా?"

అను మాటలు అతనినోటివెంబడి వెడలినవి. కండ్లు విప్పి-చూచినయెడల సురము వెళ్లిపోవునేమో! అది సురమకాదేమో!

ఆ స్త్రీ దీపము క్రింద నుంచి, "ఏమయ్యా, నేను మఱి మీకు జ్ఞప్తికిరానా?" అని అన్నది.

పిడుగువలె వినఁబడిన ఆమాటలకు ఉదయాదిత్యుఁ డులికిపడి కండ్లు విప్పిచూచెను. ఒడిలోనిపిల్ల లేచి భయ-పడుచు,'కక్కయ్యా' 'కక్కయ్యా' అని యేడ్వసాగెను. ఉదయా-దిత్యుఁడు ఆ బిడ్డను పఱుపుపై పరుండబెట్టి లేచి నిలుచుండెను. ఏమిచేయవలెనో, ఎచ్చటికి పోవలెనో, ఎంత యాలోచించినను తట్టనట్లు చూచుచుండెను. రుక్మిణి మఱికొంచెము దగ్గఱకు వచ్చి తల యాడించుచు, "ఔ నౌను, నేనెఱుఁగుదును! ఇప్పుడు జ్ఞప్తికే రాను! అట్టిన ఆశపెట్టి ఒకప్పుడు నన్నా కాశముపై కేల నెత్తితివి?" అనెను. నోటమాటలేక ఉదయా-దిత్యుఁ డూరక నిలిచియుండెను.

అప్పుడు రుక్మిణి తనయొద్దనుండు బ్రహ్మాస్త్రము బయటికి తీసినది; ఏడ్చుచు, "నేనేమి యపరాధము చేసితిని నా ముఖము నీవు చూడ లేకుండుటకు? నా కొంపముంచినది నీవే! యువ రాజునకు దేహమును ప్రాణమును అమ్మినదాని గతి నేఁ డే మైనది? ముష్టిదానివలె ఇచ్చట నచ్చట తిరుగుచున్నది. భగవంతుఁడు దాని నొసట వ్రాసిన దింతేనా?" అన్నది.

ఈమాటలు ఉదయాదిత్యునకు దెబ్బవలె తగిలినవి, ఆమె దురవస్థకు తానే కారణ మైయుండవచ్చునని అతనికి తోచినది.

పూర్వ మెన్నఁడో జరిగిన వృత్తాంత మతఁడు పూర్తిగ మఱచి పోయెను. యౌవనమున నొకప్పు డతఁడు ప్రమత్తుఁడై యున్న-పుడు, ఆమె అతనిచుట్టు మాయాజాలము నుపన్ని, మాటిమాటికి నెదుటకు వచ్చుచుండి, అతనిమనస్సు నాకర్షింప బహుప్రయ-త్నము చేసినది. సుడిలో చిక్కుకొనినవానివలె చివర కతఁడామె చేతులలోఁ దగుల్కొనెను. సుడివలె నామె యతనిని ఒక్క నిమిషములో పాతాళములోని కీడ్చుకొనిపోయి, అచ్చటి అంధ-కారమునఁ గూర్చుండఁబెట్టినది—యువరాజిదియంతయు పూర్తిగా మఱచిపోయెను. కళ్లువిప్పి చూచునప్పటికి రుక్మిణి చింకి మురికి గుడ్డ యొకటి కట్టుకొని, ఏడ్చుచు, నెదుట నిలిచి యున్నది. మనస్సు కరిగి యువరాజు, "ఏమి నీవు కోరునది?" అని యామె నడిగెను

రుక్మిణి -"నేను కోరునది నీ ప్రేమ—నాకు మఱి యేమియు నవసరము లేదు. నీ వా కిటికీలో కూర్చుండి యున్నప్పుడు నేను నీ కౌఁగిటిలో నుండవలెనని నాకోరిక, నీగుండెపై ముఖమును పెట్టుకొని నిన్ను నా రెండు చేతులతో పట్టుకొని కూర్చుండియుండవలెనని నేను కోరునది. సురమ ముఖముకంటె ఈముఖము నలుపని యూహించుచున్నావా? నలుపే యైయున్నచో నీవే దానికి కారణము—రాత్రిం బగళ్లు నేను తిరుగుచుండుట నీకొఱకే కదా! నాముఖమున పూర్వ మీనలుపు లేదే!"

ఇట్లనుచు రుక్మిణి ఉదయాదిత్యుని పఱుపుపై గూర్చుండఁ

బోయెను. ఉదయుఁడు మఱి యూరకుండలేక, "ఆ పఱుపుపై కూర్చుండకుము, కూర్చుండకుము," అని గద్గదస్వరముతో ననెను.

దెబ్బతగిలినపామువలె భుస్సున తలయెత్తి, "ఏల కూర్చుండఁగూడదు?" అని రుక్మిణి యడిగెను.

ఉదయాదిత్యుఁ డామె కడ్డు వచ్చి, "వద్దు నీ వీపక్క-మీఁద కూర్చుండవద్దు, నీ కేమికావలెనో చెప్పుము, అది నీ కీ క్షణమే యిచ్చెదను," అనెను.

"అట్లైన నీ వ్రేలునకున్న యుంగరము నా కిమ్ము."

ఉదయాదిత్యుఁడు తత్క్షణమే వ్రేలినుండి ఉంగరము తీసి ఆమెమీఁద పాఱవైచెను. రుక్మిణి దానిని పట్టుకొని ఆక్షణమే బయటికిపోయెను. "నామంత్రమిప్పటికిని పాఱుచున్నది, మఱి కొంతకాల మిట్లు గడచినచో మంత్రము పూర్తిగ ఫలించును," అని యనుకొనుచు రుక్మిణి యింటికిపోయినది. ఉదయాదిత్యుఁడు పఱుపుపై పడి, "సురమ యేదీ నాసురమ! నాహృదయము దగ్ధమయిపోవుచున్నది, దానినిప్పుడు ఎవరు శాంతిపఱుపగలరు!" అనుచు చేతులపై ముఖమునుంచుకొని నిశ్వసించెను.

## ఇరువది రెండవ పరిచ్ఛేదము

భాగవతునికి కూడ రోజులు బాగులేవు. కొద్దిదినముల నుండి ఏమియు మాటలాడక యొకచోట నూరక కూర్చుండి గుడుగుడు పీల్చుచున్నాఁడు. భాగవతుఁడు తదేకధ్యానముగ గుడుగుడుపీల్చుట మొదలుపెట్టఁగానే ఇరుగుపొరుగులవారికి భయము పుట్టుచుండును. అతని నోటినుండి నల్లనిపొగ చుట్టలుచుట్టలుగ లేచుట ప్రారంభమైనతోడనే అతని మనస్సులోనుండు మరలోకూడ పని ప్రారంభమగుచున్నదని అందఱు నెఱుఁగుదురు. కాని భాగవతుఁడు గొప్ప ధర్మనిష్ఠ గలవాఁడు. అతఁ డెవరితోను అంతగా కలియువాఁడు కాఁడు —ఇదియే అతని కుండు దుర్గుణము—ఎల్లప్పుడు జపతావళము త్రిప్పుకొనుచు కూర్చుండును, ఇతరుల సంగతులలో దూరఁడు. కాని గొప్పచిక్కులలో తగులుకొనినవారికిమాత్రము భాగవతునివలె సలహా యీయఁగలవాఁ డింకొకఁ డుండఁడు. కోరి ఎవ్వరికిని యపకారము చేయువాఁడు కాఁడు భాగవతుఁడు, తన కపకారముచేయువానిని ఈజన్మములో మఱవఁడు—అట్టి వానిపై పగతీర్చుకొననిదే హుక్కాగొట్టము నోటినుండి క్రిందికి దిగనీయఁడు. భాగవతుఁ డెట్టివాఁడో ఒక్కమాటలో చెప్పుమనిన మంచివాఁడనియే చెప్పవలసియుండును—ఇట్టి వారినే లోకములో మంచివారందుము. గ్రామస్థులందఱును

భాగవతుని మన్నించువారు. రోజులు మంచివికాక భాగవతుఁ డొక మూఁ అప్పుచేసెను, కాని బిందె, చెంబు అమ్మి అప్పుతీర్చి వేసెను.

ఒకనాఁ డుదయము సీతారాముఁడు భాగవతునిదగ్గఱకు వచ్చి, "అంతా క్షేమమూ అన్నా?" అని అడిగెను.

"ఆహా ఏమి క్షేమముకదా!" అన్నాఁడు భాగవతుఁడు.

"ఆలా గనుచున్నా వేమన్నా?"

భాగవతుఁడు కొంతసేపు హుంకార జోరుగా పీల్చి చివరకు గొట్టము సీతారామున కిచ్చుచు, "రోజులు గడచుట బహుకష్టముగా నున్నది," అన్నాఁడు.

సీతారాముఁడు—"నిజముగా! అది ఎట్లు!"

భాగవతునకు లోలోపున కోపమువచ్చి, "ఎట్లో అది నీకుకూడ బోధపఱచవలెనా? నీదికూడ నాయవస్థవంటిదే అని నే ననుకొంటినే" అన్నాఁడు.

సీతారాముఁడు కొంచెము తెల్లఁబోయి, "అది కాదన్నా నే నన్నది," అని దిద్దుకొనుచు, "అప్పుచేసితివి కావేలనని నే నడుగుచుంటిని," అనెను.

భాగవతుఁడు—"అప్పుచేసినయెడల తీర్చనక్కరలేదా! అమ్మిగాని తాకట్టుపెట్టిగాని అప్పుతీర్చుటకు వస్తువులుండవలెనే!"

"నీకెంత అప్పుకావలెనో చెప్పుము నేనిచ్చెదను." అని సీతారాముఁడు నిస్సంకోచముగా ననెను.

"నిజమే? ఒకపిడికెడురూపాయలు వచ్చిననేమి పోయిన

నేమి యనునవస్థలో నీ వున్నచో నామీఁద నొకపదిరూపా యలు పాఱవేయుము—కాని మొదటనే చెప్పుచున్నాను, అప్పుతీర్పుశక్తిమాత్రము నాకు లేదు!"

సీతారాముఁడు—"తీర్పుటవిషయమై నీ వాలోచింప నక్కఱలేదు."

సీతారాముని ప్రీతిచూచి భాగవతునిమనస్సున ప్రేమో చ్ఛ్వాసము గలిగినదని యనుకొనుట సరికాదు. వాలుకుర్చీలో మఱికొంచెము గుడాకువేసి భాగవతుఁడు గుడుగుడు పీల్చ నారంభించెను.

సీతారాముఁడు మెల్లమెల్లగ ప్రస్తావము మొదలు-పెట్టెను—"రాజుగారు మన కన్యాయముచేసి మన యన్నము పడఁగొట్టిరి," అన్నాఁడు.

"ఏదీ, నీ ధోరణిబట్టి అట్లు కనఁబడుట లేదే!" అన్నాఁడు భాగవతుఁడు; సీతారాముని బడాయి సహించియుండుట కత నికి కష్టముగా నున్నది, లోలోపున కోపము పుట్టుచున్నది.

సీతారా—"ఏదో మాటవరుస కనినంతమాత్రాన నీవట్లనుచున్నా వేమి అన్నా? ఇప్పటి కేలాగుననో గడచు చున్నను మఱి పదిరోజులైన తరువాత ఏమౌనో!"

భాగవతుఁడు—"రాజుగా రన్యాయము చేసినచో మనముచేయగల దేమున్నది!"

సీతారాముఁడు—"యువరాజునకు రాజ్యము వచ్చి నప్పుడు యశోహరలో రామరాజ్యముప్రారంభ మగును. అంత

పఱకు మనము బ్రతికియుండఁగలిగిన మనకేమియు లోటుండదు కదా!"

భాగవతునకు కోపమువచ్చి అన్నాఁడు—"అట్టిమాటలతో మాకేమి పని బాబూ? నీవు పెద్దవాఁడవు, ఇంటిలో కూర్చుండియుండి రాజులను వజీరులను చంపుచుందువు పుట్టించుచుందువు—ఆ పని నీవంటివానిలో శోభించును, నేను నిరుపేదను నా కంతసాహసములేదు!"

"కోప మేల అన్నా, నే ననునది మనస్సిచ్చి వినవైనను వినవే!" ఇట్లనుచు సీతారాముఁడు భాగవతునికి దగ్గఱగ వచ్చి చెవిలో నేదో చెప్పనారంభించెను.

భాగవతుఁడు మిగుల కోపగించి, "నాదగ్గఱ అటువంటి మాటలు నోటినుండి రానీయకుము, స్పష్టముగా నీతో చెప్పుచున్నాను, ఎన్నటికిని మఱువకుము," అనెను.

సీతారాముఁ డానాఁడు మఱి భాగవతునికడ నుండ లేదు. రోజంతయు భాగవతుఁడు తదేకధ్యానముగ దేనిని గుఱించియో ఆలోచించుచు కూర్చుండెను. ఆ మఱునాటి యుదయము తానే సీతారాముని యింటికి వచ్చి అతనితో, "నీవు నిన్నను చెప్పితివే—అది చాల బాగుగ నాలోచించి చెప్పినమాటవలె నున్నది," అనెను.

"నేను చెప్పలేదా?" అని మిగుల గర్వముతో సీతారాముఁ డనెను.

భాగవతుఁడు— "ఆ విషయమునుగుఱించి మాట లాడుటకే ఇప్పు డిక్కడికి వచ్చినాను."

సీతారామునికి గర్వము కొంచె మధికమైనది. ఆ నాటినుండి కొన్నిదినములవఱకు ప్రతిరోజు వారిద్దఱును కలసి రహస్యముగా నేదో మాటలాడుకొనుచుండిరి.

ఇన్నిరోజులు వారిద్దఱును కలసి యాలోచించి నిశ్చయించినది దొంగదరఖాస్తొకటి తయారుచేయుటనుగుఱించి. ప్రతాపాదిత్యుఁడు చక్రవర్తిగారికి ద్రోహముచేయ ప్రయత్నించుచుండ ఉదయుఁ డది కనిపెట్టి చక్రవర్తికి తెలుపు చున్నట్లు ఆ దరఖాస్తులో నుండవలెను. అది నిజముగా యువరాజునొద్దనుండియే పోవుచున్నదరఖాస్తని నమ్మకము కల్గించు నట్లు దానిపైని యువరాజు సీలుండవలెను—ఇదియే వారి కుట్ర. యువరాజుగారి ఉంగరము రుక్మిణియొద్దనుండుటచేత సీలువేయుటకు తగినయుపాయము వారిచేతిలో నుండెను.

దొంగదరఖాస్తు యువరాజుగారిసీలుతో తయారైనది. తెలివిమాలినసీతారామున కిట్టిపని ఒప్పఁజెప్పిన నపాయము కలుగవచ్చును, గాన భాగవతుఁడే దానిని తీసికొనిపోయి ఢిల్లీశ్వరునిచేతఁ బెట్టవలెనని నిశ్చయమైనది.

భాగవతుఁడు దానిని చేతఁబుచ్చుకొని ఢిల్లీవైపునకు పోవుటకు మాఱుగా ప్రతాపాదిత్యునియొద్దకు పోయెను. పోయి, "మహాప్రభూ యీదరఖాస్తు యువరాజుగారి నొక రొకఁడు కొనిపోవుచుండ నే నెట్లో పోల్చుకొని వానియొద్ద

నుండి దీనినితీసికొంటిని; ఆనౌకరు దేశమువిడిచి పాఱిపోయెను; నేనీ దరఖాస్తుపట్టుకొని మహారాజావారి సముఖమునకు వచ్చితిని," అనెను. భాగవతుఁడు సీతారామునిపై రెత్తలేదు, దరఖాస్తు చదివినపైని మహారాజావారి కెట్లుండెనో చెప్ప నక్కరలేదు. భాగవతునికి మరల రాజప్రాసాదమున పని దొరకినది.

## ఇరువది మూఁడవ పరిచ్ఛేదము

విభజీవితమున నంధకార మాక్రమించుకొని వచ్చు-చున్నది. గుండెలు బ్రద్ధలగునంత దుఃఖమును, నిరాశయుం దనకొఱకే కనిపెట్టుకొనియుండి ప్రతిక్షణమును దగ్గఱకు వచ్చుచున్న ట్లామెకు తోఁచుచున్నది; తన కిక నెట్టిసుఖము లేదనుభయము పుట్టుచున్నది. కనఁబడుదానినెల్లను మ్రింగుచు జీవనమును శూన్యముచేయుచుండు అపారదుర్భాగ్య మొకటి వచ్చి తనమీఁద పడఁబోవుచున్నట్లున్నది. దానిఛాయయే విభ ప్రాణములపైఁ బడి ఆమెను చెప్పనలవికాని దుఃఖములో ముంచుచున్నది. ఆమె ఒంటరిగా మంచముపై పరుండియున్నది, దగ్గఱ నెవ్వరును లేరు, నిట్టూర్పు విడిచి విడిచి చివరకు యేడ్చుచు, "అప్పైన నన్ను విడిచిపెట్టితివా, నే నేమి యప-రాధముచేసితిని?" అనుచుండెను; వెక్కి వెక్కి యేడ్చుచు ఉండి యుండి, "నేనేమి యపరాధముచేసితిని?" అనుచుండెను. తలగడ గుండెపై వేసికొని, రెండుచేతులను ముఖముపై నుంచి ఏడ్చుచు మాటిమాటికి, "నేనేమి యపరాధముచేసితిని?" అనుచుండెను. "ఒక్కఉత్తరమైనను లేదు, అనుచరులను పంపలేదు, వృత్తాంతము తెలియఁజేయువా రెవ్వరును లేరు! నే నేమి చేయ గలను! గుండెబ్రద్దలై పోవుచున్నది, ఇక్కడినుండి యక్కడికి అక్కడినుండి యిక్కడికి రోజంత యు నేడ్చుచు తిరుగుచున్నాను

ఎవ్వరును నీ సంగతి నాతో చెప్పరు, నీ పేరు ఎవరినోటను వినఁబడదు. ఎంతకాల మిట్లుండఁగలనే అమ్మా?" అని యేడ్చుచుండును. ఇట్లెన్నోరోజులు గడచినది,—ఎన్నో ఉదయములు, ఎన్నో సాయాహ్నములు, ఎన్నోరాత్రులు ఆ రాజప్రాసాదమున సంగహీనురాలై, శూన్యమైయున్న ఆ గదులలో జీవము లేని ఛాయవలె దినదినమును విభ తిరుగుచుండెను.

ఇట్లుండ నొకనాటి ప్రాతఃకాలమున రామమోహనుఁడు వచ్చి, "అమ్మా జయము జయము!" అని ప్రణామముచేసి ఎదుట నిలుచుండెను. సుఖమే ఒకపిడుగై తనపై పడ బోవుచున్న దనునట్లు, విభ ఉలికిపడి, "నీవేనా, మోహనా!" అన్నది—విభ కనులనుండి బొటబొట నీళ్లు కారుట మొదలుపెట్టినవి.

"ఔ నమ్మా నేనే! చూచితిని—తల్లి దుమ్ములను మఱచి వచ్చిపోయినది—ఆమె కొకసారి జ్ఞాపకము తెప్పింపవలెననుకొని వచ్చితిని."

ఏమేమోసంగతు లెన్నియో యడుగవలె ననుకొన్నది విభ. కాని సిగ్గువలన నడుగలేకపోయినది; అడిగెద నడిగెద ననుకొనుచుండెనుకాని అడుగలేదు; అక్కడిసంగతులు వినుటకు ప్రాణము కొట్టుకొనుచుండెను.

రామమోహనుఁడు విభముఖము చూచుచు, "నీ ముఖము వాడియున్న దేమమ్మా! నీముఖము మాడినది, ముఖమున ఆనందములేదు, జుట్టు చింపిరిచింపిరి, రమ్మమ్మా

మనయింటికి రమ్ము—ఇక్కడ నీకు సంరక్షణచేయువా రెవ్వ-రును లేరు," అని యనెను.

విభ లేనినవ్వు తెచ్చుకొని నవ్వినది, ఏమియు మాటలాడ లేదు. చప్పబడిన చెక్కిళ్లపై కన్నీరు పఅదలై పారుట మొదలుపెట్టినది, విభ దాని నాపలేకపోయినది. అనేక దినము లాదరములేక పడియుండి హఠాత్తుగ నొకనాఁ డెవరైన మనలను ముద్దుచేయ వచ్చినచోఁ బట్టశక్యము కాని దుఃఖము ఆనందము మనలో పుట్టును గదా? భక్తితోను ప్రీతితోను రామమోహను డనినమాటలు వినగానే విభ దుఃఖ మాపుకొన లేకపోయినది. "ఇన్నాళ్లైనతరువాత నేను జ్ఞప్తికి వచ్చితినా?" అని విభ తనలో తా ననుకొనినది.

రామమోహనుకూడ కండ్లనీరుపెట్టుకొని, "ఛా, ఛా, అదియేమమ్మా; నీవు మా మహాలక్ష్మివి, నవ్వుముఖముతో మా యింటికి రావలెనమ్మా. నేఁడు శుభదినము కనులు తుడుచుకొను మమ్మా!" అనెను.

అల్లుఁడు కొమార్తెను తీసికొని వెళ్లఁడేమో యని రాణికి లోలోపున అతిభయముగ నుండెను. విభను తీసికొని వెళ్లుటకు రామమోహనుఁడు వచ్చెనని విని యామె మిక్కిలి సంతోషించినది. రాణి రామమోహనుని పిలిపించి దగ్గఱ కూర్చుండఁబెట్టుకొని అల్లునియింటి క్షేమసమాచారములడిగినది, తానే దగ్గఱనుండి ఆనందముతో నతనికి విందుచేయించినది;

భోజనమైనతరువాత మోహానుచెప్పినవార్తలు వినుచు దిన మత్యుల్లాసముతో గడపినది. విభ వెళ్లుటకు మరునాఁడు మంచి రోజు, మరునాటియుదయమే బయలుదేఱుటకు నిశ్చయించిరి. ప్రయాణమునుగుఱించి ప్రతాపాదిత్యుఁడుకూడ నేవిధమగు నాటంకమును కలుగఁజేయలేదు.

ప్రయాణము స్థిరమైనతరువాత విభ యొకమాఱు అన్నయొద్దకు వెళ్లినది. ఉదయాదిత్యుఁ డొంటరిగా కూర్చుండి ఏమో యాలోచించుచుండెను.

విభను చూచి ఉదయుఁ డులికిపడెను. తరువాత "విభా, అత్తైన నీవు వెళ్లెద వమ్మా! మంచిమాటే చెల్లీ! అక్కడికి వెళ్లిన యెడల నీవు సుఖముగ నుండఁగలవు" అనెను. "న న్నాశీర్వ దింపనిమ్ము చెల్లీ!—ఇంటికి మహాలక్ష్మివై భర్తయింటికి కాంతి నిచ్చుచు నుండుము!"

విభ ఉదయాదిత్యుని కాళ్లదగ్గఱపడి యేడ్వ నారంభించి నది. ఉదయుని కనులనుండి బొటబొట నీళ్లు కారుచున్నవి. చెల్లెలితలమీఁద చేయివేసి, "ఏడువేల నమ్మా చెల్లీ" అని ఉదయుఁడనెను. "నీ కిక్కడ నేమున్నది విభా? ఎటుచూచినను దుఃఖము, కష్టము, శోకము; ఈఖైదునుండి బయటకు వెళ్లఁ గలిగినచో బ్రతుకుదువు చెల్లీ!"

విభ లేవఁగానే ఉదయాదిత్యుఁడు మరల ఇట్లనెను. "వెళ్లుచున్నావు చెల్లీ? మంచిది, వెళ్లుమమ్మా! అత్తవారియింటికి

వెళ్లి మమ్ములను కేవలము మఱచిపోకుము. జ్ఞాపకముంచుకొని అప్పుడప్పుడు క్షేమసమాచారములు తెలుపుచుండుము చెల్లీ."

విభ రామమోహానునొద్దకు వచ్చి తా నిప్పుడు రాలేనని చెప్పినది.

"అదేమమ్మా!"అని యాశ్చర్యపడుచు రామమోహానుఁ డడిగెను.

"నే నిప్పుడు రాలేను, అన్నయ్య నొంటరిగ నిచ్చట వదలిపెట్టి నేను రాలేను. నాదుఃఖముకంటె అధిక మన్నయ్య దుఃఖము, నాకష్టముకంటె అతనిది యధికము. అన్నయ్య నొక్కనినే ఇక్కడ నుంచి సుఖమనుభవించుటకు నేను పోఁగలనా? రవంతయైనను దుఃఖ మన్నయ్యమనస్సులో నున్నంతకాలము నే నతనిని విడిచిపెట్టను, నావలె నతనికి సంరక్షణచేయువా రెవరు మోహానా?" ఇట్లనుచు విభ ఏడ్చుచు లోనికి పోయినది.

అంతఃపురమున గోలపుట్టినది. రాణి వచ్చి కోపగించినది, చీవాట్లుపెట్టినది, భయపెట్టినది, మంచిమాటలతో చెప్పినది. విభ యెంతమాత్రము వినలేదు—"లేదమ్మా నేను వెళ్ల లేను," అని మాటిమాటికి ననుచుండెను.

రాణికి విసుగుపుట్టినది, కోపము వచ్చినది. ఏడ్చుచు రాజుగారితో వెళ్లి జరిగినదంతయు చెప్పినది. రాజుగా రంతయు విని, "ఔను బాగుగనే యున్నది, ఇష్టము లేనప్పుడా మె యేల పోవలెను?" అని అతిశాంతముగ ననిరి.

రాణి నిశ్చేష్టురా లాయెను. చుక్కాను వదలి చేతులు త్రిప్పుకొనుచు, "మీయిష్టమువచ్చినట్లు చేసికొనుడు నాయనా, నావూచీ దీనిలో నేమియు లేదు," అనుచు బయటికిపోయినది. ఉదయాదిత్యు డిదియంతయు విని ఆశ్చర్యపడుచు విభకడకు వచ్చి ఎంతో బోధపఱచెను. విభ బోధపఱచుకొన లేదు, మాటాడక కూర్చుండి యేడ్చుచుండెను.

రామమోహనునిముఖము వాడిపోయినది, "అట్లైన నేను పోయెదనమ్మా, రాజుగారితో నే మని చెప్పుదునెదవ్వ?" అని నిరాశతో నడిగెను.

విభ యేమియు నుత్తర మీయక చాలసే పూరక కూర్చుండెను.

మోహనుఁడు, "నాకు సెలవీయుము తల్లీ," అనుచు లేచి వెళ్లఁబోయెను. విభ పట్టరాని యేడ్పుతో "మోహనా," అని పిలిచినది.

మోహనుఁడు, "ఏమమ్మా," అనుచు తిరిగి వచ్చెను.

విభ—"క్షమింపుమని మహారాజుగారితో చెప్పుము. వారు కబురుపంపినప్పుడుకూడ నేను రాలేకపోవుట కేవలము నాదురదృష్టము తప్ప ఇంకొకటి కాదు."

రామమోహనుని ముఖమున నెత్తురు లేదు, "చిత్తము" అనుచు మరల సెలవుపుచ్చుకొని పోయెను. రామమోహనుఁడు విభమాటలను బోధపఱచుకొనలేక పోవుట చూచి విభ

మిక్కిలి దుఃఖించినది. ఎచ్చటికి పోవలెనని యామె ప్రాణము కొట్టుకొనుచుండెనో అచ్చటి కామె వెళ్ళలేకపోయినది. పైగా రామమోహనుఁడు నేఁడు కోపముతో తిరిగి పోవుటకూడ తటస్థించినది—రామమోహనునియెడల నిజమైన యనురాగ ముండెను విభకు! విభ యవస్థ ఎవ్వరును తెలిసికొనలేరు కదా!

విభ యచ్చటనే యుండిపోయినది—కనులు తుడుచుకొనుచు గుండెపై కూర్చుండియున్న భారమును మోయుచు అన్న దగ్గఱనే యుండిపోయినది. శుష్కించి, మాడి, ప్రాణములేని నీడవలె నోటివెంట మాటలేక ఇంటిపనులన్నియుఁ జేయుచుండెను. ఉదయాదిత్యుఁడు ముద్దుతో నేదైన మాట యనునప్పుడు విభ కనులు వాల్చి కొంచెము నవ్వుచుండును. సాయంకాలము అన్న పాదములకడ కూర్చుండి మాటలాడ ప్రయత్నించుచుండెను. తల్లి యేదోవంకను తిట్టినట్లైన ఊరక నిలువఁబడి విని, చివర కొక నీడవలె మిఁతి యొకచోటికి మెల్లఁగ పోవుచుండెను. ఎవరైన నామెగడ్డము పట్టుకొని, "ఏమి తల్లీ, ఇంతనీరస మైపోతి వేమి!" అని అడిగిన, ఏమియు జబాబుచెప్పక కొంచెము నవ్వుచుండెను.

పీ రీ యవస్థలో నున్నప్పుడా దొంగదరఖాస్తు ప్రతాపుని చేతఁబడినది. ప్రతాపుఁ డగ్నిహోత్రుఁ డయ్యెను, చాల యోచనచేసి చివరకు ఉదయుని ఖైదులో నుంచవలసినదని యాజ్ఞాపించెను. మంత్రి నివారించెను. "యువరా జిట్టిపని

చేయఁడు; విన్నవా రందరును నాలుక కఱచుకొని, 'అట్టి మాటలు నోట రానీయకుము' అనుచున్నారు. "యువరాజట్టి, పని చేయునని ఎంతమాత్రము నమ్మదగిన మాటకాదు," అని మంత్రి యనెను. "నేనుకూడ నంతగా నమ్మను," అని ప్రతాపాదిత్యుఁడు జవాబిచ్చెను. "కాని ఖైదులో పెట్టుటవలన తప్పేమి? అక్కడ నతని కేవిధమైనకష్టమును లేకుండఁజేసిన చాలును కదా? రహస్యముగ నేమియు చేయకుండునటుల పహారా మాత్ర ముండును."

# ఇరువదినాల్గవ పరిచ్ఛేదము

రామమోహానుఁడు తిరిగివచ్చి రామచంద్రుని సముఖమున చేతులు జోడించుకొని నిలువఁబడెను. మోహానుఁడొక్కఁడే తిరిగివచ్చుట చూచి రామచంద్రుని సర్వాంగముల మంట పుట్టుచుండెను; అతఁడు కోపముచే నగ్నిహోత్రుఁడాయెను. విభ వచ్చితోడనే ప్రతాపాదిత్యునిమీఁదను, అతని వంశముమీఁదను ఘూతైనమాటలు నాలుగాడి పగతీర్చుకొన వలెనని రామచంద్రరాయలు వేచియుండెను—ఏమి యన వలెనో, ఏవిధముగ ననవలెనో—అదికూడ నిశ్చయించుకొని యుండెను. మూర్ఖుఁడుకాఁడు రామచంద్రుఁడు, మొండిపట్టు పట్టి ఎట్లైన విభను బాధపెట్టవలెనని కాదు అతని యభిప్రాయము. మామగారిమాట అప్పుడప్పుడెత్తి విభకు సిగ్గుతెప్పించెదనను కొనుచు తనలో తా నానందించుచుండెను. ఆ యానందములో మునిగియుండుటచేతనే విభ వచ్చుట కేదైన నడ్డు రావచ్చునను మాట అతనికి తట్టలేదు. అట్టి యవస్థలో నతఁడున్నప్పుడు రామమోహానుఁ డొక్కఁడే తిరిగివచ్చుట చూచి మిగుల నాశ్చర్యపడుచు, "ఏమి, రామమోహన్; ఏమి జరిగినది?" అని యడిగెను.

"అంతయు నిష్ఫలమైనది."

"తీసికొని రాలేకపోయితివా?" అని రా జులికిపడుచు నడిగెను.

"లేదు మహారాజా, నేను బయలుదేరినది మంచి ముహూర్తముకాదు."

రాజు కోపముతో గర్జించుచు ఇట్లనెను—"ఓ నాను! నిన్ను వెళ్లుమనిన దెవరు? వెళ్లవద్దని నీతో పెక్కుమారు లన లేదా? ఛాతీ విరుచుకొని గర్వముతో వెళ్లుచుంటివానాడు—నేడు—"

మోహనుఁడు నెత్తికొట్టుకొనుచు, "నా అదృష్టము వంకర మహారాజా!" అనెను.

రాజు మఱింతకోపముతో, "రామచంద్రరాయలునకు కాదా ఆయవమానము మూర్ఖుఁడా! నీవు నాపేరను బిచ్చ-మెత్తుటకు పోతివి, ప్రతాపాదిత్యుఁడు ముష్టివేయక పొమ్మ-నెను. ఎన్నఁడును నింత ఘోరావమానము మావంశమున నెవ్వరికిని కలుగలేదు!" అనుచు గర్జించెను.

వాల్చియున్న శిరస్సెత్తి రామమోహనుఁడు గర్వ-ముతో నిట్లనెను—"అట్లనఁబోకుము మహారాజా! ప్రతా-పాదిత్యుఁడు పంపనియెడల బలవంతముగ నేను తీసికొనివచ్చి యుందును. అట్లని నీతో చెప్పియేయుంటిని. నీ యాజ్ఞపాలించు-టకై పోవునప్పుడు ప్రతాపాదిత్యునికి జడియువాఁడను కాను నేను. ప్రతాపాదిత్యుఁడు రాజు, నిజమే, కాని నా రాజుకాఁడతఁడు!"

"అట్లైన సాధింపలేకపోయితివేల?" అని రాజడిగెను.

రామమోహనుఁడు కొంతసేపటివఱకు జవాబు చెప్ప-లేదు; వాని కండ్లనుండి బొటబొట నీరు కారుచుండెను.

"త్వరగాఁ జెప్పుము!" అని ఆతురతతో రాజనెను.

రామమోహనుఁడు చేతులు జోడించుకొని, "మహా-రాజా—" అని ప్రారంభించుచుండెను.

మహారాజు—"ఏమైనదో చెప్పుము."

"రాణియమ్మ రా నన్నది." రామమోహనునికనులనుండి నీటిబొట్లు పడుచున్నవి—ప్రేమవలన గల్గినగర్వముతో బిడ్డఁ-డగుమోహనుని హృదయము నిండియుండెను, దానివలన పుట్టినకన్నీరది. 'మాయమ్మపై నాకుఁగల నమ్మకముచే నేను ఛాతీ విఱుచుకొని అమ్మను తీసికొనివచ్చెదనని అత్యానందముతో బయలుదేఱితిని, గాని అమ్మవచ్చినది కాదు, అమ్మ నా పరువు నిలిపినది కాదు,' అని కాఁబోలు నతని దుఃఖము. వృద్ధుఁడైన రామమోహనుని మనస్సున నెట్టిభావ ముదయించుచుండెనో గాని కన్నీరుమాత్ర మాగినది కాదు.

రాజుగారు లేచి నిలుచుండి కోపముతో గ్రుడ్ల నిటునటు త్రిప్పుచు, "కాదా మఱి!" అన్నారు, చాలసేపటివఱకు నోటి-నుండి మఱి యేమాటయు రాలేదు.

"ఔను, ఏలవచ్చును? పొమ్ము, మూర్ఖుఁడా, పశువా, నాయెదుట నిలిచియుండకుము పొమ్ము, తక్షణమే పొమ్ము."

రామమోహనుఁ డేమియు నుత్తరమీయక బయటికి-పోయెను. దోషమంతయు తనదే యని రామమోహనుని నమ్మకము, కనుక దానికితగినశిక్ష తనపైఁబడుట అన్యాయమని వానికి తోఁచలేదు.

పగతీర్చుకొనుటకు మార్గమేదియు రాజుగారికి కనఁబడలేదు. ప్రతాపాదిత్యు నేమియుఁ జేయలేఁడు, విభర్యైనను తనచేతికి చిక్కలేదు, కోపముతో నిటునటు పచారుచేయ-సాగెను.

ఈవార్త రెండుమూఁడురోజులలో అనేకరూపముల ధరించి నలుదిక్కులను వ్యాపించినది, దానికి ప్రతీకారముగ నేదైన చేయనిచో మానము నిలఁబెట్టుకొనుట కష్టమని రామ-చంద్రునకు తోఁచినది. ప్రజలకుఁగూడ కోపము వచ్చినది; 'మామహారాజావారి కవమానమా?' యనుచు, జరిగినయవమానము తమకే యనునట్లు పగతీర్చుకొనఁగోరుచుండిరి. పగ స్వభావసిద్ధముఁగ కావలసినంత యుండెను రామచంద్రునిలో, ఇదికాక 'పగతీర్చుకొననియెడల ప్రజలేమనుకొనెదరు? భృత్యు లేమనుకొనెదరు? రమాయి యేమనుకొనును!' అనుభయముండెను. ఈవిషయమునుగూర్చి రమాయి ఇతరులతో వేళాకోళము చేయుచున్నట్లూహించుకొనిన మాత్రాన రాజుగారికి పట్టరాని కోపము వచ్చుచుండెను.

రాజసభలో నొకనాఁడు రాజుగారు రెండవపెండ్లి-చేసికొనిన బాగుగనుండునని మంత్రి యనెను.

రమాయి—"ఔను, ప్రతాపాదిత్యునికోమార్తె నన్ను గారితో, నుండిపోనిండు."

రాజుగారు రమాయివైపుచూచి నవ్వుచు, "మంచి-మాట యంటివి," అనిరి. రాజుగారు నవ్వుట చూచి సభయందుండువారందఱును నవ్వసాగిరి. ఫర్నాండెజ్ మాత్రము నవ్వక, చీకాకుపడుచుండెను. రామచంద్రరాయలువంటి-వారు మానము కాపాడుకొనుటకై మహాప్రయత్నము చేయుచుందురు, కాని దేనిని మానమనవలెనో, దానినెట్లు కాపాడుకొనవలెనో యెఱుఁగరు.

దివాను— "మంత్రి చెప్పినది మంచిసలహా. అట్లైన ప్రతాపాదిత్యునికిని ఆయనకోమార్తెకును తగినబుద్ధి చెప్పినవార మగుదుము."

రమాయి—"తమ యిప్పటిమామగారికికూడ నొక శుభలేఖ పంపుట మఱవఁగూడదు, లేనియెడల ఆయన దుఃఖింపవచ్చును." ఇట్లనుచు రమాయి కండ్లు చికిలించెను. సభాసదులందఱు నవ్వసాగిరి. వెనుకను దూరముననున్నవారి కీ మాటలు వినఁబడలేదు, కాని వారైనను నవ్వు నాపుకొనలేకుండిరి.

రమాయి—"వరుఁడు పెండ్లి యింట ప్రవేశించునప్పు డాదరించుటకువచ్చు నిల్లాండ్రలో మీా యిప్పటిమత్తగారిని కూడ ఉండుమనికోరుచు యశోహరపురమునకు కబురు పంపుఁడు మహారాజా. 'మృష్టాన్న మితరే జనాః' గనుక ప్రతాపా-

దిత్యుని కొమార్తెకు మృష్టాన్నము పంపువప్పుడు దానితో పాటు రెండుకొబ్బెర కురిడీలుకూడ పంపుడు.”

రాజుగారు పకపక నవ్వుచుండిరి, సభ్యులు నవ్వలేక నవ్వలేక నోట గుడ్డలు కుక్కుకొని ముఖములు ప్రక్కకు త్రిప్పుకొనిరి. ఫర్నాండిజ్ సందుచూచుకొని బయటికి వెళ్లి పోయెను.

దివాన్‌జీ కొంచెము రసికత కనపఱుపఁబోయి, “మృష్టాన్న మితరే జనాః” ఐనచో మృష్టాన్నమంతయు యశోహారపురము ననే ఖర్చైపోవును, మృష్టాన్నము తినుట కర్హులగువారు చంద్రద్వీపమున నెవ్వరును నుండరు!” అనెను.

ఈమాటలు విని యెవ్వరును నవ్వలేదు, రాజుగారు గుడుగుడు పీల్చుచు ఏమియు ననక కూర్చుండిరి, సభ్యులలోఁ గూడ నెవరును నేమియు ననలేదు. రమాయి ఆశ్చర్యపడుచు దివాన్‌జీపై పాకమాటు చూచెను. అమాత్యులలో నొకఁడు దుఃఖముతో “అట్లంటిరేమి దివాన్‌జీ, మహారాజావారి వివాహ మునకు మృష్టాన్న మంత కొంచెము చేయుదు మను కొంటిరా?” అనెను. దివాన్‌జీ తలగోకుకొనుచు ముఖము వాల్చుకొనెను.

రెండవ పెండ్లి నిశ్చయమైనది.

## ఇరువది యైదవ పరిచ్ఛేదము

ఉదయాదిత్యుని బందీచేసియుంచినది మామూలు ఖైదు కాదు, అది కోటకు తగిలియున్న ఒకచిన్న మేడ. మేడకు కుడివైపుననుండు రాజమార్గమునకు తూర్పున పెద్దప్రహరీ యుండెను, ఆ ప్రహరీపైని పహారావాండ్రు ఇటునటు పచారి చేయుచు పహరా యిచ్చుచుండిరి ఉదయాదిత్యునిగది కొక చిన్నకిటికీమాత్ర ముండెను. ఆ కిటికీలోనుండి రవంతమేర యాకాశము, ఒక చిన్న వెదురుపొద, శివాలయమొంకటి కనఁబడు చుండెను. ఉదయుని ఖైదుగదిలోనికి పంపునప్పటికి సంధ్య దాటినది; లోనికి వెళ్లి యతఁడు కిటికీదగ్గఱ తలనుంచుకొని నేల కూర్చుండెను. వర్షకాలము, ఆకాశము మేఘావృతమై యున్నది. దారులు నీటితో నిండియుండెను. రాత్రి వేళ నా దారిని నడు-చుట తటస్థించిన బాటసారుల యడుగులచప్పుడు కస్సుకస్సుమని వినఁబడుచుండెను. కారాగారహృదయకంపనమువలె తూర్పు దిక్కున నుండి పహారావాండ్రయడుగులచప్పుడు విరామము లేక వచ్చుచుండెను. వారువేయు కేకలు జాముజామునకు వినఁ బడుచుండెను. ఆకాశమున నొక్కనక్షత్రమైనను లేదు, ఉద-యునికి కనఁబడుచుండునది వెదురుపొదనునింపియున్న మెరు గుడుపురుగుల మిణుకుమిణుకులు మాత్రమే. ఉదయు

డా రాత్రి పరుండలేదు, తెంపులేక వచ్చుచుండు ఆయడుగుల చప్పుడం వినుచు నాకిటికీయొద్దనే కూర్చుండెను.

విభ ఆ సాయంకాల మంతఃపురముననుండు ఉద్యానములోని కొంకమూలు పోయెను. ఇల్లు దాసదాసీజనముతో నిండియుండెను. ఎటుచూచినను పినతల్లులు, పెత్తల్లులు, "ఏమి సమాచారమమ్మా? ఏమిజరిగినదమ్మా?" అని యడుగుచుండిరి, కండ్లనుండి కారు నీటిబొట్టునీటిబొట్టునకు కారణము చెప్పుచుండవలెను; విడిచిన నిట్టూర్పునిట్టూర్పునకు మఱచినదంతయు జ్ఞాపకము తెచ్చుకొని సమాధానము చెప్పుచుండవలెను. ఇది యంతయు భరించుటకుశక్తిలేక విభ ఉద్యానమునకు వెళ్లి-పోయెను. సూర్యుండానాఁడు మేఘములలో ఉదయించి మేఘములలోనే అస్తమించెను, ఎప్పుడు దినమంతమయి సంధ్య ప్రారంభ మయినదో తెలియలేదు. పశ్చిమాకాశమున కనఁబడిన సువర్ణరేఖ దినము ముగిసియు ముగియకమునుపే మాయమై పోయినది. చీఁకటి అంతకంతకు నధికమైనది. దిగంతమునుండి దిగంతమువఱకు నంధకార మావరించినది. దట్టముగు సంగీతపు చెట్లను అంధకార మతిగాఢముగ జమకూడి, చెట్టునకు చెట్టునకు నుండు నెడమును లేకుండచేసినది.నిస్తబ్ధాంధకారము సర్వమును వ్యాపించి వేయికాళ్లపై నిలిచియున్నదా అనినట్లున్నది. రాత్రి యగుచున్నకొలఁదిని రాజభవనమున దీపములు ఒక్కొక్కటిగ నారిపోవుచున్నవి. విభ సంగీతపుచెట్లక్రిందను కూర్చుండి యున్నది. విభ బహుపిరికిది, ఐనను నేఁడామెకేమియు భయము

కల్గలేదు. కాని యంధకార మధికమగుచున్న కొలఁది పృథ్వి నెవరో తనచేతులలోనుండి లాగుకొనిపోవుచున్నారని ఆమెకు తోఁచినది, జగత్సంసారకూలమునుండి యెవరో తన్ను త్రోసి వేయుచున్నారని తోఁచినది, సుఖమునుండియు శాంతినుండియు తన్ను దూరముచేయుచున్నారని తోఁచినది. ఆమె అడుగందని యంధకారసముద్రమునఁబడ్డది, క్రమక్రమముగ మునిఁగిపోవు చున్నది, పైనున్న యంధకారము గాఢమగుచున్నది, అడుగున భూమిలేదు, కాళ్లు నిరాధారముగ నిలిచియున్నవి, ఎటుచూచి నను దరి కానరాదు, ఆశ్రయములేదు, సంసారకూలమునుండి ఆమె అంతకంతకు దూరమగుచున్నది. యెదుటనున్న పెద్ద అడ్డో కటి ఆకాశము నంటువరకు లేచుచున్నదని ఆమెకు తోఁచు చున్నది. దాని కవతల నెన్నియో యున్నవి—ఆమెమనస్సున గొప్ప యశాంతిపుట్టుచున్నది—అవతలనుండునదంతయు నామె కగపడుచున్న ట్లనిపించుచున్నది. అక్కడ సూర్యకాంతి, యాట పాటలు, ఉత్సవములు—అన్నియుఁ గనఁబడుచున్నవి. కాని యెవఁడో తనక్రూరహస్తములతో నామెను బట్టుకొని వదల కున్నాఁడు, ఆమె తనగుండెలోనిశిరములను పీకి వానిపై పాఱ వైచినను నతఁడు తన్ను వదలఁడని ఆమెకు తోఁచుచున్నది. విభకు నేఁడు దివ్యచక్షువు కలిగినది. సమస్తమును నిండియున్న గాఢాంధకారముపై విధాత ఆమెభవిష్యత్తును వ్రాసి యున్నాఁడు. ఆ యనంత జగత్సంసారమున విభ యొంటరిగఁ

గూర్చుండి ఆవ్రాతను చదువుచున్నది; కనుకనే ఆమెకళ్లపై రెప్ప పడలేదు, దేహమున ఎట్టిచలనము లేదు.

అర్ధరాత్రియైనతరువాత గాలి ప్రారంభించినది, చీఁకటిలో చెట్లఝంకారము వినవచ్చుచున్నది, పసిబిడ్డయేడ్పువలె దూరమున గాలి శబ్దము చేయుచున్నది. ఎంతో దూరమున సముద్రతీరమునఁ గూర్చుండి తనముద్దుబిడ్డలు ఏడ్చుచున్నారని విభకు అనిపించుచున్నది. కలవరపడుచు వారి మెను పిలుచుచున్నారు, తల్లి యొడిలోనికి రావలెనని వారు చేతులు చాచుచున్నారు, కాని తల్లియొద్దకువచ్చు దారి కానలేకున్నారు. ఆవేయి లక్షయోజనముల నిస్తబ్ధగాఢాంధకారమును భేదించుకొని వచ్చి ఆయేడుపు విభ చెవిని పడుచున్నది.

"ఎవరమ్మా మీరు? ఏడ్చుచున్నారేల? ఎక్కడనున్నారు?" అని యడుగుచున్నది. ఆ యేడ్పు వినీవినునంతటనే విభ తనలో తానిట్లడుగుచు ఆ లక్షయోజనముల యంధకార-మార్గమున బయలుదేరినది. ఎచ్చట నాగక వేయిసంవత్సరములు నడచినను ఆమె ప్రయాణము తుదముట్టలేదు, దారిలో నెవ్వ-రును కానరాలేదు. ఆ శబ్దహీనమును, వాయుహీనమును, దినరాత్రిహీనమును, జనశూన్యమును, తారాశూన్యమును దిక్ దిగంతశూన్యమును నైన గాఢాంధకారమున నలుదిక్కుల నుండి వచ్చుచున్న ఆయాక్రందనము విభ చెవిని పడుచున్నది. దూరమున గాలి ఝాంకారము చేయుచున్నది.

విభకు రాత్రి కొంతసేపైనను నిద్ర లేదు. కారాగారమున నున్న యన్నదగ్గఱకుపోవలెనని మరునాఁ డెంతయో ప్రయత్నముచేసినది, కాని సాధింపలేకపోయినది. లోని కెవ్వరిని పోనీయఁగూడదని రాజావారి యాజ్ఞ. రోజంతయు నేడ్చుచుండి విభ చివరకు ప్రతాపాదిత్యునికడకుపోయి ఆయన పాదములమీఁదఁ బడినది. ఎంతయో కష్టముపైని తండ్రి సెలవు సంపాదించినది. మరునాఁడు తెలతెల్లవాఱుచుండ ప్రక్కమీఁద నుండి లేచినతోడనే కారాగారమున ప్రవేశించెను. అన్న పఱుపుపై లేఁడు; నేలకూర్చుండి కిటికీపై తలనుంచుకొని నిద్ర పోవుచుండెను. విభ గుండె బ్రద్దలై పోయినది, లోపలనుండి ఏడ్పు వచ్చుచుండెను. ఎంతో కష్టముపై ఏడ్పు నాపుకొని మెల్లఁగవచ్చి యన్నకు దగ్గఱగ చప్పుడుచేయక కూర్చుండెను. మెల్లమెల్లగ తెల్లవాఱుచున్నది, దగ్గఱనుండు వనమునుండి పక్షులపాటలు వినఁబడుచున్నవి. ప్రక్కనుండు రాజమార్గమున బాటసారులు పాటలుపాడుకొనుచు పోవుచుండిరి. రెండు రాత్రులు నిద్రలేక బడలికఁజెందియున్న పహారావాండ్రు తెల్లవాఱుచుండుటచూచి కూనురాగములతో పాటలు మొదలు పెట్టిరి. అనతిదూరముననుండు నాలయమున ఘంటవాగుచున్నది, శంఖము వినఁబడుచున్నది. ఉదయాదిత్యుఁ డులికిపడి లేచి విభనుజూచి, "ఇదియేమి చెల్లీ, తెల్లవారకమునుపే వచ్చితివి!" అనెను; పూర్తిగ కనులువిప్పి నాలుగువైపులను చూచుచు, "ఇది యేమిది, నే నెక్కడనున్నాను విభా?" అని యాశ్చర్య

పడుచు నడిగెను. కాని ఇంతలో తా నెక్కడనున్నది పోల్చుకొని విభవైపుచూచి నిట్టూర్పువిడుచుచు, "ఆహా విభా, నీవు వచ్చితి వమ్మా! నిన్న నొక్కమాత్రైనను నిన్ను చూడలేదు, మీ రెవ్వరును మఱి నాకు కనఁబడరని భయపడితిని" అనెను.

విభ అన్నదగ్గఱకు జరిగి కనులు తుడుచుకొని, "నేల కూర్చుండియున్నావేమి అన్నయ్యా? మంచముమీద పఱపు పఱచియున్నను నీ వొక్కమాత్రైనను మంచముదగ్గఱకు పోయి నట్లు లేదు? ఈ రెండురాత్రులు నేలనే కూర్చుండియున్నావా అన్నయ్యా?" అనుచు ఏడ్వనారంభించినది.

ఉదయాదిత్యుఁడు నెమ్మదిగ ప్రారంభించెను, "మంచము పై కూర్చుండినయెడల నాకాశము కనఁబడదు విభా. కిటికీయొద్ద కూర్చుండినచో ఆకాశమున నెగురుచుండుపక్షులు కనబడి, ఎన్నడో యొకనాఁడు నేనుకూడ పంజరమునుండి విముక్తుఁడనై బయటికి వత్తునని యాశ పుట్టుచుండును; నేనుకూడ ఆ పక్షులవలె ఆయనంతాకాశమున మనసార విహారముచేసెద నను యూహపుట్టుచుండును. ఈ కిటికీ విడిచి అటుపోయినయెడల అన్నివైపుల నంధకార మగపడుచుండును, ముందొకనాఁడు ముక్తిపొందఁగల ననుమాట తట్టనేతట్టదు, నా చుట్టునుండు నావరణ యెన్నఁడైన విరుగఁగలదని తట్టదు, ఈఖైదునుండి విడుదల పొందఁగలనని తట్టదు. ఈఖైదులో, ఈకిటికీయొద్ద నుండు నీ రెండుమూలలస్థలములో కూర్చుండియున్నప్పుడు

మాత్రమే నాకు స్వభావసిద్ధముగ స్వేచ్ఛయున్నదనియు, ఏరాజైనను, ఎట్టి రాజాధిరాజైనను నన్ను బంధించియుంచ లేఁడనియు తోఁచుచుండును. అక్కడ నున్నది మెత్తనిపఱుపు. అదియే నాఖైదు."

నేఁడు హఠాత్తుగ విభ కనఁబడఁగానే ఉదయాదిత్యు-నకు మిగుల నానందము కలిగినది, ఖైదుద్వారములన్నియు ఒక్కమాఱుగ విడినవని తోఁచినది. విభను దగ్గఱగ కూర్చుండఁ బెట్టుకొని అత్యుల్లాసముగ ప్రసంగించుచుండెను, ఖైదులో పడకముం దతఁ డెన్నఁడును చెల్లితో నింతగా మాటలాడి యుండఁలేదు. ఒక జీవుఁడు లోనుండి మఱియొక జీవుఁడు లోనికి వార్త లెట్లుపోవునో మన మెఱుఁగముకదా ! ఒకహృదయమున పుట్టుతరంగములు మఱియొక హృదయము నెట్లు తరంగితము చేయునో మనకు తెలియదు కదా! విభహృదయమున పులకరింపు పుట్టినది, అనేకదినములనుండి కోరుచుండు కోరిక నేఁడు సఫలమైనది. విభ సామాన్యబాలిక, ఉదయాదిత్యునిమనస్సు కానందము కల్గించఁగలనని ఇన్నాళ్లకు నేఁ డామె అకస్మాత్తుగ కనిపెట్టినది. ఆమె హృదయమునకు బలముకల్గినది. నేటివఱకు నా మెకు నలుదిక్కుల నంధకారమే కానవచ్చుచుండెను; ఎటు వైపునను దరి కానరాలేదు; నిరాశాభారమువలన క్రుంగిపోవు చుండెను. తనపై తనకే నమ్మకము లేకయుండెను; సదా ఉదయాదిత్యునికొఱకే ఏదో యొక పనిచేయుచుండెను, కాని అన్నను సుఖపెట్టఁగలననిమాత్రము ఎప్పుడు నాశింపలేకుండెను.

నేఁ డకస్మాత్తుగ మార్గమొకటి ఆమెకు కనఁబడినది, ఇంతకాలము నుండి పడుచుండు శ్రమ ఆమె మఱచినది. ప్రభాతతుషారము వలె అశ్రుజల మామెకంట కనఁబడినది, తేటయైన చిరునవ్వామె పెదవులపై వికసించినది.

ఇప్పు డొకవిధముగ విభకూడ ఖైదీయైపోయినది. కిటికీ లోనుండి వెలుతురు వచ్చియురాకమునుపే, ఖైదుతలుపులు విడి విభయొక్క విమలవిగ్రహము అన్నగారియెదుట కనఁబడు చుండును. జీతముపుచ్చుకొను నౌకర్ల నేమియుఁ జేయనిచ్చునది కాదు విభ, అన్నకు కావలసినదంతయు తనచేతులతో తానే చేయుచుండును—తానే అన్నకొఱకు వంటచేసి తానే ఆహా-రము నన్నయొద్దకు తీసికొనివచ్చును, తానే అన్నపఱపుసవరించి సిద్ధముచేసియుంచును. విభ చిలుక నొకదానిని తీసికొనివచ్చి అన్నగదిలో నుంచినది, ప్రతిదినమును పూలతోటనుండి పూలు కోసితెచ్చి ఉదయమున అన్నగదిలో నుంచుచుండును. గదిలో మహాభారతమొకటియుండెను, చెల్లెలను తనదగ్గఱ కూర్చుండఁ బెట్టుకొని అన్న దానిని చదివి వినిపించుచుండును.

ఉదయాదిత్యుని మనస్సునకు బాధకలిగించుచున్న దొక్కటిమాత్రముండెను. తాను మునిఁగిపోవుచున్నాఁడు—అదినిశ్చయము. కాని తనయసంపూర్ణసుఖము, నిష్ఫలమగు నాశ ఆసుకుమారివిభ నాశ్రయముచేసికొని, తనతోపాటు ఆమెను కూడ ముంచివేయుచున్నానేమో యనుభయ మతనిని మిగుల

బాధించుచుండెను. ఈ మాటు విభ వచ్చినప్పుడు ఇఁక నీవిక్కడ నుండకుమమ్మా, పొమ్ము, అని చెప్పవలెనని ప్రతిదినమును ఉదయాదిత్యుఁ డనుకొనువాఁడు. ఉషను చేయిపట్టుకొని ప్రభాత వాయువుతో విభ ప్రతిదినము నా కారాగారమున ప్రవేశించి, అతిమధురస్వరముతో ప్రేమనొలికించు మాటలాడుచు వచ్చి, తనదగ్గఱ కూర్చుండఁగానే ఉదయునిమనస్సు కరగిపోవు చుండును. "విభా నీవు పొమ్ము క్కాకొఱ కుండకుము, నాయొద్దకు వచ్చుచుండకుము, నేను నిన్నిఁక చూడను," అని అతనినోటి నుండి యెట్లు రాఁగలదు? రేపు చెప్పెదనని ప్రతిదినమును నిశ్చయించుకొనుచుండును, కాని ఆ రే పెన్నటికిని రాకుండెను. తుద కొకనాఁడు దృఢప్రతిజ్ఞ చేసికొని విభ గదిలోనికి వచ్చిన తోడనే అతఁడు ప్రారంభించెను—"విభా నీ విఁక నిక్కడ నుండకుముమ్మా, నీవు వెళ్లినఁగాని నాకెట్టిశాంతియు కలుగదు. ప్రతిదినమును సాయంకాలము కాఁగానే ఎవరో వచ్చి చీఁకటిలో నిలిచి, విభవిపత్తు దగ్గఱపడుచున్నదని చెప్పుచున్నాఁడు. అంద ఱును నన్నువిడిచి పొండు విభా, నేను శనిగ్రహముసు, నే నగపడినతోడనే భూలోకమునందుండు విపత్తులన్నియు నలు దిక్కులనుండి పరుగెత్తుకొనివచ్చును. నీవు మీాయత్తవారి యింటికి పొమ్ము తల్లీ! అప్పుడప్పుడు నీక్షేమము తెలియఁజేయు చుండుము. అదియే నాకు చాలును విభా!" విభ మాటాడక ఊరక కూర్చుండెను.

ఉదయాదిత్యుఁడు తలవాల్చి విభముఖమువైపు చాల నేపటివరకు చూచుచుండెను. అతనికనులనుండి నీళ్లు బొటబొట కార నారంభించినవి. తాను విడుదలపొందనిదే విభ తన్నెంత మాత్రమును విడిచిపోదని ఉదయునికి బోధపడినది. కాని తానెట్లు విముక్తుఁడు కాఁగలడు ?

## ఇరువది యారవ పరిచ్ఛేదము

తండ్రియాజ్ఞయు, అన్నప్రేరేపణయు విభ తనయొద్దకు రాకుండుటకు కారణములని రామచంద్రరాయల యభిప్రాయము. విభ తానే కోరి ఉండిపోయినదని రామచంద్రుఁడొప్పుకొనఁడు, అట్లైన స్వాభిమానమునకు భంగము కలుగును. ప్రతాపాదిత్యుఁడు తన్నవమానింపఁగోరి విభను తనయొద్దకు పంపకున్నాఁడని రామచంద్రుఁడు నిశ్చయపఱచెను. కాని 'నేను దానికి ప్రతీకారముచేయలేకున్నానేమి? మీకుమార్తెను నేను విడిచిపెట్టితిని, ఆమెను చంద్రద్వీపమునకు మఱి పంపవద్దు.' అని మామగారిపేర నొకజాబు వ్రాయలేకున్నాఁడేమి? అనేకవిధముల నాలోచించి నలుగురిసలహా తీసికొని తుద కాధోరణిలో జాబువ్రాసి ప్ర           నికి పంపెను. ప్రతాపాదిత్యునికీ రీతిని వ్రాయుట సామాన్యసాహసకృత్యము కాదు. కనుక రామచంద్రునకు లోలోపున వణఁకు పుట్టుచుండెను, కాని యేటవాలుగనుండు కొండ దిగుచుండువాఁడు ఎంతభయపడుచున్నను నడుమ నాగలేఁడు—రామచంద్రునిది ఇప్పుడాయవస్థ; హఠాత్తుగ నొకసాహసకార్యమున దిగియున్నాఁడు, ఆ పని తుదముట్టక ఊరకుండలేఁడు. రామమోహనుని పిలిచి ఆపత్రము యశ్శోరునకు తీసికొనివెళ్లుమని చెప్పెను. "క్షమించుము మహారాజా, నే నాపని చేయలేను," అని మోహనుఁడు

ప్రత్యుత్తరమిచ్చెను; "మఱి యెన్నఁడును యశోరునకు పోకూడదని నిశ్చయించుకొంటిని. పోయి మా రాణియమ్మను తీసికొనిరమ్మని నీవుకోరినయెడల మఱియొకఘూరక్కడకుపోవుట కభ్యంతరములేదు, కాని యీజాబు తీసికొని వెళ్లుటమాత్రము నేను చేయఁగలపనికాదు." రాజుగారు మోహనునితో మఱి యేమియుననక, వృద్ధుఁడగు నయన్ చంద్ చేతి కాజాబు నిచ్చిరి. అత డా జాబును పట్టుకొని యశోరునకు బయలుదేఱెను.

నయన్ చంద్ జాబుతీసికొని వెళ్లెను, నిజమే; కాని వానికి ప్రాణములుమాత్రము లేవు, ఆ జాబు రాజుగారిచేతపడిన నెట్టి ప్రమాదమైన జరుగవచ్చును. అనేకవిధముల నాలోచించి చివరకు దానిని రాణిచేత కీయవలెనని నిశ్చయించుకొనెను. అప్పుడు రాణి యవస్థ మిగుల శోచనీయముగ నుండెను. ఒక మూలనుండి విభను జూచి కష్టము నొందుచుండెను, మఱియొక మూలనుండి ఉదయునిమాట యనుకొని బాధపడుచుండెను. ఆ దుఃఖము, ఆ బాధ ఆమెమనస్సును చీల్చివేయుచుండెను. ఉండియుండి ఆమెకన్నులనుండి అశ్రుధారలు పడుచుండెను. ఆమె యిట్టియవస్థలో నుండునపు డా జాబామెచేతఁ బడెను. రాణి కేమిచేయను తోఁచలేదు. విభ కా సంగతి చెప్పుటకు వీలు లేదు, అది తెలిసినచో విభ మరి బ్రతుకదు. మహారాజుగారికి దాని మాట తెలిసినయెడల నెట్టియుపద్రవమైనను జరుగ వచ్చును. కాని యట్టిదురవస్థలో నున్నను ఎవ్వరితోనైన నేమియు ననక, ఎవరి సలహాను గోరక, బాధపడుచు రోజులు

గడపుటకంటె ఆమెకు చావు మేలనిపించినది. రాణికి ఎటుచూచి నను మహాసముద్రమే. భరింపలేక చివరకు ప్రతాపాదిత్యుని యొద్దకుంబోయి విభ కేదయో దారిచూడవలసినదని చెప్పినది.

ప్రతాపాదిత్యుఁడు—"అట్లనుచున్నావేమి?"

రాణి—"ఏదో జరిగినదని కాదు నేననునది ఏదెట్లైనను విభ నెప్పుడో అత్తవారియింటికి పంపవలెను గదా!"

రాజు—"అది నాకు తెలియును; కాని ఆ సంగతి ఇంత-కాల మైన పిమ్మట హఠాత్తుగ జ్ఞప్తికివచ్చుటకు కారణమేమి?"

రాణి భయపడుచు నిట్లనెను— "అన్నమాట నీవు వదలకు మహారాజా; అదే నీతోనుండుచిక్కు. ఏమైన జరిగిన దని నే ననలేదే? కాని జరిగిన యెడల—"

"జరిగినయెడల జరుగును. అంతకంటె నధిక మేమి కాఁగలదు?" అని చీకాకుపడుచు రాజుగా రనిరి.

"అల్లుఁడు, విభ నాకు మఱియక్కర లేదు, ఆమెను వదలి పెట్టితిని అనునేమో!" అని యనుచు రాణి యేడ్వసాగెను.

కోపమువలన ప్రతాపాదిత్యునికన్నులనుండి నిప్పులు రాలుచుండెను.

రాజుగారి రౌద్రస్వరూపమును జూచి రాణి తొందర తొందరగ కనులు తుడుచుకొని, "అల్లుఁడు నిజముగా విభను మఱి పంపవద్దని వ్రాసెనని నే ననలేదు, కాని ఎప్పుడైన అతఁ డట్లువ్రాయ నిశ్చయించుకొన వచ్చునని నే ననునది," అని యనెను.

రాజు—"అప్పుడు జరుపవలసినది జరిపెదను, దాని విషయమై యాలోచించుట కిప్పుడు వ్యవధిలేదు."

రాణి మరల నేడ్వనారంభించినది: "నీపాదములపై పడుచున్నాను మహారాజా! నామాట ఈ ఒక్కటిమాత్రము నిలుపుము. విభగతి యేమికాఁగలదో ఒక్కమా ఆలోచించి చూడుము. నేను గుండె రాయిచేసికొని కూర్చుండియుండఁ-బట్టిగాని ఎంతదుఃఖపెట్టఁగలవో అంతదుఃఖపెట్టితివి నన్ను. రాజపుత్రుఁడు, నాబిడ్డఁ డుదయుని తీసికొనిపోయి సామాన్యాపరాధివలె ఖయిందులోనుంచితివి. నాముద్దుబిడ్డఁడు వట్టి యమాయికుఁడు, ఎవ్వరికిని ఎట్టి యపకారమును చేయలేదు. ఎట్టి విషయములోనైనను దూరఁడు. వాని కేమియు బోధ-పడదు, రాజకార్యములు నేర్చుకొనఁడు, ప్రజలను లోఁగు-బాటులో నుంచలేఁడు, వానికి బుద్ధిలేదు—ఇదియే వాని దోషము. కాని భగవంతుఁడు వాని నట్లుచేసినప్పుడు నాబిడ్డని తప్పేమున్నది అందులో?" ఇట్లనుచు రాణి మఱీ యేడ్వ సాగెను.

"ఈమాటలు చాలమాఱు లయినవి. నీవు మఱి యేదియో అనుచుంటివి, దానినిగుఱించి కానిమ్ము," అని చీకాకుపడుచు రాజనెను.

రాణి తల చేతులతో మొత్తుకొనుచు నిట్లనెను—"చెప్పవలసిన దేమున్నది, నావ్రాత బాగుగ లేనప్పుడు? చెప్పి-

నను నీవు వినెదవు గనుకనా? విభవై పొక్కమూలు చూడుము రాజా! అది యెవ్వరితోను ఏమియు అనదు, రోజుకు రోజు కృశించిపోవుచున్నది. కేవల మొకఛాయ యైపోయినది; దాని కేదియో దారిచూడుము మహారాజా!"

ప్రతాపాదిత్యుఁడు చీకాకుపడుచుండెను. రాణి తానన వలసినమాట లని లోనికి వెల్లిపోయినది.

## ఇరువది యేడవ పరిచ్ఛేదము

ఇంతలో నొకచిన్నసంగతి జరిగినది. ఉదయాదిత్యుని ఖైదులోఁ బెట్టిరని తెలియఁగానే సీతారామునికి కాళ్లుచేతులు మఱియాడలేదు. వినఁగానే వాఁడు తిన్నగ రుక్మిణియింటికిఁ-బోయి నోటికివచ్చిన మాటలన్నియు ననుచు దానిని గొట్టఁ బోయెను. "నీయింటికి నిప్పంటించి యువరాజును విడిపించక పోయిన నా పేరు సీతారాముఁడు కాదే పిశాచీ," అనెను. "ఇప్పుడే బయలుదేరి రాయగడ వెళ్లుచున్నాను; అక్కడి-నుండి రాఁగానే నీ పాడుముఖమును రాళ్లపై రాచి, ముఖ-మునకు మసిపూసి, సున్నపుబొట్లు పెట్టి ఊరినుండి నిన్ను వెళ్లఁ-గొట్టెదను. అప్పటివఱకు ఒక్కగ్రుక్కెఁడు నీరైనను త్రాగను."

రుక్మిణి కొంతసేపు తెప్పపాటులేక సీతారామునివైపు చూచుచు వినుచుండెను; పండ్లు, పెదవులు బిగించి, పిడికిళ్లు పట్టి నిలుచుండెను. కనుబొమ్మలపై నల్లనిమేఘములు కూడుచుండెను. ఊపిరి నిలిచిపోయెను. మఱికొంతసేపటికి ఆమె పెదవులు వణఁక నారంభించినవి. కాళ్లలోను, చేతులలోను కంపము పుట్టి-నది, కనులలో మెఱపుపుట్టినది, కనుబొమ లాడుట మొదలు పెట్టినవి, జుట్టు పైకితన్నుకొనివచ్చినది. క్రౌర్యమే రూపము ధరించి స్థూలమగుకాయముతో తనతలపైఁబడవచ్చుచున్నదని సీతారామునికి తోఁచి అతఁడు తత్క్షణమే ఆకుటీరమునుండి బయ-

టికి పరుగెత్తెను. కొంతసేపటికి రుక్మిణిలో పుట్టినవణఁకు తగ్గినది; పిడికిళ్లు విడినవి; పెదవులు విడినవి. అక్కడనే కూర్చుండి ప్రారంభించినది—"ఓ నౌను, యువరాజు నీకే యువరాజు! యువరాజాపదలోపడెనని నీకు బహుకష్టముగనున్నదికాబోలు! యువరాజు నాకేమియు కాఁడు కదూ! పశువా! నీ వెఱుఁగవు. యువరాజు నా యువరాజు! అతని కీడైన మేలైన నేను చేయఁగలను. నా యువరాజును నీవు ఖైదునుండి విడిపింపఁగలవా? చూచెద నీ వాపని నెట్లు సాధించెదవో!"

ఆనాఁడే బయలుదేరి సీతారాముఁడు రాయగడ వెళ్లెను.

సాయంకాల మగుచున్నది, వసంతరాయలు చావడిలో కూర్చుండియున్నాఁడు. ఎదుట పెద్దబయ లొకటియున్నది. దానియంచున, కాలువ కవతలియొడ్డుననుండు మామిడి తోఁటలో సూర్యుఁడు మునుఁగుచున్నాఁడు. వసంతరాయలుని చిరసహచరిగయుండిన వీణ యిప్పు డతనిచేత మఱిలేదు. అస్తమించుచున్న సూర్యునివైపు చూచుచు ఆ వృద్ధుఁడు తనలోఁదాను పాడుకొనుచున్నాఁడు.

అతఁడు పాట యేల పాడుచుండెనో కదా! 'పాడుచున్నానుగాని ఎవరికొఱకై పాడుచున్నానో వా రిక్కడ లేరే!' అని యనుకొనుచుండవచ్చును. 'పాట దానియంతట నదే వచ్చుచున్నది, కాని పాటవలన మనస్సునకు మునుపటి సుఖము లేదు. ఇప్పటికిని ఆ యానందము మఱచిపోలేను,

కాని యానందము పుట్టినప్పు డెవరిని గౌఁగిలించుకొన వలెనని నా మనస్సున కోరికపుట్టుచుండునో వారేరి? ఆతోట చెట్టుపై మేఘములు చేరిననాఁడు నా మనస్సానందపరవశమై నాట్యముచేయసాగినది, ఆనాఁడే యశోహరునకు పోతిని—ఎవరికొఱకు కచ్చేటికి పోతినో వారిని మఱి చూడలేనా? ఇప్పటికిని అప్పుడప్పుడు మునుపటివలె నాహృదయమం దానందము పుట్టుచున్నది, కాని, ఆహా!—" ఈ విధముగ నాలో-చించుచు కాఁబోలు వసంతరాయల కంఠమునుండి పాట దానియంతట నదియే వచ్చుచున్న దీ సాయంకాలము!

అట్టిసమయమున ఖాఁసాహేబ్ వచ్చి అతిభక్తితో సలాముచేసెను. వానిని జూడఁగానే వసంతరాయలు అపరిమిత సంతోషముతో, "రమ్ము, ఇటురమ్ము ఖాన్‌సాహేబ్," అనెను; మఱికొంచెము దగ్గఱకువెళ్లి కొంచెము కలతఁజెందుచు, "నీముఖము నేఁ డంత వాడియున్న దేల? కులాసాగా నున్నావా?" అని యడిగెను.

ఖాన్—"ఎట్లున్నావని యడుగకుఁడు మహారాజా, మీముఖము వాడియుండుట చూచి మా కానంద మెట్లుండఁ-గలదు? మాలో నొకసామెత యున్నది—రాత్రి యనునఁట: 'నాలో నేమియు లేదు, కాని నాతలపై చంద్రుని నుంచుకొంటిని, ఆచంద్రునితోనే నావికాసము, చంద్రుఁడు వాడినదేప్పు నేను వాడుదును!' మాలో నున్న దేమి మహారాజా? మీ ముఖమున నవ్వు లేనప్పుడు మాముఖములు వాడియుండక మఱి

యెట్లుండగలవు? మా కిఁక నెట్టిసుఖమును లేదు, మహా ప్రభూ!"

"నా కేమియు జబ్బుచేయలేదే, అట్లనుచున్నావేమి? నన్నుజూచి నేనే నవ్వుచుందును, 'నాలో నేనే ఆనందించుచుందును—నా కెట్టిజబ్బును లేదే సాహేబ్!" అని వసంతరాయలాతురతతో ననెను.

"మునుపటి మీపాట లేవి మహారాజా?" అని సాహేబడిగెను.

"నాపాటలు వినవలెనని యున్నదా?" అని కొంచెము గాంభీర్యమువహించి యడుగుచుఁ బాట ప్రారంభించెను.

"మీవీణావాద్య మేది మహారాజా? మీ వీణ యేమైనది?" అని సాహేబడిగెను.

వసంతరాయలు కొంచెము నవ్వి జబాబు చెప్పెను—"యున్నది వీణ, లేకపోలేదు. కాని తీగెలుమాత్రము తెగిపోయినవి, కంఠము దానితో కలయుటలేదు." ఇట్లని తల తడవుకొనుచు మామిడితోఁటవైపు చూడసాగెను.

కొంచెమునే పూరకుండి, "ఖాన్‌సాహేబ్ నీవొక పాటపాడుము—ఎదీ ఆ "తాజ్ బె తాజ్ నౌబె నౌ!"

ఖాఁ పాట ప్రారంభించెను:—

"తాజ్ బె తాజ్ నౌబె నౌ."

సాహేబ్ పాట వినుచు ఒక్కనిమిషములో వసంతరాయలు ఒడలుమఱచినవాఁడయి మఱి కూర్చుండి యుండలేక లేచి నిలుచుండి వానితోఁగలసి పాడ నారంభించెను; చేతులతో

తాళమువేయుచు ఒకేచరణము పదిమార్లు పాడుచుండెను. వీరిద్దఱు నిట్లు పాడుచుండ సూర్యుఁ డస్తమించి, చీఁకటి పడుచుండెను. గొల్లపిల్లవాం డ్రింటికిఁబోవుచు; ఈ పాట విని తాము ను పాట మొదలుపెట్టిరి. సీతారాముఁడు ఇట్టిసమయమున వచ్చి వసంతరాయలకు దండముపెట్టెను. వసంతరాయ లులికి పడి, పాట నిలిపి, సీతారామునికి దగ్గఱగ వచ్చి వానిమీఁద చేయివేసి ప్రశ్నింప మొదలుపెట్టెను—"ఇదిగో! సీతారామ్! కులాసాగా నున్నవా? తాత యేలాగుననున్నాఁడు? విభ యెక్కడ? అందఱును క్షేమమా?"

సాయిబు అచ్చటినుండి మెల్లగపోయెను. "ఒక్కొక్కటి మనవిచేయుచున్నాను మహారాజా," అనుచు సీతారాముఁడు సంగతులు చెప్పుట మొదలుపెట్టెను. యువరాజు ఖైదులో నుండుటనుగుఱించి కొంచెము కొంచెముగఁజెప్పుకొని వచ్చెను. కాని మొదటినుండి చివరవఱకు జరిగినదంతయు జరిగినట్లుగఁ జెప్పలేదు, యువరాజు కారాబద్ధుఁ డగుటకుఁ గారణ మంత స్పష్టముగ తెలియపఱచలేదు.

వసంతరాయలతలపై పిడుగుపడినది, సీతారామునిచేయి గట్టిగాఁ బట్టుకొని నిలుచుండెను; కన్నులు పెద్దవిచేసి నోరు తెఱచి, కనుబొమ్మలెత్తి, ఱెప్పవేయకఁ జూచుచు, "హాఁ! నిజమే!" అని యనెను.

"ఔను, నిజమే మహారాజా!" అనెను సీతారాముఁడు.

కొంచెమునే పూరకుండి వసంతరాయలు "సీతారామ్!" అని యనెను.

"మహారాజా!"

"అల్లైన తాత యిప్పు డెక్కడ?"

"ఖైదులో మహాప్రభూ!"

వసంతరాయలు తల తడవుకొనుచు నిలుచుండెను. ఉదయాదిత్యుఁడు కారాగారమున నున్నాఁడనుమాట అతని తలలో నిలువకున్నది. ఎంత యత్నించినను ఊహింపఁజాల కున్నాఁడు. మఱియొకనిమిష మూరకుండి, "సీతారామ్" అని మరల ననెను.

సీతారాముఁడు—"ఏమి సెలవు మహారాజా?"

"అల్లైన తాత యిప్పు డేమి చేయుచున్నాఁడు?"

"మఱి యేమి చేయఁగలడు, ఖైదులో కూర్చుండి యున్నాఁడు."

"అందఱును గలసి యతనిని ఖైదులోపెట్టి తాళము వేసిరా?"

"చిత్తము మహాప్రభూ!"

"ఎవ్వరును అతనిని ఒకమారైనను బయటికి రానీయరా?"

"లేదు రానీయరు మహారాజా!"

"ఒక్కఁడే ఖైదులో కూర్చుండియుండునా?"

ఈప్రశ్నలు వసంతరాయలు తనలో తా ననుకొనుచున్నవి, విశేషించి ఎవ్వరినిఁ నడిగినవి కావు. సీతారాముఁ

డామాట గ్రహింపఁజాలక, "ఔను మహారాజా," "లేదు మహాప్రభూ," అని యుత్తర మిచ్చుచుండెను.

"తాతా, నీవు నాదగ్గఱకు రారా నాయనా! నిన్నెవ్వ-రును పోల్చుకొనలేకపోయిరి!" అని వసంతరాయ లనెను చివరకు.

# ఇరువది యెనిమిదవ పరిచ్ఛేదము

ఎవరి యాజ్ఞయు లక్ష్యముచేయక వసంతరాయలు మరునాఁడే బయలుదేఱి యశోహరమునకు వచ్చెను. వచ్చి తిన్నగ ప్రాసాదాంతఃపురములోనికిఁ బోయెను. హఠాత్తుగ తాతయ్యను చూచి విభ ఏమియు బోధపఱచుకొనలేకపోయి-నది. కొన్నినిమిషములు ఏమి చేయను ఎఱుగని దానివలె నిలుచుండెను—నోట మాటలేదు, కనులలో విస్మయమును, ముఖమున నానందమును మాత్రము కానఁబడుచుండెను. కొంచెమునే పిట్లు నిలుచుండి తాతయ్య కాళ్ల నద్దుకొని, పాద ధూళి తీసికొన్నది.

వసంతరాయ లేకాగ్రచిత్తముతో విభను చూచుచు "విభా!" అనెను. "విభా!" అనుమాట తప్ప మఱియేమియు తాతయ్య నోటివెంటరా లేదు. సీతారాముఁడు చెప్పినది నిజము కాకపోవచ్చునను నాశ కొంచె ముండెను కాఁబోలు తాతయ్య మనస్సున, కాని స్పష్టముగ ప్రశ్నించినచో నిజము బయలుపడి-పోవునని భయపడుచుండె నేమో! ఆప్రశ్నకు విభ జబాబీయ వలెనని యతనికోరిక కాదు; అతఁ డతిభీతితో విభముఖము చూచుచు, "విభా!" అని మాత్రము ప్రశ్నించుచుండెను; కనుకనే యతఁ డేకాగ్రచిత్తముతో విభముఖమును జూచు-చుండెను. విభ అది యెఱుఁగును. కనుకనే తాతయ్యప్రశ్న

కుత్తరమీయలేకపోయినది. తాతయ్యను జూచినతోడనే యామెలోఁబుట్టిన యానంద మంతలో మాయమైనది; పూర్వము తాతయ్య అచ్చటికివచ్చు రోజు లామెకు జ్ఞప్తికివచ్చినది. ఆహా, ఎట్టియానంద మప్పటిది ! ఉత్సవమువలె నుండెను. తాతయ్య ఎప్పుడువచ్చినను సురమ వేళాకోళము చేయుచుండును, విభ నవ్వుచు దగ్గఱకూర్చుండును, అన్నయ్య శాంతస్వరూపుఁడై తాతయ్యపాట విని యానందించుచు ప్రక్కను కూర్చుండును. నేఁడు తాతయ్య వచ్చియున్నాఁడు, కాని తాతయ్య యొద్ద కెవ్వరును రాకున్నారు; ఆ యంధకారప్రపంచమున నుండు విభయొక్కతెమాత్రము వచ్చినది తాతయ్యదగ్గఱకు; ఆ సుఖముతోనుండియున్న ప్రపంచము ముక్కలై పోఁగా మిగిలినది ఈ విభయొక్కతే కదా! తాతయ్య వచ్చినతోడనే యానందధ్వనులతో నిండియుండు నా సురమ గది నేఁడిట్లున్న దేమి! అంధకారమయము. ఆ గదిలో నెట్టిశబ్దమును లేదు, అంతయు శూన్యము. తాతయ్యను జూచినతోడనే ఆ గది యేడ్వనారంభించునా యని తోఁచినది. ఎట్టి తృప్తి నాశించియో తెలియదుగాని, వసంతరాయ లొకమా రా గదిదగ్గఱకుఁ బోయెను, కొంచెమునే పచ్చట నిలిచియుండి తొంగి నాలుగువైపుల నొకమారు చూచెను; తత్క్షణమే మరల వెనుకకుతిరిగి గుండెలు బద్దలగునట్లు, "విభా, ఈ గదిలో నెవ్వరును లేరా?" అనెను.

విభ యేడ్చుచు, "ఎవరును లేరు తాతయ్యా," అని యనినది.

వసంతరాయ లేమియు పలుకక చాలసేపూరక నిలిచి యుండి విభ చేయి పట్టుకొని మెల్ల మెల్లగఁ బాడుకొనెను— మిగిలినది తానొక్కఁడే యను భావమును తెలుపు నాపాట ఎంత దుఃఖకరమైనది !

వసంతరాయలు ప్రతాపాదిత్యునియొద్దకుఁబోయి యిట్లు వేఁడుకొనసాగెను—"బాబూ ప్రతాప్, ఉదయుని మీరేల కష్టపెట్టుచున్నారు, వాఁడు మీ కేమి చేసినాఁడు? మీకంటికి వాఁడు మాటిమాటికి నపరాధియగుచు, వానియెడల మీ కనిష్టముగనున్నచో వాని నీ ముసలివానిచేతి కిచ్చివేయుఁడు. నేను తీసికొని వెళ్లిపోయెద. నాదగ్గఱనే యుంచుకొని, మీకు మఱి కనఁబడకుండఁ జేసెదను."

ప్రతాపుఁ డోర్పుతో వసంతరాయలు చెప్పినదంతయు విని తుద కిట్లనెను—"బాబయ్యగారూ, నేను చేసిన దేదో బాగుగ యోచించియే చేసితిని, ఈవిషయమున నే నెఱుఁగు నంత మీ రెఱుఁగకపోయినను నా కుపదేశించుటకు వచ్చి యున్నారు; నీ కోరికను నేను నెరవేర్చలేను."

వసంతరాయలు ప్రతాపాదిత్యునికి దగ్గఱగవచ్చి అతని చేయిపట్టుకొని యిట్లనెను—"నీకు జ్ఞప్తిలేదా ప్రతాప్, చిన్నప్పుడు నిన్ను నాయొడిలో నుంచుకొని పెంచి పెద్దవానిని జేసినాను! అన్నయ్య నిన్ను నాచేతి కప్పఁజెప్పి మృతినొందిన నాఁటినుండి నిన్నొకనాఁడైనను కష్టపెట్టితినా ? కేవల మసహా-యుఁడవై నీవు నాచేతిలో నుండియున్నప్పుడు తండ్రి లేనివాని

వని నీ కొక్కనాఁటికైనను తోఁచినదా? నే నెట్టియపరాధము చేసితినో చెప్పుము ప్రతాప్, న న్నీ వృద్ధవయస్సున నిట్లు కష్ట-పెట్టుచుండుటకు; నేను నిన్ను పెంచి పెద్దవానిని చేసితినిగనుక నా ఋణము తీర్పుమనికాదు నేను చెప్పునది—నిన్ను పెద్ద వానినిఁ జేయుట మాయన్నప్రేమఋణమును నేను తీర్పఁబ్రయత్నించుట. నిన్ను బాకీతీర్పుమని నే నడుగలేదు, ఎన్నఁడును అడుగను. నేను చేయునది, నిన్ను ప్రార్థించి యడుగుకొనుట మాత్రమే నా ప్రార్థన సఫలము చేయవా?"

వసంతరాయలు కనుల నీరు పెట్టుకొనెను. ప్రతాపుఁడు రాతివిగ్రహమై కూర్చుండెను.

కొంతసే పూరకుండి వసంతరాయలు తిరిగి ప్రారంభించెను—"నామాట వినవా ప్రతాప్? నా ప్రార్థన అంగీకరింపవా? నే నడుగుదానికి ఉత్తరమీయవా?" మఱికొంతసే పూరకుండి పెద్ద నిట్టూర్పు విడిచి, "సరియే, నాది మఱియొక చిన్నకోరిక యున్నది, అదియైనను నేరవేర్పుము—ఉదయు నొకమాఱు చూడవలెనని యున్నది, న న్నెవ్వరును అడ్డుపెట్టకుండున ట్లాజ్ఞాపింపుము."

ప్రతాపుఁడు దానికైనను ఒప్పుకొనలేదు. తనయిచ్ఛకు విరుద్ధముగ నుదయాదిత్యునియెడల ననురాగము వసంతరాయలు చూపించుట ప్రతాపునకు రుచింపలేదు. లోకులు తన పైన మోపుచుండు నపరాధ మధికమగుచున్నకొలఁది, ప్రతాపుని ప్రవర్తన వంకర యగుచుండెను.

వసంతరాయ లంతఃపురములోనికి మరల పోయెను, అతనిముఖము వాడిపోయినది, ఆ ముఖముచూచి విభకు అపరిమితదుఃఖము కల్గినది. విభ వసంతరాయలనుచేయిపట్టుకొని, "తాతయ్యా నా గదిలోనికి రమ్ము," అనెను. తాతయ్య విభతోఁ గలసి గదిలోనికి మెల్లమెల్లగఁ బోయెను.

ఆ సమయమున దాసి యొకతెవచ్చి, "మహారాణి మిమ్మును దయచేయుమనుచున్నారు మహాప్రభూ," అని చెప్పెను.

వసంతరాయలు రాణిగదిలోనికి వెళ్లెను.

రాణి వసంతరాయలకు ప్రణామముచేసినది; "ఆయుష్మతీభవ," అని వసంతరాయ లాశీర్వదించెను.

రాణి, "అట్టి యాశీర్వాదము మఱి యెన్నఁడును చేయకుఁడు మామయ్యా, నా కిప్పుడు చావే బ్రతుకగును," అనెను.

వసంతరాయలు—"నారాయణ నారాయణ! అటువంటి మాట నోట రానీయకూడదు."

రాణి—"మరి యేమను మనెదరు, మామయ్యా! నాకు శనిపట్టినది నా సంసారమునకు శనిపట్టినది."

వసంతరాయలకు మిక్కిలి బాధకలిగినది.

రాణి—"విభమాట తలఁచిన నా నోటికి అన్నము వెళ్లకున్నది. అడిగినయెడల నేమియు చెప్పదు, దినదినము

కృశించిపోవుచున్నది. ఏమిచేయవలెనో నాకేమియు తోఁచకున్నది.

వసంతరాయలమనస్సు కొట్టుకొనిపోవుచుండెను, "చూడుఁడు మామయ్యా కొంపముంచు జా బొకటి వచ్చినది," అనుచు అతనిచేత పత్ర మొకటి పెట్టెను.

వసంతరాయ లా పత్రము చదివియుఁ జదువకముందే రాణి యేడ్చుచు మొదలుపెట్టినది—"దేనిని జూచి నన్ను సుఖపడుమందురు చెప్పుఁడు. నాబిడ్డఁ డుదయుఁడేమియు నెఱుఁగఁడు, అట్టివానిని మహారాజుగారు—వానిలో రాజలక్షణము లేమియు లేవట, ఐనను వానిని గర్భమున ధరించితిని, వాఁడు నా బిడ్డఁడే కదా. పాప మాబిడ్డ డేమిచేయుచుండునోకదా, వాని నొకసారి చూచుటకైనను నాకు సెలవీయరు." కొన్ని దినములనుండి రాణి యేమాట యెత్తినను వానిలోని యుదయునిమాట వచ్చిదూరుచున్నది. ఆ దుఃఖము రాత్రిగాని పగలుగాని ఆమెను వదలకున్నది.

జాబుచదివి వసంతరాయలు నిశ్చేష్టుఁడయ్యెను, ఏమియు మాటలాడలేక యక్కడనే చతికిలఁబడి చేతులతో తల తడవుకొన నారంభించెను. కొంతసేపయినతరువాత, "ఈజా బెవ్వరికిని చూపలేదు గదా?" అని రాణి నడిగెను.

రాణి "ఈజాబుమాట తెలిసినయెడల మహారాజుగారు నిలువనిత్తురా? విభ కీసంగతి తెలిసినయెడల ఆమెప్రాణములు నిలుచునా?"

వసంతరాయలు— "మంచిపని చేసితి వమ్మా! ఈజాబిక నెవ్వరికిని కనబఱచకు మమ్మా. విభను త్వరలో న త్తవారి యింటికి పంపు నేర్పాటు చేయుము, మానావమానములసంగతి యాలోచింపకుము."

రాణి—"నేనును ఆలాగుననే అనుకొంటిని, మర్యాద యాలోచించుట కిది కాదు సమయము. నాబిడ్డ సుఖముగ నున్న నదియే నాకు చాలును. కాని అక్కడకుఁ బోయినతరు వాత వారు విభను కష్టపెట్టెదరేమో యని నాకు భయముగ నున్నది.

వసంతరాయలు—"విభను కష్టపెట్టెదరా ? ఎవరైన నామెను కష్టపెట్టఁగలరా! ఆమెహృదయమున నుండునది ఎక్కడకుఁబోయిన నక్కడనే ఆదరము పొందును. అట్టి మహాలక్ష్మి, బంగారుబొమ్మ, మఱియెక్కడనైన గలదా! అల్లుఁడు మీామీాఁద కోపగించి వ్రాసినజాబది. మీారామెను నచ్చటికి పంపఁగానే ఆ కోపము చల్లారిపోవును." వసంతరాయల సరళ హృదయమునకు బోధపడిన దిదియే, రాణికికూడ నట్లే తోఁచినది.

"విభను బంపుమని కోరుచు నల్లుఁడు జాబు వ్రాసెనని ఇంటిలో నలుగురికి తెలియఁజేయుము; అట్లైన వెళ్లుటకు విభ కెట్టి సంకోచము నుండదు," అని వసంతరాయలు రాణికి సలహా యిచ్చెను.

## ఇరువది తొమ్మిదవ పరిచ్ఛేదము

సాయంకాలమైనది, ముందింట వసంతరాయ లొంటరిగా గూర్చుండియుండెను, సీతారాముఁడు వచ్చి ఆయనకు దండము పెట్టెను.

"ఏమి సీతారామ్, ఏమిసంగతి?"

"అదియంతయుఁ దరువాత చెప్పెదను, మొదట మీరు నాతో రండు."

"ఎక్కడికి సీతారామ్? ఏల?"

దగ్గఱకు వచ్చి సీతారాముఁడు వసంతరాయల చెవిలో నేమో చెప్పెను. వసంతరాయలు కనులు పెద్దవిచేయుచు, "నిజమే!" అనుచు నాశ్చర్యపడుచుండెను.

"అవును మహాప్రభూ!" అనెను సీతారాముఁడు.

వసంతరాయలు లోలోపున ఆందోళనపడుచు, "ఇప్పుడే రావలెనా?" అని యడిగెను.

"చిత్తము మహాప్రభూ!"

"ఒక్కమాఱు విభను జూచి రావచ్చునా?"

"మఱి వ్యవధి లేదు, మహారాజా!"

"ఎక్కడికి పోవలెను?"

"నాతో రండు, నేను తీసికొనిపోయెద."

వసంతరాయలు లేచి నిలుచుండి, "ఒక్కమాఱు విభను, చూచివచ్చిన నేమి?" అని యడిగెను.

"వద్దు మహారాజా, ఆలస్యమైనచో కోపమునుఁ గును," అని సీతారాముఁ డనెను.

"అట్లైన వెళ్లను," ఇద్దఱునుకలసి బయలుదేఱిరి; నాలు గడుగులువేసిన తరువాత, "ఒక్కనిమిషమాలస్యమైన ప్రమాద మేమున్నది?" అని మరల వసంతరాయ లడిగెను.

"ఆలస్యమైన నాపద సంభవింపవచ్చును మహారాజా," అనెను సీతారాముఁడు.

దుర్గానామస్మరణము చేయుచు వసంతరాయలు రాజ ప్రాసాదమును విడిచి బయటికి వచ్చెను.

వసంతరాయలు వచ్చిన ట్లుదయాదిత్యుఁ డెఱుఁగనే యెఱుఁగఁడు. ఆయన వచ్చినట్లు విభ అన్నతోఁ జెప్పలేదు. తాతయ్యకు అన్ననుజూచుటకు సెలవుదొరకదని విభ యెఱుఁ-గును, అట్టి యవస్థలో తాతయ్యవచ్చిన ట్లన్నయ్యకుఁ దెలియఁ జేయుట అన్నదుఃఖమును వృద్ధిఁజేయుట యని విభ తలఁచినది.

చీఁకటిపడినతరువాత విభ అన్నయ్యయొద్ద సెలవుపుచ్చు-కొని కారాగారము విడిచి బయటికి వెళ్లినది. దీపము దగ్గఱ పెట్టుకొని ఉదయాదిత్యుఁడు సంస్కృతగ్రంథ మొకటి చదువు-చుండెను. కిటికీలోనుండి వచ్చుచుండిన గాలివలన దీపము కదలు-చుండెను, అక్షరములు బాగుగఁ గనఁబడకుండెను. పురుగులు వచ్చి దీపములోఁ బడుచుండెను, దీపము ఘుప్పుఘుప్పున మండి

ఆరిపోఁబోవుచుండెను; ఇంతలో నొకవిసురు గాలి వచ్చి దీపమారిపోయినది. ఉదయాదిత్యుఁడు పుస్తకముమూసి లేచి మంచముపై కూర్చుండెను, ఒక్కొక్కటిగ నెన్నియో సంగతులతనికి జ్ఞప్తికివచ్చుచుండెను. విభమాట యనుకొన నారంభించెను. నేఁడు విభ కొంచె మాలస్యముగ వచ్చినది; మామూలుకంటె కొంచెము త్వరగా వెళ్లిపోయినది. నేఁడామెముఖము ప్రతిదినమునకంటె వాడియున్నది. ఆ మాటయే ఉదయుఁడు తనలో తా ననుకొనుచుండెను. ఈ లోకములో నతనికి విభతప్ప మఱియెవ్వరును లేరని తోఁచినది. రోజంతయు విభతప్ప మఱియెవ్వరు నతనికిఁ గానరారు, అతఁడు యోచించుచుండఁదగినది విభయొక్కతే, అతఁడు యోచించుచుండవలసినది విభయొక్కతే! విభయాడు ప్రతిచిన్నమాట, ఆమె ప్రతిచిన్న నవ్వు ఉదయుఁడు తనహృదయమున దాచియుంచును, దప్పికగొనినవాఁడు తనకుదొరకిన పానీయమున నొక్కబిందువునైనను ననుభవింపక విడిచిపెట్టఁడు, అట్లే చెల్లెలి ప్రీతిని తెలియఁజేయుచుండు ప్రతిచిన్న వస్తువును ఉదయుఁడు మనసార అనుభవించుచుండెను. కనుకనే నేఁడీ చిన్న చీఁకటి గదిలో నొంటరిగఁ గూర్చుండి ప్రేమమూర్తియగు నావిభను గుఱించియే యోచించుచుండెను. "ఆమెముఖము మాడి యున్నది." ఆ యంధకారమధ్యమునుండి ఒకమాఱు ఱెట్లను కొనెను—"విభకు క్రమక్రమముగ విసుగుపుట్టుచున్నదేమో! దుఃఖించుచు నొంటరిగ చీఁకటిగదిలో బసచేసికొనియున్న నన్ను

సేవచేయుచు కాలముగడుపుచుండుట కష్టముగ నున్నదేమో! నే నామెసుఖమున కంతకంతకు అడ్డుపడుచున్నా నని యను కొనునా? నేనామె సంసారపథమున కడ్డగఁబడియున్న ముండ్ల కంపనని యనుకొనునా? నేఁడు ఆలస్యముచేసి వచ్చినది, రే పింతకంటె నాలస్యముగవచ్చునేమో! మఱికొన్ని దినము లైనతరువాత—రోజంతయు నేను కనిపెట్టుకొని యుందును, మధ్యాహ్న మగును, సాయంకాలమగును, రాత్రిపడును— ఐనను విభ రాదు. ఆమరునాఁటినుండి అసలే రాదేమో!" ఇట్లు అతని మనస్సునకు దట్టుచున్నకొలఁది లోపున దుఃఖ మధికమగుచుండెను. శూన్యమగు ప్రపంచమున తానొక్కఁడే యుండునట్లు ఉదయుఁడు భవిష్యత్తు నూహించుకొనుచుండెను. తనసుఖమును నాశనముచేసిన అన్నను విభ యనురాగములేని నేత్రములతోఁ జూచుదినముగూడ రావచ్చునని అతని యూహకుఁ దట్టినది, తట్టినంతమాత్రాన నతని హృదయము వ్యాకులపడుచున్నది. "నే నెంత స్వార్థపరుఁడను? ఆమెయెడల నా కనురాగమున్నది గదా యని నే నామె కెంతయుపకారము చేసితిని! పరమశత్రువైనను నామె కట్టి యుపకారము చేయు లేఁడు!" అని యుదయునకుఁ దోఁచుచుండెను. "ఇఁక నేను విభ మీఁద భారమంతయు మోపియుండను," అని మాటిమాటికి శపథముచేయుచుండును. కాని విభ తన్ను వదలిపోయినట్లు యూహించుకొనినంతమాత్రమున నతనిబలము సన్నగిలు చుండును. నడుసముద్రమున కొట్టుకొనుచు మునిఁగి

సిద్ధముగా నున్నవానివలె, విభ న్నూహించుకొని యామెను గట్టిగాఁబట్టుకొని తనప్రాణములను గాపాడుకొనఁ బ్రయత్నించుచుండును.

ఉదయాదిత్యుఁడు తనలో దా నిట్టి యాందోళనపడుచుండుసమయమున, "అగ్గి—అగ్గి" అని బయటినుండి కేకలు వినఁబడినది. ఉదయునిగుండె కొట్టుకొన నారంభించినది. వందల కొలఁది గొంతు లొక్క సారిగ వినఁబడుచున్నవి. బాధతోను, భయముతోను లేచుచుండు నానావిధములైన కేకలును, పరు గెత్తుచుండు అడుగులచప్పుడును వినఁబడుచున్నవి. ప్రాసాదము-నకు సమీపమున నెక్కడనో నిప్పుపుట్టినదని ఉదయాదిత్యుఁడనుకొనును. బయటి గందరగోళ మిక్లే యున్నది, ఉదయుఁడు మనస్సులో కలతఁజెందుచున్నాఁడు, హాఠాత్తుగ ఖైదుగది తలుపు తెఱచి ఎవరో ఆ చీఁకటికొట్టులో ప్రవేశించిరి. ఉదయుఁడులికిపడి, "ఎవరది?" అని యనెను.

"నేను, సీతారామ్, మీరు బయటికి రండు మహారాజా!" అని జబాబు వినఁబడినది.

ఉదయుఁడు—"ఏల?" అని యడిగెను.

సీతారాముఁడు—"ఖైదునకు నిప్పంటుకొన్నది, మహా-రాజా, మీరు తక్షణము బయటికిరావలెను," అనుచు అమాంతముగ నెత్తుకొని పోబోవుచున్నట్లువలె నతనిని బయటికి తీసికొనిపోయెను.

చాలదినములైనతరువాత ఉదయుఁడు నేఁడు బయటి

ప్రపంచములోనికి వచ్చెను. మీాద నలుదిక్కులను ఆకాశము వ్యాపించియున్నది, గాలి అతనివక్షమును విరివిగఁ జేయుచున్నది. ముఖమున కడ్డుగ నలుదిక్కులనునుండు గోడలు వీడిపోయినవి. ఆ చీఁకటిరాత్రియందు, పైనుండి లెక్కలేనినక్షత్రములు చూచు చుండ, ఆ లేఁతగడ్డిపై నాబయలున నిలుచుండియున్న ఉదయాదిత్యునిహృదయమునఁ బట్టరానియానంద ముదయించినది. ఆనంద పరవశుఁడై కొంతసే పట్లూరకయుండి, సీతారాముని, "ఏమి చేయవలెను, ఎచ్చటకుఁ బోవలెను?" అని యడిగెను. అనేక దినము లాచిన్న గదిలో ఖైదీగానుండి హఠాత్తుగ నేఁ డా బయలులోనికి వచ్చుటవలన ఉదయాదిత్యుఁడు కేవలము శక్తిహీనుడయి, "ఏమి చేయవలెను, ఎచ్చటకుఁ బోవలెను?" అని సీతారాముని నడిగెను. "రండు నాతో రండు," అని సీతారాముఁ డనెను.

ఇవతల అగ్ని వ్యాపించుచున్నది. ఆ నాటి రెండవపూట పురజనులలో కొందఱు ప్రభువులతో నేదో మనవి చేసికొనవలె నని వచ్చి ప్రాసాదప్రాంగణమున నొక్కచోట చేరియున్నారు. ఇండ్లు కాలుచున్నవని మొదటికేకలు వీరినోట వచ్చినవే. పహారావాండ్రకుగాను కారాగారమున కంటి కట్టబడియుండిన యిండ్లవరుస యొకటియుండెను—వానిలోనే పహారావాండ్ర మంచములు, పీటలు, పాత్రసామాను, బట్టపాతలు మొదలగున వన్నియు నుండెను. "అగ్గి అగ్గి" అని కేకలు వినఁగానే అందరు నిటునటు పరుగెత్తి పాఱిపోయిరి.

చేతకానివారు, వీలులేనివారు కాళ్లుచేతులు కొట్టుకొనుచుండిరి. ఉదయాదిత్యుని ద్వారముదగ్గఱకూడ నిద్దఱు పహరావాండ్రుండిరి, నిజమే; కాని ఇక్కడ కఠినమైన పహరాకవసర ముండునది కాదు, కేవలము నియమపాలనకై మాత్ర మెవరో ఉండువారు. ఉదయాదిత్యుఁ డతిశాంతముగ నెల్లప్పుడు నొక్కచోటనే కూర్చుండువాఁడు, అతఁ డెన్నఁడైన పాఱిపోవునని గాని, పాఱిపోవలెననుకోరిక యతనిలో నుండునని గాని ఎవ్వరికిని దట్ట లేదు. కనుక నతని ద్వారమునొద్ద నుండువారు, అందఱికంటె ముందగనే కమగెత్తిపోయిరి. రాత్రియగుచున్నది, నిప్పింకను ఆరలేదు. కొందఱాయింట్లనుండి సామానులు తీసి బయట పెట్టుచుండిరి; మఱికొందఱు నీళ్లుతెచ్చి నిప్పార్పుచుండిరి; ఏమియుఁ జేయక చూచుచు సందడిమాత్ర మధికముచేయుచుండువారుకూడ లేకపోలేదు—నిప్పారినతరువాత శాబాష్ శాబాష్ అని అంగరికంటె మెప్పుపొందినది పేరే! అందఱును గడబిడపడుచున్న సమయమున స్త్రీ యొకతె ఆగుంపులోనికి వచ్చి ఏమోచెప్పఁబోవుచుండెను, కాని ఆ గందరగోళములో నామెమాటను వినువారెవరు? ఆమెను తిట్టువారు కొందఱు, ఆమె నటుత్రోసివేయువారు కొందఱు, ఇటుత్రోసివేయువారు కొందఱు; కాని యామెమాటను వినువారెవ్వరు లేకుండిరి. వినిన ఒకరిద్దరి నోటివెంబడి వచ్చిన మాట లివి:—"యువరాజా పాఱిపోయిన నాకేమి నష్టము—నీకుమాత్ర మేమి నష్టము? ఆ పూచీ దయాసింగునది, నాది కాదు—నాయిల్లు వదలుకొని

నన్ను రమ్మనుచున్నావా?" ఇట్లనుచు భటు లాగుంపులో మాయ మగుచుండిరి.

ఈరీతిని మాటిమాటికి ప్రతిహతయగుచు నాయాఁడుది ఉగ్రస్వరూపిణియై చివరకు తనచేతికి దొరకిన వాని నొక నిని గట్టిగాఁబట్టుకొని ఇట్లనపాగెను—"మీచుఃఖములు తగుల బెట్టా! మీకు కండ్లులేవా? రాజుగారి యన్నము తినుచుండి ఆమాత్రము జ్ఞాన మక్కరలేదా! రేపు రాజుగారితోఁ జెప్పి గోతిలో మోకాలిలోతు ముండ్లలో మిమ్ములను పాతిపెట్టించ నిదే మఱివదలను—యువరాజు పాఱిపోయినాఁడు."

"మంచిపని చేసినాఁడే! అయిన నీకేమైనదే?" అనుచు వాఁడామెను నాలుగుతిట్లుతిట్టి బాగుగ బుద్ధిచెప్పెను—ఇండ్లకు నిప్పుముట్టించినవాండ్రలో వీఁడొకఁడు. తిట్లుతిని ఆయాడుది భీషణాకృతి ధరించినది. క్రుద్ధవ్యాఘ్రి నేత్రములవలె నామె కనులు మెఱయుచుండెను, జుట్టు పైకి పొడుచుకొని వచ్చు చుండెను. పటపట పండ్లు కొఱుకుచునున్న ఆమెముఖముపై నాయగ్నిజ్వాలలకాంతి పడి ఆమె కొకపిశాచిరూపము వచ్చినది. మండుచు నెదుటనుండు కొఱకంచు నొకదానిని చేతఁబుచ్చు కొనినది ఆ పిశాచి—చేయికాలుచున్నను దానిని బాఱవేయక తన్ను తిట్టినవానివెంట పరుగెత్తినది; ఎంత ప్రయత్నించినను వానిని బట్టుకొనలేక, తుద కాకొఱకంచును వానివైపు విసరినది.

చేతకానివారు, వీలులేనివారు కాళ్లుచేతులు కొట్టుకొనుచుండిరి. ఉదయాదిత్యునిద్వారముదగ్గఱకూడ నిద్దఱు పహారావాండ్రుం-డిరి, నిజమే; కాని ఇక్కడ కఠినమైన పహారాకవసర ముండునది కాదు, కేవలము నియమపాలనకై మాత్ర మెవరో ఉండువారు. ఉదయాదిత్యుఁ డతిశాంతముగ నెల్లప్పుడు నొక్కచోటనే కూర్చుండువాఁడు, అతఁ డెన్నఁడైన పాఱిపోవుననిగాని, పాఱిపోవలెనను కోరిక యతనిలో నుండుననిగాని ఎవ్వరికిని దట్టలేదు. కనుక నతని ద్వారమునొద్ద నుండువారు, అందఱికంటె ముందుగనే పరుగెత్తిపోయిరి. రాత్రియగుచున్నది, నిప్పింకను ఆరలేదు. కొందఱాయిండ్లనుండి సామానులు తీసి బయట పెట్టుచుండిరి; మఱికొందఱు నీళ్లుతెచ్చి నిప్పార్పుచుండిరి; ఏమియుఁ జేయక చూచుచు సందడిమాత్ర మధికముచేయుచుండువారుకూడ లేకపోలేదు—నిప్పారినతరువాత శాబాష్ శాబాష్ అని అందరికంటె మెప్పుపొందినది వీరే! అందఱును గడబడపడుచున్న సమయమున స్త్రీ యొకతె ఆగుంపులోనికి వచ్చి ఏమోచెప్పఁబోవుచుండెను, కాని ఆ గందరగోళములో నామెమాటను వినువారెవరు? ఆమెను తిట్టువారు కొందఱు, ఆమె నటుత్రోసివేయువారు కొందఱు, ఇటుత్రోసివేయువారు కొందఱు; కాని యామెమాటను వినువారెవ్వరు లేకుండిరి. వినిన ఒకరిద్దరి నోటివెంబడి వచ్చిన మాట లివి:—"యువరాజు పాఱిపోయిన నాకేమినష్టము—నీకుమాత్ర మేమి నష్టము? ఆ పూచీ దయాసింగునది, నాది కాదు—నాయిల్లు వదలుకొని

నన్ను రమ్మనుచున్నావా?" ఇట్లనుచు భటులు లాగుంపులో మాయ మగుచుండిరి.

ఈరీతిని మాటిమాటికి ప్రతిహతయగుచు నాయాఁడుది ఉగ్రస్వరూపిణియై చివరకు తనచేతికి దొరకిన వాని నొక నిని గట్టిగాఁబట్టుకొని ఇట్లనపాగెను—"మీాకు ఖములు తగుల చెట్టా! మీాకు కండ్లులేవా? రాజుగారి యన్నము తినుచుండి ఆమాత్రము జ్ఞాన మక్కరలేదా! రేపు రాజుగారితోఁ జెప్పి గోతిలో మోకాలిలోతు ముండ్లలో మిమ్ములను పాతిపెట్టించ నిదే మఱివదలను—యువరాజు పాఱిపోయినాఁడు."

"మంచిపని చేసినాఁడే! అయిన నీకేమైనదే?" అనుచు వాఁడామెను నాలుగుతిట్లుతిట్టి బాగుగ బుద్ధిచెప్పెను—ఇండ్లకు నిప్పుముట్టించినవాండ్రలో వీఁడొకఁడు. తిట్లుతిని ఆయాడుది భీషణాకృతి ధరించినది. క్రుద్ధవ్యాఘ్రి నేత్రములవలె నామె కనులు మెఱయుచుండెను, జుట్టు పైకి పొడుచుకొని వచ్చు చుండెను. పటపట పండ్లు కొఱుకుచునున్న ఆమెముఖముపై నాయగ్నిజ్వాలలకాంతి పడి ఆమె కొకపిశాచిరూపము వచ్చినది. మండుచు నెదుటనుండు కొఱకంచు నొకదానిని చేతఁబుచ్చు కొనినది ఆ పిశాచి—చేయికాలుచున్నను దానిని బాఱవేయక తన్ను తిట్టినవానివెంట పరుగెత్తినది; ఎంత ప్రయత్నించినను వానిని బట్టుకొనలేక, తుద కాకొఱకంచును వానివైపు విసరినది.

## ముప్పదియవ పరిచ్ఛేదము

యువరాజును దోడ్కొని సీతారాముఁడు కాలువ యొడ్డునకు వచ్చెను. అక్కడ పెద్దపడవ యొకటి కట్టియుండెను. ఆ పడవయెదుటకు వచ్చి యిద్దఱును నిలుచుండియుండుట జూచి పడవలోనుండి యెవరో బయటికి వచ్చి, "వచ్చితివా తాతా!" అని యనెను. ఉదయాదిత్యుఁ డది వినఁగానే ఉలికి పడెను—చిన్నప్పటినుండి తాను వినుచుండిన కంఠ మిప్పు డతఁడు వినినది; అతని బాల్యస్మృతులతోను, యౌవనసుఖదుఃఖములతోను కలసియున్న కంఠస్వర మది; ప్రపంచములో నే రవంతసుఖము, ఆనందము అతనికి మిగిలియున్నవో వానితో నేకమైయున్న స్వరమది! అతఁడు ఖైదులోనుండురోజులలో రాత్రి వేళ నప్పుడప్పుడు నిద్రలేక కూర్చుండి యుండుసమయమున కలలో వినఁబడు వేణువువలె కంఠస్వర మొకటివిని యతఁ డులికిపడి లేచుచుండెను—ఇప్పు డుదయుఁడు వినినది ఆకంఠ మే! ఉదయునివిస్మయము పూర్తిగ పోకమునుపే వసంతరాయ లతని దగ్గఱకువచ్చి అతనిని కౌఁగిలించుకొనెను. ఇద్దఱికనులు నీళ్లతో నిండిపోయినవి, ఇద్దఱును నా పచ్చికపై నచ్చటనే కూర్చుండఁ బడిపోయిరి. చాలసే పైనతరువాత ఉదయాదిత్యుఁడు, "తాతయ్యా!" అనెను. "ఏమి తాతా?" అని వసంతరాయలు ప్రత్యుత్తరమిచ్చెను—మఱిమాటలు లేవు. మఱికొంతసేపైన

తరువాత ఉదయాదిత్యుఁడు కనులు పూర్తిగ విప్పి మొదట నాలుగువైపులను చూచెను, తరువాత ఆకాశమువంక కనుల నెత్తెను. తుదకు వసంతరాయలను చూచుచు, "తాతయ్యా, నాకు నేఁడు స్వేచ్ఛదొరికినది, నీవు దొరకితివి, నేను కోరఁదగిన దింకేమున్నది? ఈ యవస్థ యెంతసేపుండును తాతయ్యా?" అని యడిగెను.

మఱికొంచెముసేపైన తరువాత సీతారాముఁడు దగ్గఱకు వచ్చి, "పడవలోనికి రండు యువరాజా!" అనెను.

యువరాజు—"పడవలోని కేల?"

"ఇక్కడనుండినయెడల పహరావాండ్రు వత్తురు."
యువరాజాశ్చర్యపడుచు, వసంతరాయలను, "మనము పాఱి పోవుచున్నామా?" అని యడిగెను.

వసంతరాయ లుదయాదిత్యుని చేయిపట్టుకొని ప్రత్యు-త్తరమిచ్చెను: "ఔను, నాయనా, నేను నిన్ను దొంగిలించు కొని పోవుచున్నాను. ఈ దేశమునయుండువారు పాషాణహృద-యులు, నీయెడల ననురాగములేదు వారికి, ఇది వ్యర్థ రాజ్యము, అం దుండు హారిణశిశువువు నీవు. నిన్నుతీసికొని పోయి నాహృదయమధ్యమున దాచియుంచెదను, అచ్చటికి కెట్టియాపదయు రాదు." ఇట్లనుచు ఉదయుని ఈ దయావి విహీనమగు ప్రపంచమునుండి తీసికొని ప్రేమరాజ్యమునఁ గట్టి పెట్టియుంచఁగోరుచుండునట్లు వసంతరాయ లతనిని దగ్గఱగ లాగుకొని గట్టిగా పట్టుకొనెను.

ఉదయాదిత్యుఁడు చాలసే పాలోచించి, "తాతయ్యా, నేను పాఱిపోఁజాలను," అనెను.

వసంతరాయలు— "ఏమి తాతా! ఈ ముసలివానిని మఱచిపోతివా?"

ఉదయుఁడు—"నేను నాన్న దగ్గఱకు పోయి ఆయన పాదములపైఁబడి క్షమింప వేఁడుకొనెదను. నేను రాయగడకు పోవుటకు నాన్న అనుమతి నీయవచ్చును."

వసంతరాయలు భీతుఁడగుచు—"నామాట వినుము తాతా, అచ్చటకు పోవద్దు, నీప్రయత్నము నిష్ఫలమగును," అనెను.

"అట్లైన నన్ను ఖైదులోనికే మరల పోనిమ్ము," అని నిట్టూర్పువిడుచు న ననెను.

వసంతరాయలతనిచేతులు గట్టిగా బట్టుకొని, "ఎట్లు పోఁగలవో పొమ్ము చూతము, నేను నిన్ను విడువను,"అనెను.

ఉదయాదిత్యుఁడు—"ఈ యభాగ్యుని దగ్గఱనుంచుకొనిన నాపదను పిలిచి తెచ్చుకొనుటయే తాతయ్యా! నే నుండుచోట ఒక యణుమాత్రమైనను శాంతియుండనేరదు."

వసంతరాయలు—"నీవలన విభకూడ కారావాసిని యై పోయినది తాతా. ఇంత చిన్నవయస్సుననే యామె ముఖమునకు నీళ్ల ధారయా? అట్లగుచుండుట చూచి నీ వూరకుండఁగలవా?"—ఇట్లనుచుండు వసంతరాయల నేత్రములనుండి అశ్రుధారలు పడుచుండెను.

"ఔను తాతయ్యా, నీ వనునది నిజమే! పోదము పద అన్నా," అని తొందరతొందరగ ఉదయుఁ డనెను. తరువాత సీతారామునివైపు చూచి, "కోటలోనికి మూఁడుజాబులు పంపవలసియున్నది," అనెను.

సీతారాముఁడు—"పడవలోనే కలము సిరా యున్నవి, తెచ్చియిచ్చెదను త్వరగా వ్రాయుము యువరాజా, వ్యవధి లే దంతగా."

క్షమింపుమని వేఁడుకొనుచు ఉదయుఁడు తండ్రి కొక జాబువ్రాసెను.

తల్లి కిట్లు వ్రాసెను—"అమ్మా, నన్ను కని నీ వెన్నఁడును సుఖింపలేదు. కాని ఇఁక నీవు నిశ్చింతగ నుండవచ్చును. నేను తాతయ్యయొద్దకు పోవుచున్నాను. అచ్చట నేను సదా సుఖముగా నుందును, ఎల్లప్పుడు ననురాగమున మునిఁగి యుందును, నీ కెట్టిదుఃఖమును నుండగూడ దిఁక."

విభకు:—

"చిరాయుష్మతీ భవ,—నీ కేమివ్రాయఁగలనమ్మా చెల్లీ, జన్మజన్మముల నీవు సుఖించుచు నుండుము. అత్తవారింటికి వెళ్లి సుఖముగ కాఁపురముచేయుచు, నీ సమస్తదుఃఖములను సకలకష్టములను మఱచిపొమ్ము!"—వ్రాయుచుండ ఉదయుని కనులు నీళ్లతో నిండెను.

ఈ మూఁడుజాబులను సీతారాముఁ డొకపడవవాని చేతి

కిచ్చి కోటలోనికిఁ బంపెను. అందఱును పడవనెక్కిరి—ఆ సమయమున నెవతెయో ఆ పడవవైపునకు పరుగెత్తుకొని వచ్చుచుండుట అందఱును కనిపెట్టిరి. ఆమెను జూచి సీతారాముఁ డులికిపడి, "ఇదిగో మాయలాడి, మందులమారి, ఆ పిశాచివలె నున్నదే!" అనెను. అంతకంతకు దగ్గఱపడుచుండిన యావిగ్రహము రుక్మిణియే! ఆమెజుట్టు విరియఁబోసి యున్నది, పైట జారిపోవుచున్నది, కనులు అగ్ని కణములవలె నుండెను. మాటిమాటికి నామెవాంఛల కేదో అడ్డువచ్చుచుండుటచేతను, పగతీర్చుకొనవలెననుకోరిక ఆమెలో నెంత తీవ్రముగనున్నను అది సఫలము కాకపోవుటచేతను, లోపున పుట్టుచుండు బాధ ఆమెను ఇటునటు నూపివేయుచున్నది. ఎదుట నెవఁడు కనఁబడిన వానినే చీల్చి ముక్కలుగఁజేసి కోపము చల్లార్చుకొనఁగోరుచున్నట్లుండెను.

ఇండ్లు కాలుచుండుచోట చాల తిట్లును, పోట్లును తిని, రుక్మిణి వెఱ్ఱెత్తినదానివలె కోపముతో కోటవైపునకు పరుగెత్తిపోయెను. తిన్నగ ప్రతాపాదిత్యుని గదిలోనికి వెళ్లవలెనని అనేకప్రయత్నములు చేసినది, కాని సాధింపలేకపోయినది; పహారావాండ్రీమె వెఱ్ఱిదనిభావించి కొట్టి వెంటఁబెట్టిరి. అప్పుడామెబాధ భరింపలేక కోటనుండి పరుగెత్తుకొనివచ్చినది. వ్యాఘ్రివలె నుదయునిపై నురుకవలెనని ప్రయత్నించుచుండ సీతారాముఁ డడ్డుపడెను. రుక్మిణి యా సీతారామునిపైఁబడి రెండుచేతులతో వానిని గట్టిగాఁ బట్టుకొనెను. సీతా

రాముని కేకలు విని పడవవాండ్రు పరుగెత్తుకొని వచ్చి వానిని విడిపించిరి. ఆత్మఘాతిరియైన వృశ్చికము సర్వాంగములను తన తోఁకతోఁ కొట్టుకొనుచుండునట్లు, రుక్మిణి తనగుండెను గోళ్లతో గీరుకొనుచు, జుట్టును పీకుకొనుచు, "ఏమియు చేయలేకపోతిని, ఏమియు కాలేదు—నేను ప్రాణత్యాగము చేయుచున్నా నిదిగో! ఈ స్త్రీహత్యాపాతకము మీఁదే!" అని కేకలు వేసెను. ఈ శాప మాయంధకారమున నలుదిక్కులను ప్రతిధ్వనించినది. ఇట్లు శపించుచు తత్క్షణమే ఆ నీటిలో కుఱికిపడెను. పడి వర్షకాల-మున నిండుగా పారుచుండు కాలువలో యడుగున మునిగి-పోయియుండవలెను. సీతారాముని భుజమునుండి రక్తము కారుచుండెను. బట్ట నీటిలో ముంచి అతఁడా గాయమును కట్టెను. ఉదయాదిత్యునిముఖము చెమటతో నిండినది. అతనికి కాళ్లు చేతులు చల్లఁబడిపోయి, మతితప్పిన ట్లయ్యెను. వసంతరాయలుగూడ దారితప్పినవానివలె నిశ్చేష్టుఁడై నిలుచుండియుండెను. పడవవాండ్రిద్దఱు వారిద్దఱిని నెత్తుకొని-పోయి పడవపై నెక్కించి పడవను తత్క్షణమే విడిచిపెట్టిరి. సీతారాముని మనస్సున భయముపుట్టి, "బయలుదేరుసమయమున నెట్టి యమంగళము జరిగినది!" అని తనలో తా ననుకొనుచుండెను.

## ముప్పదియొకటవ పరిచ్ఛేదము

ఉదయాదిత్యునిపడవ కాలువదాటి నదిని జేరఁగానే సీతారాముఁడు యువరాజునొద్ద సెలవుపుచ్చుకొని పడవ విడిచి మరల నగరమున కేగెను. వచ్చినప్పుడు యువరాజు నడిగి అతని కత్తిని పుచ్చుకొనెను.

ఉదయుఁడు వ్రాసిన మూఁడుజాబులును సీతారాముఁ డొకనిచేతికిచ్చి ప్రాసాదమునకుఁ బంపుట నిజమే, కాని ఆజాబు లెవ్వరికిని నీయవద్దని వానితో రహస్యముగా నొక్కి నొక్కి చెప్పెను. పడవనుండి వచ్చి సీతారాముఁ డాయుత్తరములను మరల వానియొద్దనుండి తీసికొని, రాణియుత్తరమును, విభ యుత్తరమునుమాత్ర ముంచి మూఁడవయుత్తరము చించి పారవైచెను.

నిప్పు మఱింత వ్యాపించినది. వింత చూచుటకు నిద్ర మాని యనేకులు వచ్చి చుట్టును చేరియున్నారు. దానివలన మంటలార్పుట మఱింత కష్టమగుచున్నది.

ఈ యగ్నికాండలో సీతారామునికిఁ గూడ నొకవం తుండెనని చెప్పుట యనవసరము. ఉదయాదిత్యుని యెడల ననురాగముగల పురజనులుకొందఱు ప్రాసాదభృత్యులు కొందఱితోఁ గలసి జేసినపని యిది. అయిదారిండ్లు సాయంకాలమప్పు డొక్కమాఱంటుకొనుట దైవికముగా జరిగినపని కాజాలదు.

అదేవిధముగ, ఇంతసేపార్పుచున్నను నిప్పారకుండుటకును కారణము లేకపోలేదు. నిప్పార్పుటకు బయలుదేరినగుంపు-లలో నిద్ధజేసి ముగ్గురేసివంతున సీతారాముని జట్టుగాం డ్రున్నారు. నిప్పులేనిచోట నీళ్లు వంపుచున్నారు, నీళ్లకు పోయినవారు మఱి రాకున్నారు, అతిచమత్కారముగా కుండలు విరుగుచున్నవి, వీఁడు వెళ్లి వానిమీఁదను వాఁడు వచ్చి వీని మీఁదను పడుచున్నారు, గొప్పగందరగోళము జరుగుచున్నది, నిప్పుమాత్రము ఆరకున్నది.

ఈవల ఈగందరగోళ మిట్లుండుసమయాన, సీతారాముని జట్టులోనివాండ్రు వచ్చి ఉదయాదిత్యుని శూన్యకారాగార - శాలకు నిప్పంటించిరి. క్రమక్రమముగా తలుపులకు, ద్వారమునకు, కిటికీకి, దూలములకు, కడ్డీలకు నిప్పు వ్యాపించినది. ఆయింటికి నిప్పంటుకొనఁగలదని యెవ్వఁగును కలలోనైన నను కొనలేదు, కనుక నెవ్వరిదృష్టియు నటువైపునకు పోలేదు. సీతారాముఁడు తిరిగి వచ్చునప్పటికి ఇండ్లన్నియు జ్వాలలమయమై కాలవలసినరీతిని గాలుచుండెను. ఏదో యొకశవమును, యొకతలను, గొన్ని యెముకలను సంపాదించి, సీతారాముఁడు వీనినియు దనతోఁ దెచ్చిన యుదయాదిత్యునికత్తియు నాకాలిదు గదిలోనికి విసరెను.

ఆవల ప్రహరీశాలకు నిప్పార్పుచుండువారికి హఠాత్తుగ కారాగారమువైపునుండి కేకలు వినఁబడినవి. ఉలికిపడి, "అది యేమి? అదియేమి?" అని యందఱును నొక్కమాఱుగ నరచిరి.

అటువైపుననుండి పరుగెత్తుకొనివచ్చినవాఁడెవఁడో ఖైదుగదికి నిప్పంటుకొనినదని చెప్పెను. పహారావాండ్ర రక్తము నీరై పోయినది, దయాల్‌సింగునకు తలతిరుగుట మొదలుపెట్టినది. అతని చేతిలోనున్నకుండ క్రిందపడి ముక్కముక్కలైనది. ఇంతలో నటువైపుననుండి మఱియొకఁడు వచ్చి, "యువరాజు గదిలోనుండి కేకలు వేయుచున్నాఁడు—వినఁబడుచున్నది," అనెను. వీనిమాటలు పూర్తికాకమునుపే సీతారాముఁడచ్చటకు పరుగెత్తుకొనివచ్చి, "ఓరీ, త్వరగా రండు, యువరాజు గదిపైనుండు డాబా విరిగి పడిపోయినది, కేకలువేసి పిలిచినను లోపలనుండి జబాబురాకున్నది," అని అన్నాఁడు. అందఱు నచ్చటకుఁ బరుగెత్తిరి. డాబా కూలి పడియున్నది, ఎటువైపు చూచినను మంటలు, లోనికి ప్రవేశించుమార్గము కానరాలేదు. ఇతరులపై నేరముమోపుచు అందఱును ఆమంటలచుట్టు నిలుచుండి, ఎవరియజాగ్రత్తవలన నిది సంభవించినదో నిర్ధారణ చేయుచు తగవులాడుచుండిరి. ఘోరమైన వివాదముజరగినది తిట్లతో ప్రారంభమై కొట్టుకొనుటవఱకు వచ్చినది.

ఇల్లంటుకొని, యువరాజు చనిపోయెనన్న వదంతిపుట్టించి కొంతకాలమువఱకైనను నిశ్చింతగా నుండవచ్చునని సీతారాముఁడు తలంచెను. నాలుగువైపులను నిప్పంటుకొని యిల్లు నిరాటంకముగా కాలుచుండుట చూచి సీతారాముఁడు మిగుల నానందించుచు తలకు కండువా యొకటి చుట్టుకొని తనయింటివైపు బయలుదేరి కోటనువదలి కొంతదూరము వచ్చెను. అప్ప-

టికి చాలరాత్రియైనది; దారిలో అతనికెవ్వరును గానరాలేదు; నలుదిక్కుల నిశ్శబ్దము; ఉండియుండి వెదురుపొదలను కదలించుచు దక్షిణవాయువు వీచుచున్నది. మనస్సున నుల్లాసము పుట్టి, సీతారాముఁడు కామరసముతోఁగూడిన పాటయొకటి మొదలుపెట్టెను. నిర్జనపథమున నొంటరిగా పాడుకొని పోవుచుండ ఆ పాంథుని మనస్సున కొక యూహ తట్టినది. "నేను యశోస్వరువిడిచి వెళ్లి పోకతీరదు, అట్లైన శ్రమపడకుండ దొరకునప్పుడు కొంత డబ్బేలసంగ్రహించుకొని పోఁగూడదు? మంగళ చచ్చినది, పాడుముండ—శని విరుగుడైనది! దాని యింటి కొకసారిపోయి చూచిన బాగుగనుండును, కావలసినంత డబ్బుండెను దానియొద్ద; మూఁడులోకములలో నొక్కఁడైనలేఁడు దానికిఁగావలసినవాఁడు, దానిరూపాయలు నేను తీసికొనిన తప్పేమి? నేను తీసికొననిచో నింకెవరైన తీసికొందురే!" ఈవిధముగ తనలో తాననుకొనుచు మంగళ కుటీరమువైపు తిరిగెను, ఉల్లాసముతో మనస్సు నాట్యమాడుచుండ మరల పాడనారంభించెను. ఆదారిని పోవుచున్న ప్రేయసి యెవరో యొకతె సీతారాముని కంటఁబడెను—సీతారామునకు తెలియకుండ నిట్టివి యెన్నఁడును జరుగనేరవుగదా! రసికత కనఁబఱచుచు నాలుగుమాటలాడవలెనని ఆపలేని కోరిక పుట్టినది సీతారామునకు; కాని యిప్పుడు వ్యవధిలేదని జ్ఞప్తి యుంచుకొని ఆవాంఛ నణఁచుకొనుచు త్వరత్వరగా వెళ్లిపోయెను.

సీతారాముఁడు రుక్మిణి కుటీరమునకుఁ బోయి చూచు-సరికి, తలుపు తెరచియుండెను. అతిసంతోషముతో వాఁడా కుటీరములో ప్రవేశించి యొకమాఱు నాల్గువైపులను జూచెను. ఘోరమైన యంధకారము, ఏమియు కానరాకుండెను, చేతులు చాచి తడవుకొనుచు లోనికిఁబోయెను. కాలికి పెట్టెయొకటి తగిలి వాఁడు నేలఁబడెను. గోడ వానితలకు తగిలినది. అతనికి మిగుల భయము కల్గినది, ఇంటిలో నెవరో యున్నట్లును, ఊపిరితీయుచుండుట వినఁబడుచున్నట్లును, తట్టినది; మెల్ల మెల్లఁగ ప్రక్కగదిలోనికిఁ బోయి చూచునప్పటికి రుక్మిణిపడక గదిలోనుండి వెలుతురు వచ్చుచుండెను.

దీప మిప్పటివఱకును వెలుగుచుండుట కనిపెట్టి, సీతా-రాముఁడు మిగుల సంతోషించుచు ఆగదివైపునకు వడివడిగాఁ బోయెను. ఎవ రది! ఎవ రా గదిలో! ఎవతే యొకస్త్రీయొక తె గజ గజ వణఁకుచుఁ బండ్లు పటపటకొరుకుచుఁ గూర్చుండియుండెను. కట్టుకొనియున్నది తడిబట్ట, అది సగము జారియున్నది. విప్పి యున్న జుట్టునుండి టుప్పుటుప్పున నీటిబొట్లు పడుచున్నవి. గదిలో చిన్నదీపము మాత్ర మొకటియుండెను. మిణుకుమిణుకు మనుచుండు నా దీపపుకాంతి తెల్లఁబారిపోయిన యాస్త్రీ ముఖముపైఁ బడుచుండెను. వెనుకను గోడపై పెద్దనీడ, కళలేక బూడిదవలెనుండు నా మెముఖమువైఖరి, ఆ నీడ, ఆ నిశ్శబ్ద-వీని యన్నిటివల్లను గదిలోఁ బ్రవేశించినతోడనే సీతారాముని దేహము చల్లబడిపోయినది. ఆ జుట్టు విరియఁబోసుకొని

తడిబట్టతోఁ గూర్చుండియున్నది మంగళవలె గనఁబడఁగానే అది యామె భూతమేమో యని సీతారామునకు భయము గలిగినది—ముందుకు వెళ్ల లేకపోయెను, ధైర్యము తెచ్చుకొని వెనుకకుఁ దిరిగిపోలేకుండెను. సీతారాముఁడు వట్టి పిరికివాఁడు కాఁడు, రెండునిమిషము లట్లు నిలుచుండి ధైర్యము నటించుచు, "నీవెక్కడనుండి వచ్చితివే, నీవు చావలేదా?" అని పరిహాసముచేయున ట్లామెను బ్రశ్నించెను. రుక్మిణి ముఖమెత్తి సీతారామునివైపు చూచినది; సీతారాముని ప్రాణము లెగిరి పోయినవి. రుక్మిణి యటు కొంచె మతనివైపు చూచి, "ఔను! మిమ్ములను నాశనము చేయనిదే నేను చచ్చెద ననుకొంటిరా!" అనుచు, లేచి చేతులు విసరుచు మరల ప్రారంభించినది, "నేను యమలోకమునుండి తిరిగివచ్చితిని; నిన్నును యువరాజును పొయ్యిలోఁబెట్టి బూడిదచేసి, ఆ బూడిదపూసికొని దేహము సార్థకముచేసికొని యమునికోరిక నెరవేర్చెదను.—అంతవఱకు యమలోకమున నాకు తావు దొరకదు.

రుక్మిణికంఠము విని సీతారామునకు ధైర్యమువచ్చినది. సీతారాముఁ డామెయెడల ననురాగము కనఁబఱచి స్నేహము చేసికొందమని ప్రయత్న మారంభించెను. మిక్కిలి దగ్గఱగఁ బోకపోయినను మొదటికంటె సమీపించి మృదుస్వరముతో నిట్లనెను—"నీ కేక్షణమున కేబుద్ధిపుట్టునో పోల్చుకొనుట నాతరముగాదు తల్లీ, అందుచేతనే నిన్నుఁ జూచిన నా కప్పుడప్పుడు కోపము వచ్చుచుండును. నాయెడల నీవింత

అప్రసన్నురాలవగుటకు నేనుజేసిన యపరాధమేమి? ఇది యంతయు నటనే నేనెఱుఁగుదును! నన్నాపాట పాడనిస్తువా?"

సీతారాముఁ డిట్లు వాత్సల్యము నటించుచున్నకొలఁది రుక్మిణికి కోప మధికమై యాపాదమస్తకము ఆమె దేహమున మంటపుట్టుచుండెను. సీతారాముఁడు మంగళ తలమీఁదనుండు జుట్టై యుండినకూడ నామె వానిని పీకి ముక్కలు చేసి యుండును, వాఁడు తన కనులై యుండినను చేతులతో పొడిచి పైకిలాగి నేలనువేసి కాళ్లతో నలిపివేసియుండును. ఇటునటు చూచినను మంగళచేతి కేమియు దొరకలేదు. పండ్లు పటపట కొఱుకుచు, "నీపీక యిప్పుడే కోయుచున్నాను, ఒక్క నిమిష మక్కడ నిలిచియుండుము," అనుచు మంగళ కత్తిపీటకై ప్రక్కగదిలోనికిఁ బోయెను. మంగళ యుద్దేశించుచున్నది నిజమైన వధయే యని కనిపెట్టి కత్తిపీటదెబ్బవలన నిప్పుడు చచ్చుటకు సిద్ధముగానుండనిసీతారాముఁడు, సందుదొరకుట కనిపెట్టి కుటీరమునుండి బయటికిఁ బారిపోయెను. రుక్మిణి కత్తిపీట తెచ్చునప్పటికి సీతారాముఁ డాగదిలో లేఁడు; వానికి కొట్ట వలసిన దెబ్బలన్నియు నామె నేలపై కొట్టినది.

రుక్మిణి యిప్పుడు చచ్చినదానితో సమానమే—యువ రాజు విషయమై ఆమెకుగల యాశ పూర్తిగాఁ బోయినది, ఆమెకోరిక ఆమెజిత్తులు—అన్నియుఁ బూర్తిగఁ మంటఁగలసి పోయినవి. మునుపటి తీవ్రముగు నవ్వు రుక్మిణిముఖాన మఱి లేదు, వజ్రవర్షమును గురిపించు చూపులుకూడ నందు లేవు,

మునుపు సదా కనఁబడుచుండు జాహ్నవీతరంగోచ్ఛ్వాసము-వంటి కలకల కూడ లేదు. రాజుగారికోటనుండి వచ్చుచున్న భృత్యులందఱితోఁ బోట్లాడి, తిట్టి నేడు వాంద్రను తోలి-వేయుచున్నది. దివాన్‌జీ జ్యేష్ఠపుత్రుఁడు తమలపాకులు నమ-లుచు నేఁడామెతో కొంతరసికత జరుపవచ్చెను; వానికి నేఁడు రుక్మిణిచీపురుకట్టయే ప్రాప్తియయ్యెను! అందఱకును మిగుల భయమైనది, ఆ యూరివాం డ్రెవ్వరును రుక్మిణికడకు రాఁజాల కుండిరి.

ఆ కుటీరమునుండి బయటికివచ్చి సీతారాముఁడాలో-చింప మొదలుపెట్టెను. "యువరాజు పాఱిపోయెనను సంగతి కుంగళ యెఱుఁగును, ఆమెవలన నంతయు బయలుపడును, ఆ పిశాచిముండను పీకనులిపి యేల చంపనైతిని!" అని విచా-రించసాగెను. "ఏదెట్లున్నను, యశోరనునుండుట నాకిఁక శ్రేయస్కరము కాదు, నే నీక్షణమే పాఱిపోవలెను," అను కొనెను. సీతారాముఁడు సపరివారముగ నా రాత్రియే యశోగు విడిచి రాయగడకుఁ బాఱిపోయెను.

రాత్రి అంత్యభాగమున మేఘము క్రమ్మి వర్షము ప్రారంభమైనది, నిప్పారిపోయినది. యువరాజు చనిపోయెనను వదంతి ప్రతాపా ని చెవినిగూడఁ బడ్డది. రాజుగారీమాట వినఁగానే సభాగృహమునకు వచ్చి కూర్చుండి, పహారావాం-డ్రను బిలిపించిరి. మంత్రియు మరియిద్దరుముగ్గురు సభాసదు-లునుగూడ వచ్చిరి. అతిభయంకరముగ నిల్లు కాలుచుండు సమ-

యాన యువరాజు కిటికీలోనుండి కనఁబడెనని యొకఁడు సాక్ష్య మిచ్చెను, యువరాజు కేకలు తాము వినినట్లు కొందఱు సాక్ష్య మిచ్చిరి. మంటలలో కాలి దొరకిన యువరాజు కత్తిని దీసికొని వచ్చి రాజునెదుట బెట్టెను మరియొకఁడు. పినతండ్రి యెక్కడ నని ప్రతాపాదిత్యుఁ డడిగెను—ఇల్లంతయు వెదకిరిగాని వసంతరాయలు కానరాలేదు.

ఇల్లు కాలుచుండుసమయాన అతఁడుకూడ యువరాజుతో కైదుగదిలో కనబడెనని ఎవఁడో యనెను. "లేదు, లేదు, ఇల్లుకాలి, యువరాజు మృతినొందెనని తెలియఁగానే ఆ రా-త్రియే యశ్శోరు విడిచి వెళ్లిపోయెను," అని మరియొకఁడు చెప్పెను. ఈ నానావిధములగు సాక్ష్యములు వినుచు ప్రతా-పాదిత్యుఁడు సభాగృహమందుఁ గూర్చుండియుండ, ద్వారము కడఁ గోలాహల మొకటి లేచినది. స్త్రీయొకతె రాజసభాగృహము లోనికి రాఁబోవుచుండ ద్వారపాలకు లామెను రానీయకున్నా రఁట. అది వినినతోడనే యామెను లోనికి వదలుఁడని రాజు గారి యాజ్ఞయైనది. భృత్యుఁ డొకఁడు రుక్మిణిని దీసికొని లోనికి వచ్చెను. "నీ కేమి కావలెను," అని రాజుగా రడిగిరి.

రుక్మిణి చేతులు విసరుచు బిగ్గరగ నిట్లనెను—"నాకు కావలసినది మరియేమియు లేదు—మీా పహరావాండ్రందఱను ఆరేసిమాసములు కైదులో కుళ్లబెట్టి, చివరకు ఊరికుక్కలచే వాండ్రను తినిపింపుఁడు మహారాజా; ఇది కనులార చూడనిదే

నాకు తృప్తికలుగదు! వీండ్రకుఁ మహారాజావారియెడల భయ భక్తులున్నవని ఎన్నటికిని నమ్మకుఁడు."

ఈమాటలు వినినతోడనే అచ్చటినుండు భృత్యులందఱును కేకలువేయ నారంభించిరి, రుక్మిణి వెనుకకుఁదిరిగి కనులు పెద్దవిచేయుచు నిటునటు త్రిప్పి, "నోళ్లుమూయుఁడు, మీరు ఘోరమైన మోసగాండ్రు," అనుచు వాండ్ర నదల్చినది. "నిన్న రాత్రి మీ కాళ్లుచేతులు పట్టుకొని యెన్నియోసారులు మీ యువరాజు రాయగడు తాతగారితో పారిపోవుచున్నాఁడని మనవిచేసికొన్నాను; నా మాట మీరు చెవినిబడనీయలేదు. రాజుగారియింటినొకర్లు మీరు, మీకు గర్వముబలిసినది, పాముల కు నాలుగేసికాళ్లు మీకు కనఁబడుచుండును! చెదపురుగునకు రెక్కలు వచ్చుట చచ్చుటకొఱకే!"

ప్రతాపాదిత్యుఁడు — "జరిగినదంతయు పూర్తిగాఁ జెప్పుము?"

రుక్మిణి—"చెప్పవలసినది మఱియేమున్నది! యువరాజు వసంతరాయలతో నిన్నరాత్రి పాఱిపోయెను."

ప్రతాపాదిత్యుఁడు—"ఆ యింటికి నిప్పెవ రంటించిరో నీ వెఱుఁగుదువా?"

రుక్మిణి—"మఱియెవరు మీ సీతారాముఁడే! యువ రాజునకును వానికిని పరమమైత్రి; యువరాజునకు వాఁడే సర్వమును,లోకములో వాఁడుతప్ప మఱియెవ్వరును లేరనే

అతని నమ్మకము. ఇది యంతయు సీతారామునిపని. ఆ ముసలి రాజు, సీతారాముఁడు, యువరాజు కలసి యాలోచించి చేసిన పని యిది, అది నేను గట్టిగా చెప్పఁగలను."

కొంతసేపటివఱకు ప్రతాపుఁ డేమియు మాటలాడలేదు, చివరకు, "నీ కిదియంతయు నెట్లు తెలిసినది?" అని యడిగెను.

రుక్మిణి—"అది చెప్పిన లాభములేదు. ఇద్దఱు మనుష్యులను నాకు సహాయమిమ్ము. నేనే స్వయముగఁబోయి యువరాజును వెదకి తీసికొనివత్తును. ఇట్టిపని మీానౌకర్లకుఁ జేతకాదు, వాండ్రు వట్టిమేకలవంటివాండ్రు!"

రుక్మిణికి మనుష్యుల నిచ్చి ప్రతాపాదిత్యుఁడు పహరా వాండ్రపై శిక్షవిధించెను. సభాగృహమునుండి ఒక్కొక్కరు బయటికిఁ బోయిరి. చివరకు రాజును మంత్రియు మిగిలిరి. రాజుగారు తనతో మాటలాడుదురని మంత్రి యనుకొనెను. కాని రాజుగారేమియు ననకుండుట చూచి ఏదో చెప్పవలెనని యుద్దేశించి, "మహారాజా!" అని ప్రారంభించెను. కాని రాజుగా రదివినిపించుకొనకుండుట చూచి మెల్లమెల్లఁగ మంత్రి కూడ బయటికిఁ బోయెను.

ఆనాఁడే సాయంకాలము ఉదయుఁడు పాఱిపోవుటను గూర్చి ప్రతాపుఁ డొక్క జాలరివానినోటివెంట వినెను— పడవెక్కి పోవుచుండ వాఁడు యువరాజును జూచెనఁట. ప్రతాపాదిత్యుఁ డితరులవలనఁగూడ క్రమక్రమముగ నా వార్తయే తెలిసికొనెను. రుక్మిణితోఁగలసివెళ్లియుండినభృత్యులు

వారము దినము లైనతరువాత తిరిగివచ్చి యువరాజును రాయ-గడలోఁ జూచితిమని చెప్పిరి.

ప్రతాపుఁడు—"ఆమె యేదీ?"

భృత్యులు—"ఆమె తిరిగి రాలేదు. అక్కడనే యుండి పోయినది."

అప్పుడు ప్రతాపాదిత్యుఁడు ముక్తియార్ ఖాన్ అను పఠాన్ సేనాపతి నొకనిని బిలిపించి వానితో రహస్యముగ నేదియో చెప్పెను. అతఁ డది విని రాజుగారికి సలాముచేసి సెలవుపుచ్చుకొని వెళ్లి పోయెను.

## ముప్పది రెండవ పరిచ్ఛేదము

ఉదయాదిత్యుఁడు పోవుటనుగూర్చి ప్రతాపాదిత్యుని కంటె రాణికిని విభకను ముందుగనే తెలిసినది. రాజుగారు విని నేమిచేయుదురో యని వారిద్దఱును మిగుల దిగులు చెందు చుండిరి. ప్రతిదినమును నెవరో క్రొత్తగ నాసంగతినే చెప్పవచ్చు చుండిరి, విని నకొలఁది వీరికి భయ మధికమగుచుండెను. ఇట్లొక వారము గడచినది, రాజుగారికి నిశ్చయమైనసంగతి తెలిసినది. కాని రాజుగా రేమియుఁ జేయలేదు; వారికి కోపమున్నట్లు పై కెట్టి నిదర్శనమును లేకుండెను. రాణి మఱి యూరకుండలేక రాజుగారియొద్దకుఁ బోయినది, కాని చాలసేపటివఱకు నుదయునిమాట యడుగుటకు సాహసింపలేదు. రాజుగారుకూడ నామాట యెత్తలేదు. చివఱకు రాణియే మఱి యాగలేక యి ట్లనెను— "ఈ సారికి ఉదయుని క్షమింపుము మహారాజా! నా ప్రార్థనను నిలుపుము. పిల్లవాని నింకను కష్టపెట్టితివన్న నేను విషము తిని ప్రాణత్యాగము చేసెదను."

"నీవు మొదటనే ప్రారంభించినావు—నే నేమియుఁ జేయనే లేదే!" అని చీకాకుపడుచు రాజుగా రనిరి.

రాజుగారిమనస్సు మరల వంకరకావచ్చునని జడిసి ఆవిషయమై మఱి యెట్టి ప్రసంగమును చేయుటకు రాణి సాహ-

సింపలేదు, మెల్లమెల్లఁగ నతిభయముతో బయటికి వెళ్లి పోయినది. ఒకదినము గడచినది, రెండుదినములు గడచినవి మూఁడుదినములు గడచినవి. కాని రాజుగారియుద్దేశమున నెట్టి మార్పును గలిగినట్లు కానరాలేదు. ఇది చూచి విభయు రాణి కొంత కలఁతజెందిరి, కాని ఉదయాదిత్యుఁ డచ్చట లేకుండుటవలన, రాజుగారి మనస్సు కొంత చులకనైనది కాఁబోలునని యూహించిరి.

మనస్సున దిగులులేక రాణి కొన్ని దినములు గడపినది. రామచంద్రరాయలు విభను బంపుమని జాబువ్రాసెనని యింతకుఁ బూర్వమే రాణి విభతో చెప్పినది, ఆమాటయే ఇంట నలుగురకు దెలియఁజేసినది. ఇది వినినప్పటినుండి విభకు మహానందముగ నుండెను. తాను రామమోహనునితోఁ బోక వాని నొంటరిగఁ బంపివేసినప్పటినుండి యామెమనస్సున నెట్టి శాంతియు లేకుండెను. నడుమ నెప్పుడైనను మనస్సునకు కొంత విశ్రాంతికలిగినతోడనే తనలో తాననుకొనుచుండును— "ఆయన యే మనుకొనుచున్నారో కదా! నా యవస్థను ఆయన సరిగా బోధపరచుకొనఁగలిగిరా? ఆయనకు నాపై కోపము వచ్చినది కాఁబోలు? అంతయు నాయనకు బోధపఱచి చెప్పిన నాయన నన్ను క్షమింపరా? ఆహా పరమేశ్వరా, నే నెప్పు డాయనను చూతునో కదా, ఎప్పుఁ డాయనకు నంతయు బోధపఱతునో కదా!" విభ యీ మాటలే వెరుక ముందు లుగ చేయుచు నెల్లప్పుడు ననుకొనుచుండెను. భయ మొక

తాయియై రాత్రింబవళ్లామెమనస్సునం గూర్చుండియుండెను. తల్లి చెప్పినది వినంగానే విభ కపరిమితానందము కలిగినది, మనస్సును నొక్కియుంచుచుండిన భారతము తత్క్షణమే తొలంగి-పోయినది. సిగ్గువిడిచి విభ నవ్వినది, ఏడ్చినది, ఏమియు మాట లాడక తల్లివక్షమున ముఖమును దాంచుకొని చాలసేపు కూర్చుండినది. తల్లి కేడ్పువచ్చినది. భర్త తనవిషయమై పొర పాటుపడలేదని తెలియంగానే విభ కీ ప్రపంచమంతయు నొక నందనవన మని అనిపించినది, తనభర్తహృదయమువంటిహృదయ మెక్కడనో యుండదని తోచినది. ఆయన యనురాగముపై నెంతయో నమ్మక ముదయించినది. 'నాప్రాణేశుని ప్రేమయే ఈ ప్రపంచమున నానిత్యాశ్రయము,'అని యామెకు నమ్మకము పుట్టినది. 'నే నొక కోమలమగు లతవంటిదానను, బలిష్ఠుండగు మహాపురుషునిహస్తమును జుట్టుకొని ఎట్టిభయమును లేక యున్నాను. నా యీ నమ్మకమునుండి, నా యాశ్రయమునుండి, నన్నెవరు వేరుచేయంగలరు?' లోపున నిట్టిభావముండుటచే విభ ఆనందముతో వికసించుచుండెను. మేఘముక్తవిడిచిన శరదా కాశమువలె నామెప్రాణము నిర్మలతయు, విస్తారతయుం గాంచెను. చిన్న పిల్లవలె విభ యిప్పుడు తనచిన్న తమ్ముండు, సమరాదిత్యునితో, నాడుకొన నారంభించెను. చిన్న ముద్దుబిడ్డ వలె అమ్మను ఇదియది యడుగుచుండెను. మునుపు దుఃఖ భరితమై, వాగ్రహితమగు ఛాయవలె, విభ యిటునటు తిరుగు చుండెను—— ఇప్పుడది పోయినది; లోపున ప్రఫుల్లితమగు

చుండెడిహృదయము ఆమె సర్వాంగములయందును పరిస్ఫుట ప్రభాతమువలె ప్రకాశితమగుచుండెను. మునుపటిసంకోచము మునుపటివిచారముపోయి, తల్లితో నేమేమియో మాటలాడు చుండెను. మునుపు ఇట్టిమాటలనుట కెన్నఁడును బుద్ధిపుట్టలేదు, బుద్ధిపుట్టినను సిగ్గువలన అవి యుండలేకపోవును. బిడ్డయానందము చూచి తల్లికెంతయో అనురాగము కలుగుచుండెను. లోలోపున తల్లికి కొంత సంశయము లేకపోలేదు, కాని విభ కనుమానమునకైనను సందీయలేదు. తల్లి యయ్యు నిట్టి నిర్మలమైన నవ్వును ఎట్లు వాడఁగొట్టఁగలదు పాపము! కనుక బిడ్డ ప్రతిదినము తనకనులయెదుటనే నవ్వుచు నాటపాటలను సల్పుచుండ తల్లికూడ నవ్వుచు నాయాటపాటలను విసుగుజెందక చూచుచుండెను.

రాణిమనస్సున కొంచెము భయమును సందేహమును నుండుటచేత నేఁడు రేపనుచు గడపుచున్నదిగాని విభ నత్తవారియింటికిఁ బంపలేకున్నది. ఇట్లు ఒకటిరెండువారములు గడచినవి, ఉదయాదిత్యుని విషయమై యొకవిధముగ నిశ్చింత కలిగెను. విభవిషయమైమాత్ర మేమిచేయవలెనో నిశ్చయించుకొనలేకున్నది ఇట్లు మఱికొన్ని దినములు గడచినవి. ఆలస్యమైనకొలఁది విభ తొందరపడుచున్నది,ఆలస్యమగుచున్న కొలఁది భర్తకంటికి తనయపరాధ మధికమగుచుండునని యామెకుఁ దోఁచుచున్నది. 'ఆయన కబురుపంపినతరువాతఁగూడ నాలస్యమేల! ఒక మా అప్పుడే క్షమించిరి, మరల—'

ఇట్లు మఱికొన్ని రోజులు గడచినవి, విభ యేమియు ననలేదు. తుదకొకనాఁడు మఱి పట్టియుంచుకొనలేక తల్లియొద్దకు వచ్చి తల్లిని కౌఁగిలించుకొని, ఆమెముఖము చూచుచు, "అమ్మా," అని ప్రారంభించినది. "అమ్మా," అనుపదికి తల్లి కంతయు బోధపడినది; విభను రెండుచేతులతోఁ బట్టుకొని, "ఏమి తల్లీ," అన్నది. విభ కొంచెము సేపూరకుండి, "అమ్మా నన్నెపుడు పంపెదవు?" అన్నది. ఈ మాటలు నోటినుండి రాఁగానే విభముఖము సిగ్గుచే ఎఱ్ఱనై పోయినది. తల్లి చిరునవ్వు నవ్వుచు, "ఎక్కడకు విభూ?" అని యడిగినది. విభ మరల, "చెప్పుమమ్మా!" అని తల్లిని వేఁడుకొనుచు నడిగినది.

"మఱికొన్నిరోజు లోర్చియుండుము తల్లీ, త్వరలోనే పంపెదను," అని తల్లియనెను—ఇట్లనుచుండఁగనే ఆమె కనుల వెంట నీళ్లు కారుట మొదలుపెట్టినవి.

## ముప్పది మూఁడవ పరిచ్ఛేదము

ఉదయాదిత్యుఁడు చాలకాలమైనతరువాత మరల రాయగడకు వచ్చెను, కాని మునుపటియానంద మిప్పుడు మఱి పొందలేదు. తాతయ్యచేసినపనికి ఫలితమెట్టిదగునోయను భయము వలన ఉదయాదిత్యునిమనస్సున నెట్టిశాంతియు లేకుండెను. "నాన్న అంతసులభముగా వదలిపెట్టువాఁడు కాఁడు—ఆహా, నే నెట్టి అవలగ్నమందు పుట్టితినో కదా!" అనుకొనుచు యువరాజు కలతఁజెందుచుండెను. ఉదయుఁడు వసంతరాయలకడకుఁ బోయి, "నేను యశోహరునకుఁ బోయెదను తాతయ్యా," అనెను. తాతయ్య ఆ మాట వినిపించుకొనక, నవ్వుచు, పాట మొదలు పెట్టెను. కాని ఉదయుఁ డూరకుండక, ఆ మాటనే మరలమరల ననుచుండుట చూచి తాతయ్యమనస్సునకు కష్టముకల్గినది. పాట నిలిపి వసంతరాయలు, "నేను దగ్గఱనున్న నీకు కష్టమేల?" అని యడిగెను. ఉదయుఁ డాపైని మఱియేమియు ననలేక పోయెను.

ఉదయాదిత్యుఁడు పరధ్యానముగ నుండుటచూచి తాతయ్య అతనికి యానందము కలుగఁజేయవలెనని రాత్రిం బగళ్లు ప్రయత్నము చేయుచుండెను—అప్పు డప్పుడు వీణ వాయించుచుండెను. ఉదయునితోఁ గలసి ఇటునటు తిరుగుటకు పోవుచుండెను. దీనివలన వసంతరాయల రాజ్యకార్యమంతయు

నిలిచిపోయినది. ఉదయాదిత్యుఁడు తనతో నుండునట్లు చేయ లేనేమో యని తాతయ్యకు భయమగుచుండెను. ఉదయుఁడు యశోహరమునకు మరలఁబోవునేమో యని సందేహించి వసంతరాయలు రాత్రింబవళ్లుదయునిపైనుండి కనులు తీయకుండెను.

"ఆదేశమున నుండునది పాషాణహృదయము ని న్నా దేశమునకు తిరిగి పోనీయను తాతా," "అని వసంతుఁడు మాటిమాటికి ననుచుండెను.

కొన్ని దినము లిట్లుండ నుదయునిమనస్సున నుండుభీతి చాల తగ్గిపోయినది. ఇన్నాళ్లైనతరువాత తనకు స్వేచ్ఛ దొర-కినది. తా నిరుకుకొన్న రాతిగోడలు దూరమైనవి, తాతయ్య కోమలహృదయమున బసదొరకినది, ఇప్పుడు తనకాశ్రయమై యున్నది వసంతరాయుని ఆసీమప్రేమ. ఇన్నాళ్లకు నాలుగు వైపులను చెట్లుచేమలు కనఁబడుచుండెను, తలపై నాకాశ-మును చూడఁగలుగుచుండెను, దిగంతములవఱకు వ్యాపించి యున్న యుషారాగము చూడఁగలుగుచుండెను, పక్షుల పాటలువినఁగలుగుచుండెను, దూరమునుండి వచ్చుగాలి యతని సర్వాంగముల సోకుచుండెను, రాత్రి కాఁగానే ఆకాశమున తారామండలము కంటఁబడుచుండెను, విభావరులు జ్యోత్స్నా ప్రవాహమునమునుఁగుచుండెను. ఇక్కడ ఉదయుఁడెక్కడకుఁ బోవలెనన్నఁ బోఁగలఁడు, ఏపనిచేయవలెనన్నఁ చేయఁగలఁడు అతని కిచ్చట నెట్టియడ్డును లేదు.

చిన్నప్పు డుదయాదిత్యుని నెత్తికొనినవార నేకులు దూర-దూరములనుండి అతనిని జూచుటకు వచ్చుచున్నారు. గంగాధరుఁడు వచ్చెను, ఘటిక్ వచ్చెను, హాబీ చాకరీముల్లాతోఁ గలసి వచ్చియుండెను, మథురుఁడు తనముగ్గురు పిల్లలను తీసి-కొనివచ్చియుండెను, పరాణు, హారి—ఇద్దఱన్నదమ్ములును వచ్చిరి, శీతల్‌సర్దారు అయిదుగురు గరిడీవాండ్రతోఁ గలసి ఆటచూపుటకు వచ్చెను—ప్రతిదినమును యువరాజుదర్శన-మునకై ఎవరో కొందఱు వచ్చుచుండిరి. యువరాజు వారి-క్షేమసమాచారములను దెలిసికొని వారి ననేకవిధముల ప్రశ్నించుచు కాలము గడపుచుండెను. ఉదయాదిత్యుఁ డిప్ప-టికిని తమను మఱవకుండుట చూచి వా రమితానందము పొందిరి, మిక్కిలి యాశ్చర్యపడిరి. మథురుఁడు తన పెద్దకొడు-కును కనపఱచుచు, "మహారాజా, మీరు రాయగడుకు వచ్చిన-నాఁడు వీనిపుట్టుక, మీరు వచ్చి వానిని చూచియుంటిరి, తరువాత మీ యాశీర్వాదమువలననే ఈ యిద్దఱును పుట్టిరి," అనెను. ఇట్లని వాండ్రనుదయాదిత్యునికి దగ్గఱగ తీసికొనిపోయి వాండ్ర చేప్రణామముచేయించెను. వాండ్రు యువరాజుపాదము-లకుమ్రొక్కిరి. పరాణ్ వచ్చి, "మీరిక్కడనుండి యశోహరునకు పోవునప్పుడు మీ పడవను నడపినది నేనే మహారాజా," అనెను. "మీ రిక్కడ నుండునప్పు డొకనాఁడు నా లాఠీవిద్య చూచి ఆనందించి మీరు నా కినా మిచ్చితిరి మహారాజా; నేఁడు నా కొడుకులవిద్య మీకు కనఁబఱపవలెనని కోరికగానున్నది

మహాప్రభూ," అనుచు సీతల్ సర్దారు యువరాజునెదుటకు వచ్చి నిలుచుండెను. ఈవిధముగ యువరాజును జూచుటకు రాయగడ ప్రజ ప్రాతఃకాలము మొదలు సాయంకాలమువఱకు గుంపులుగుంపులుగ వచ్చి అందఱును ఒక్కచోట చేరి కబుర్లు చెప్పుకొనుచు మిగుల సంతోషముగ కాలము గడపుచుండిరి.

నలుదిక్కులనునుండు చెట్లు చేమలవలనను, ప్రేమవలనను, ఆనందమువలనను, సంగీతమువలనను, ఉదయాదిత్యుని-దిగులు సహజముగ చాలభాగము తగ్గిపోయినది. "నాన్నకు కోపము రాలేదు కాబోలు! ఆయనకు సంతోషముగ కూడ నుండవచ్చును! లేనియెడల నింతకాలమువఱకు నిట్లూరకుం డునా?" అని యువరాజు కండ్లుమూసికొని తనలోఁ దా నప్పు డప్పు డనుకొనుచుండెను.

కాని యీ మిథ్యానందమువలన మనస్సు ననేకదినములు భ్రమలో నుంచలేకపోయెను. తాతయ్య కేమగునో యనుభయము ఉదయుని వదలలేదు. తాను యశోహరమునకుఁ దిరిగి వెళ్లిపోవుటనుగుఱించి తాతయ్యతోఁ బ్రసంగించుట నిష్ప్రయోజనమనియు, ఆయనతోఁ జెప్పకయే దొంగతనముగ నెప్పుడో పోవలెననియు నిశ్చయించుకొనెను. అట్లు నిశ్చయించు కొనఁగానే ఆ కారాగారము జ్ఞప్తికి వచ్చినది. ఈయానందము, ఈ స్వేచ్ఛ యెక్కడ? ఎన్నడు ఎట్టిమార్పును జెందక ఉక్కిరి బిక్కిరిచేయు ఆ కారాగార మెక్కడ? ఖైదులో గడపిన ప్రతినిమిషమును ఒక్కొక్కసంవత్సరముగ నుండిన దతనికి.

ఆ నిర్జనకారాగార మతనికనులకు కట్టినట్లున్నది. వెలుతురు లేదు, గాలిలేదు, తలుపులు మూసియున్నవి. తలఁచుకొని నంతమాత్రాన దేహము గరిపొడచుచుండెను. ఐన నెన్నఁడో ఒకనాఁడా కారాగారమునకే పోవలెనని నిశ్చయించుకొనెను. ఎన్నిమాఱులు ప్రయత్నించినను, "నేఁడే పోయెదను," అని మాత్రము నిశ్చయించుకొనలేకపోయెను, "ఒకనాఁడు పోయె దను" అనుకొనుచు నిశ్చింతుఁడగుచుండెను.

నేఁడు బృహస్పతివార—వర్జ్యము; నేఁడు పోవుట మంచిదికాదు, రేపు పోయెద...

నేఁడు రోజు బాగుగలేదు; ప్రొద్దుట మొదలు ఒక్క వరుసను చినుకులుపడుచున్నవి, ఆకాశ మగపడుటయే లేదు, పూర్తిగా మేఘాచ్ఛన్నమై యున్నది; ఐనను ఆసాయంకాలము తప్పక రాయగడ విడువవలెనని ఉదయుఁడు నిశ్చయించెను. నేఁడు, ఉదయు డుదయమున గానరాఁగానే తాతయ్య వానిని కౌఁగిలించుకొని, "తాతా రాత్రి నేను కలగంటిని, అది మిక్కిలి పాడుకల—ఆ కల స్పష్టముగ జ్ఞప్తికి రాకున్నది, కాని నీవు నన్ను విడిచిపోవుచున్నావఁట, ఎన్నటికిని మఱి నాకు కనఁబడవట!" అనెను.

ఉదయుఁడు తాతయ్యచేయి పట్టుకొని, "నేను నిన్ను విడిచి పోవచ్చును గాని, తాతయ్యా, ఎన్నఁటికిని కనఁబడ-కుండుట ఎట్లు కాఁగలదు?" అని అనెను.

వసంతరాయలు మఱియొకవైపు చూచుచు, ఏదో

యాలోచించువానివలె, "ఏల కాఁగూడదు, ఇఁక నే నెంత కాలము బ్రతికియుండఁగలను, ముసలివాఁడనై పోతినిగదా!" అనెను.

గతరాత్రి కన్నకల ఇంకను వసంతరాయలమనస్సున ప్రతిబింబించుచుండుటచే నతఁడు పరధ్యానముగ నేదో యాలోచించుచుండెను.

ఉదయుఁడు కొంచెమునే పూరకుండి, "తాతయ్యా, మనకిద్దఱకును మరల నెడఁబాటు వచ్చిన నేమగును?" అనియనెను.

వసంతరాయ లుదయుని భుజముపైఁ జేయివేసి అతనిని దగ్గఱకు లాగుకొనుచు నిట్లనెను—"ఎడఁబా టేల వచ్చును తాతా? నన్ను విడిచిపోకుము నాయనా! ఈ ముసలికాలములో నన్నొంటరిగ వదలిపెట్టకుము తాతా!"

ఉదయునికనులు నీళ్లతో నిండినవి, ఉద్దేశ మింకను దనమనస్సులోనే యుండ తాతయ కెట్లు దానిజాడ దొరికినదో యని ఆశ్చర్యపడుచు నిట్టూర్పువిడిచి, "నేను దగ్గఱ నుండినయెడలనే నీకుఁ గీడు సంభవింపఁగలదు తాతయ్యా!" అనెను.

వసంతరాయలు నవ్వుచు నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను— "ఎట్టికీడు తాతా? ఈ వయస్సున విపత్తునకు జడిసెదనా! మృత్యువుకంటె గొప్పవిపత్తు లేదు కదా! అట్టిమృత్యువుకూడ ఇప్పుడునాకు పోరు గే! అదిసదా నాసమాచారమును కనుఁగొను

చున్నది, దానికి నేను జడువను, అన్ని విపత్తులను దాటి పెద్ద వయస్సు వచ్చువఱకు బ్రతికియుండఁగలిగినవాఁడను నేను. ఱిడ్డుచేరినతరువాత పడవ మునిగిపోయిననను నేమి?"

ఉదయుఁడు నేఁడు దినమంతయు తాతయ్యతోనే యుండెను. రోజంతయు చినుకులు చిటపట పడుచునే యుండెను.

సాయంకాలమయిం చినుకులు కొంచె మాఁగఁగానే ఉదయుఁడు లేచి నిలుచుండెను. "ఎక్కడికి తాతా?" అని వసంతరాయలు తత్క్షణమే అతనిని ప్రశ్నించెను.

"కొంచెము బయట పచారుచేసి వచ్చెదను."

"నేఁడు పోకున్న నేమి తాతా!"

"అట్లనుచున్నావేమి తాతయ్యా?"

"నేఁడు బయటికి బోవద్దు తాతా, నేఁడు నన్ను విడిచి పోకుము!"

"దూరముపోను తాతయ్యా, ఇప్పుడే మరల వచ్చెదను," అనుచు నుదయుఁడు బయటికిఁబోయెను.

ఉదయాదిత్యుఁడు సింహద్వారముకడకు రాఁగానే పహరావాఁడొక డతనినిఁ జూచి, మీతోఁగూడ నన్ను రానిండు మహారాజా," అనెను.

ఉదయాదిత్యుఁడు—"అవసరము లేదు."

పహరా—"మహారాజావారిచేత అస్త్రమేదియు లేదు."

"అస్త్రమేల?" అనుచు యువరాజు బయటికివచ్చెను; ఎదుటనున్న పెద్దబయలు చేరి అచ్చట పచారుచేయ నారంభించెను. క్రమక్రమముగ సంధ్యయై వెలుతురు క్షీణించి చీకటి పడినది. ఎన్నో సంగతులు యువరాజుమనస్సునకు వచ్చుచుండెను. ఉదయుఁడు లక్ష్యహీనమును, ఉద్దేశ్యరహితమును నైన తనజీవితమునుగుఱించి యోచించుచుండెను. ఎట్టిస్థిరతయు లేనియవస్థ అతనిది, ఆ ఉత్తరక్షణమే ఏమైనను కావచ్చును. అతనివయస్సు స్వల్పము; జీవితమంతయు ముందుకే యున్నది; ఎక్కడను ఇల్లువాకిలిలేక, స్థిరమైనసంసారములేక ఎట్లు భవిష్యత్తునంతయు గడఁపగలనోయని యువరాజు తనలోఁ దాననుకొనుచుండెను.

విభమాట యప్పుడు జ్ఞప్తికివచ్చినది—— విభ యిప్పుడెక్కడ నున్నదో కదా? ఇంతకాలమును సుఖసూర్యుఁడామెపై నుదయింపకుండ అడ్డుగ నిలిచియున్నది తానే! ఇప్పుడు విభ సుఖముగ నున్నదా? ఇట్లనుకొనుచు ఉదయుఁడామె నెన్నోమాఱులు తనలో తాను దీవించెను.

గొల్లపిల్లవాండ్రు ఎండవేళఁ గూర్చుండుటకై బయలు నడుమ నొక చెట్లగుంపు యేర్పరుపఁబడియున్నది. అందు రావిచెట్లు, మఱ్ఱిచెట్లు, ఖర్జూరపుచెట్లు, పోకచెట్లు ఉన్నవి. ఉదయుఁడచ్చటికి వచ్చునప్పటికి చీఁకటిపడినది. తాను పాఱిపోవలెనని నిశ్చయించుకొనినదినము నేఁడు. ఆ సంకల్పమునుగుఱించియే ఇప్పు డతఁ డాలోచించుచుండెను. తాను పోయెనను

సంగతి విన్నప్పుడు వసంతరాయ లెట్టియవస్థలోఁ బడునో కదా! తాత గుండెలు బ్రద్దలుచేసికొనును కాబోలు; "హా! తాత నన్ను విడిచి పాఱిపోయెనా!" అని ఎంత దుఃఖముతో నను చుండునో కదా! ఆ ముఖము, ఆ దృశ్యము ఉదయునికి కను లకుఁగట్టినట్లు కనఁబడుచుండెను.

ఆ సమయమున బహుకఠోరస్వరముతో, "ఇదిగో ఇక్కడ! ఇక్కడ! మీ యువరాజు!" అనుచు స్త్రీకంఠ మొకటి వినఁబడెను. దివటీలు చేతఁబుచ్చుకొని సైనికు లిద్దఱు వచ్చి ఉదయాదిత్యుని యెదుట నిలిచిరి. చూచుచుండఁగనే సైనికులసంఖ్య యధికమైనది, వాండ్రు వచ్చి యువరాజును ముట్టడించఁగా ఆ రమణి యువరాజును సమీపించి, "నన్నుఁ బోల్చుకొనఁగలవా? ఇటుచూడుము, ఇటుచూడుము!" అనెను. ఆ దివటీల వెలుఁగున యువరాజునకు రుక్మిణిముఖము కనఁబడి నది. రుక్మిణి ధోరణిచూచి సైనికు లామెను, "దూరముగ నుండుము," అనుచు నదల్చిరి. రుక్మిణి యామాటలు వినిపించు కొనక ఇట్లనసాగెను—"ఇదియంతయు నెవరుచేసిరో యెఱుఁ గుదువా? చేసినది నేను! ఈసైనికుల నందఱను నిచ్చటికి తీసి కొనివచ్చినది యెవరు? నేను! నీకొఱకై నే నెంతో చేసితిని— నీవో......యువరాజా, నీవు వెనుకకుఁదిరిగి నిలుచుంటివి, నావైపు చూడనైన చూడక!" సైనికులు రుక్మిణిని బలవంత ముగ లాగుకొనిపోయిరి. అప్పుడు ముక్తియార్ ఖాన్ యువ రాజునకు సలాముచేయుచు నెదుటికి వచ్చి నిలిచెను. యువరా

జాశ్చర్యపడుచు, "ఏమిసమాచారము ముక్తియార్ ఖాన్?" అని యడిగెను.

"మహారాజా వారి యాజ్ఞను తీసుకొనివచ్చితిని మహాప్రభూ," అని అతివినయముతో ముక్తియార్ ప్రత్యుత్తరమిచ్చెను.

యువరాజు—"రాజావారియాజ్ఞ యేమి?"

మహారాజా వారి స్వహస్తలిఖితపత్ర మొకటి ముక్తియార్ యువరాజుచేతిలోఁ బెట్టెను.

యువరాజా పత్రము జదివి యిట్లనెను—"దీనికొఱ కింతసైన్య మేల? ఆజ్ఞ తెలియఁజేయుచు నా కొకజాబువ్రాసిన నేనే వచ్చియుందునే! నాయంతట నేనే రావలెనని నిశ్చయించుకొంటిని, రాబోవుచుంటిని. అట్లైన నాలస్య మేల? ఇప్పుడే పోదము రండు, ఇప్పుడే యశ్వారునకు బయలుదేరుదము!"

"తత్క్షణమే రాలేను," అని ముక్తియార్ చేతులంజోడించి మనవిచేసికొనెను.

"ఏమి?"

"మహారాజావారియాజ్ఞ మఱియొకటి ఉన్నది, అది పాలింపనిదే రాజాలను."

"ఏ మా యాజ్ఞ?"

"రాయగడప్రభువుపై మహారాజావారు ప్రాణదండము విధించిరి!"

"అబద్ధము, రాజావా రెన్నఁడు నట్టియాజ్ఞ నీయరు."

"అబద్ధముకాదు యువరాజా! మహారాజావారు స్వహస్తముతో వ్రాసియిచ్చినపత్రము నాయొద్దనున్నది."

"నీవు పొరపాటుపడుచున్నావు సేనాపతీ," అనుచు యువరా జత్యాతురముగ ముక్తియార్ ఖాన్ చేతులుపట్టు-కొనెను. "యువరాజు దొరకనిపక్షమున నని రాజావారి యాజ్ఞ—నే నెఱుఁగుదును. నాయంతట నేనే వచ్చుటకు సిద్ధ-ముగా నున్నప్పుడు నీవు చేయవలసిన దేముండును? నన్నిప్పుడే తీసికొనిపొమ్ము, తక్షణమే తీసికొనిపొమ్ము. కాళ్లు, చేతులు కట్టి నన్నిక్షణమే తీసికొనిపొమ్ము, ఆలస్యముచేయకుము."

"నేను పొరపాటుపడలేదు యువరాజా, రాజావారు స్పష్టముగా నాతోఁ జెప్పిరి," అని ముక్తియార్ ఖాన్ జబా బిచ్చెను.

యువరాజు కలతఁజెందుచు నిట్లనెను—"నీవు పొరపాటు పడుచున్నావు, సందేహములేదు. నాన్న యభిప్రాయ మదికాదు. అట్లైన యశ్శోరునకుఁ బోదము రమ్ము. రాజుగారినోట నీకు సరిగాబోధపడునట్లు చెప్పించెదను. నీ వనునదే నాన్న యభి ప్రాయమైనచో ఆ యాజ్ఞ పాలింపవచ్చును."

"క్షమింపుఁడు మహారాజా, మీయాజ్ఞ మన్నింపఁ జాలను."

"ముక్తియార్, నేనొకనాఁడు సింహాసన మెక్కఁబోవు-చున్నాను, ఆ మాట నీవెఱుఁగుదువు, నామాట నిలుపుము, నిన్ను సంతోషపెట్టెదను," అని తడబడుచు యువరాజనెను.

ముక్తియార్ జబాబీయక నిలిచియుండెను.

యువరాజుముఖమున రక్తములేదు, నొసటను చెమట కూడుచుండెను, ముక్తియార్ చేయి గట్టిగాఁ బట్టుకొని అతఁడు "సేనాపతీ, ఆయన పుణ్యాత్ముఁడు, వృద్ధుఁడు, నిరపరాధి; అట్టి వానినిఁ జంపిన నీకు నరకమునసైన స్థానము దొరకదు," అని యనెను.

"యజమానులయాజ్ఞ పాలించుట పాపముకాదు," అన్నాఁడు సేనాపతి.

"అది ధర్మవిరుద్ధము, అట్లుచెప్పు ధర్మశాస్త్రము దొంగ ధర్మశాస్త్రము. పాపపుటాజ్ఞను బాలించుట పాపమని నీవెఱుఁగుదువు ముక్తియార్," అని యువరాజు గొంతెత్తి తీవ్రముగ ననెను.

సేనాపతి ఏమియు జబాబుచెప్పక నిలిచియుండెను.

యువరాజప్పుడు నాలుగుదిక్కుల నొకమాఱు చూచి "అట్లైన నన్ను విడచిపెట్టుము, నేను కోటలోనికిఁ బోయెద నీ సైన్యమును దీసికొని యుద్ధమునకు రమ్ము. యుద్ధమున గెలిచి, ఆ యాజ్ఞను పాలింపుము," అని యనెను.

సేనాపతినోట మాటలేదు. సైనికు లంతకంతకు దగ్గఱకు వచ్చి యువరాజును ముట్టడించిరి. యువరాజునకు నుపాయమేమియుఁ గానరాలేదు, కేవల మసహాయుఁడై ఆ యంధకారమున, "తాతయ్యా జాగ్రత్త!" అని బిగ్గరగ నరచెను. ఆ వనమున కంఠము పుట్టినది, కాని ఆ మాటలు

ఆ పెద్దబయలులోనే హరించిపోయినవి. సైనికులు మఱింత దగ్గఱకువచ్చి యువరాజును బట్టుకొనిరి. ఉదయుఁడు "తాతయ్యా జాగ్రత్త!" అని మఱియొకతూరి కేకవేసెను. ఆ దారినిబోవు బాటసారియొకఁడామాటలు విని, "ఎవరది?" యనుచు దగ్గఱకు వచ్చెను. యువరాజు వానిని చూచి "వెళ్లుము, వెళ్లుము, త్వరగా పఱుగెత్తుకొని కోటలోనికి-పోయి మహారాజుగారిని జాగ్రత్తగ నుండుమనుము," అని తొందరతొందరగఁ జెప్పెను. సైనికు లా బాటసారిని పోనీయక పట్టుకొనియుంచిరి; ఆ మైదానమున పోవుచుండు బాటసారు లెందఱు వాండ్ర కంటఁబడిరో అందఱిని నాసైనికులు పట్టి బంధించిరి.

సైనికులలోఁ గొందఱు ఖైదీగానున్న యువరాజునొద్ద నుండిరి; ముక్తియార్ ఖానును, మిగిలినసైనికులును తమసైనిక-వేషములను విడిచి యస్త్రశస్త్రములను దాఁచి సాధారణ ప్రజలవలె కోటవైపునకు బయలుదేరిరి. రాయగడ కోటకు చూటికిమించినద్వారములు—ఆ ద్వారములలోనుండి సైనికు లాకోటలోఁ బ్రవేశించిరి.

అప్పుడు వసంతరాయలు సంధ్యారాధనచేయు చున్నాఁడు. ఆవల, రాజప్రాసాదదేవాలయమున సంధ్యపూజ జరుగుచున్నది, శంఖనాదము వినవచ్చుచున్నది, జేగంట మ్రోఁగుచున్నది.

ఆ రాజప్రాసాదము అంతపెద్దదయినను నెట్టికోలాహల మును లేక నిశ్శబ్దముగ నున్నది. వసంతరాయలు తనయనుచరుల కిచ్చిన స్వాధీనతను బట్టి నౌకర్లలో చాలమంది ఆ సమయమున తమతమ యిచ్ఛానుసారము బయటికిఁబోయియుండిరి, మఱి కొంతసేపటికిగాని తిరిగి రారు.

వసంతరాయల యారాధన యింకను బూర్తికాలేదు, నడుమ నకస్మాత్తుగ నా పూజాగృహమున ముక్తియార్ ఖాన్ కనఁబడెను. వసంతరాయలు కొంచె మసంతుష్టుఁడగుచు, "ఈగదిలోనికి రాఁగూడదు ఖాన్‌సాహేబ్, పూజ ముగించి నేనిప్పుడే బయటికివచ్చెదను," అన్నాఁడు.

ముక్తియార్ బయటికిఁబోయి గడపదగ్గఱనే నిలిచి యుండెను. పూజకాఁగానే వసంతరాయలు బయటికివచ్చి ముక్తియార్ వీపుపైఁ జేయివైచి, "క్షేమమా, ఖాన్‌సాహేబ్?" అని యడిగెను.

ముక్తియార్ సలాముచేయుచు అతిక్షిప్తముగా "చిత్తము!" అన్నాఁడు.

"భోజనమైనదా?"

"చిత్తము."

"అట్లైన నీ బస కేర్పాటుచేసివచ్చెదను."

"అవసరములేదు, మహారాజా! పని పూర్తిచేసికొని ఇప్పుడే తిరిగిపోవలెను."

"అట్లు వీలులేదు ఖాన్‌సాహేబ్ ! నేను వదలను, ఈరాత్రి నీవిక్కడ నాయతిథిగా నుండక తీరదు."

"వీలులేదు మహారాజా, తత్క్షణమే పోవలెను."

"ముఖ్యమైనపని ఏదో ఉండవలె నట్లైనను? ప్రతాపుఁడు క్షేమమా?"

"మహారాజావారు క్షేమముగానే యున్నారు."

"అంతతొందరగాఁ బోవలసినంత జరూరుపని యేమున్నది చెప్పుము ఖాన్‌సాహేబ్; నాకుఁ గొంచెము కలతగలుగు చున్నది—ప్రతాపుఁ డేదైన నాపదలో నున్నాఁడా?"

"అట్టి దేమియులేదు. మహారాజావారి యాజ్ఞను పాలించుటకై యిక్కడికి వచ్చితిని."

వసంతరాయలు—"ఏమి ఆ యాజ్ఞ?"

ముక్తియార్‌ఖా నొక యాజ్ఞాపత్రమును పైకిఁదీసి వసంతరాయలచేతి కిచ్చెను. వసంతరాయలు దానిని దీపము కడకుఁ దీసికొనిపోయి చదువసాగెను. అంతలో సైనికు లంద-ఱును ఒక్కొక్కరుగ ద్వారముదగ్గఱకు వచ్చిచేరిరి.

ఆ పత్రమును జదివి వసంతరాయలు ముక్తియార్ దగ్గఱకు మెల్లమెల్లఁగవచ్చి, "ఇది ప్రతాపుఁడు వ్రాసినదేనా?" అని యడిగెను.

"చిత్తము!"

"ఇది ప్రతాపుఁడు తనచేతితోఁ దానే వ్రాసెనా?" అని వసంతరాయలు మరల నడిగెను.

"అది రాజావారు స్వహస్తముతో వ్రాసినదే, మహా-రాజా!"

వసంతరాయలు కనుల నీరుపెట్టుకొని, "వానిని నేను నాచేతులతో పెంచి పెద్దవానినిజేసితిని ఖాన్‌సాహేబ్!" అనెను, కొంతసే పూరకుండి మరల ప్రారంభించెను—"ప్రతాపుఁడు చంటివాఁడుగానున్నప్పుడు వాని రేయింబవలు నెత్తుకొనియుండువాఁడను, ఒక్కక్షణమైనను నన్ను విడుచు-వాఁడుకాఁడు. ఆప్రతాపుఁడే పెద్దవాఁడైనాఁడు, అతనికిఁ బెండ్లి చేసితిని, సింహాసనముపైఁ గూర్చుండబెట్టితిని. వానిబిడ్డలను ఆడించుచు నెత్తుకొని ముద్దులాడుచుంటిని—అట్టి ప్రతాపుఁడీపత్రమును తనచేతితో తానే వ్రాసెనా ఖాన్‌సాహేబ్!"

ముక్తియార్ కనులు తడిసియుండెను, ముఖము వాల్చుకొని ఊరక నిలిచియుండెను.

"తాత యెక్కడ? ఎక్కడ ఉదయాదిత్యుఁడు?" అని వసంతరాయ లడిగెను.

"యువరాజా వారు బందీగానున్నారు, మహారాజా-వారియొద్దకు విచారణకైఁ గొనిపోవుచున్నాము," అని ముక్తియా రనెను.

"ఉదయుఁడు బందీగానున్నాఁడా? బందీగానున్నాఁడా ఖాన్‌సాహేబ్? తాత నొకమాఱు చూడనిమ్ము."

"లేదు మహాప్రభూ, రాజావారి సెలవులేదు."

వసంతరాయలు కనుల నీరుకార్చుచు ముక్తియార్ చేతులుపట్టుకొని, "ఒక్కమాఱు తాతను చూడనీయవా ఖాఁసాహేబ్?" అని వేడుకొనెను.

"ఆజ్ఞనుపాలించు భృత్యుఁడనుమాత్రమే నేను."

వసంతరాయలు పెద్దనిట్టూర్పు విడిచి, "దాక్షిణ్య మెవ్వఱకును లేదీప్రపంచములో! సాహేబ్ రమ్ము, వచ్చి నీ ఆజ్ఞాపాలన చేసికొనుము," అనెను.

ముక్తియార్ ఖాన్ వంగి భూమిని తాకి సలాముచేసి చేతులుజోడించి, "నన్ను క్షమింపుఁడు మహారాజా, నేను నా ప్రభువు నాజ్ఞ పాలించుచున్నాను, ఇందు నాదోషమేమియు లేదు," అనెను.

వసంతరాయలు—"నీతప్పేమున్నది ఖాఁసాహేబ్? నీ దేమియు తప్పులేదే! ఇందు నిన్ను క్షమింపవలసినట్టి దేదియు లేదు." ఇట్లనుచు ముక్తియార్ దగ్గఱకుఁబోయి అతనిని కౌఁగి లించుకొనెను.

వసంతరాయలు—"ప్రతాపునితో నేనతనిని దీవించుచు ప్రాణత్యాగముచేసితినని చెప్పుము సాహేబ్. ఉదయుని భారమంతయు నీమీఁదనే విడిచిపెట్టి చనిపోవుచున్నాను, జ్ఞాపక ముంచుకొనుము ఖాఁసాహేబ్. ఉదయుఁడు నిరపరాధి. అన్యాయపువిచారణవలన వానికి కష్ట మధికము కాకుండచేయు భారము నీదే!"

ఇట్లని వసంతరాయలు కనులుమూసికొని ఇష్టదేవతను

స్మరించుచు తలవాల్చుకొనెను; "ఇక నీపని చేసికొనుము," అని ముక్తియారుతో ననుచు జపకావళిము త్రిప్పసాగెను.

ముక్తియార్ ఖాన్ "అబ్దుల్!" అని పిలువఁగానే వరతీసినకత్తి చేతఁబుచ్చుకొని అబ్దుల్ వచ్చెను. ముక్తియార్ ముఖ మటుత్రిప్పుకొని బయటికిపోయెను, ఆ పరక్షణమే అబ్దుల్ రక్తము కారుచుండు కత్తితో బయటికి వచ్చెను. గది రక్తధారతో నిండుచుండెను.

# ముప్పది నాల్గవ పరిచ్ఛేదము

సైన్యములో చాలభాగము రాయగడలోనే యుంచి ఉదయాదిత్యుని దీసికొని ముక్తియార్ ఖాన్ యశోహరమునకు బయలుదేరెను, దారిలో రెండురోజులును ఉదయాదిత్యుఁ డెట్టియాహారమును తాకలేదు. ఎవరితో నొక్కమాట యనలేదు, ఏదియో యాలోచించుచు కదలక మెదలక రాతి విగ్రహామువలె నుండెను, అతని కనులకు నిద్రలేదు, రెప్ప-పాటులేదు, అశ్రువులులేవు, దృష్టిలేదు; కేవల మేదియో ఆలోచనతప్ప మఱియేమియు నతనిలో గానరాలేదు. ఉదయుఁడు పడవనెక్కెను, పడవలోనుండి వంగి నీటి వైపు చూచుచున్నాఁడు, పడవ నడుచుచున్నది, తెడ్లశబ్దము వినఁబడుచున్నది, నీళ్లకలకల చెవిని బడుచున్నది,—ఐనను, నేమియు నతనికి వినఁబడలేదు, ఏమియు నతనికిఁ గనఁబడలేదు, ఏమియో యాలోచించుచున్నాఁడు. రాత్రియైనది, ఆకాశము నక్షత్రములతో నిండినది, పడవను కట్టిపెట్టి పడవవాండ్రందఱును నిద్రించుచున్నారు. నీటిశబ్దముమాత్రము వినఁబడు-చున్నది, చిన్నచిన్నఅలలువచ్చి పడవకుఁ దగులుచున్నవి. ఎదుటను బహుదూరమువఱకు వ్యాపించియున్న తెల్లని యిసుకదిబ్బలవంక తదేకదృష్టిగ నుదయుఁడు చూచుచు నేదియో యాలోచించుచున్నాఁడు.

తెల్లవాఱుజామున పడవవాండ్రు లేచి, పడవను విప్పిరి. చల్లనిగాలి వీచుచున్నది, తూర్పున నరుణోదయ మగు చున్నది, యువరాజేదియో యాలోచించుచున్నాఁడు.

మూఁడవనాఁడు ఉదయాదిత్యుని కనులవెంట బొట బొట నీరుకారుట మొదలుపెట్టినది; ముఖమును జేతులపై నానుకొని అతఁడు నీటిని చూచుచున్నాఁడు, ఉండియుండి యాకాశమువంక ముఖము నెత్తుచున్నాఁడు. పడవ నడచుచున్నది. ఒడ్డుననుండు చెట్లు కండ్ల యెదుట మేఘములవలె పఱుగెత్తి పోవుచున్నవి, ఉదయుని నేత్రములనుండి యశ్రువులు సహస్ర ధారలై కారుచున్నవి.

చాలసేపైనతరువాత సమయముచూచుకొని ముక్తి-యార్ ఖాన్ మిగుల దుఃఖితుఁడగుచు యువరాజు నొద్దకు వచ్చి, అతివిచారముతో, "ఏమాలోచించుచున్నారు యువ-రాజా?" అని యడిగెను. యువరాజు జాలికపడి, నిశ్చేష్టుఁడై ముక్తియార్ వైపు చూడసాగెను. కొంతసేపు చూచుచుండఁగా వానిముఖమునఁ గొంత జాలియున్నదని తోఁచి యువరాజిట్లనెను.

"భూమిపై జన్మమెత్తి నేను జేసినమహాకార్యమేమి యని ఆలోచించుచున్నాను ముక్తియార్! నావలన నెంత ప్రమాదము సంభవించినది! ఆహా, పరమేశ్వరా! బలము లేనివారీలోకములో నేలపుట్టెదరో కదా! తమస్వశక్తివలన నీలోకములో బ్రతికియుండలేక, అడుగడుగునకు నితరుల

సహాయముపై నాధారపడునట్టివారివలన నీ పృథ్వికి జరుగు నుపకారమేమి? అట్టివా రెవరిని నాశ్రయించుకొని బ్రతుకం గోరుచుందురో వారినే ముంచివేయుదురు; ప్రతికార్యమున-కును నడ్డుపడుచుందురు, తమంతట తాము నిలుచుండలేరు, ఇతరులనెత్తిపై బరువై కూర్చుందురు—నేను బలహీనుడను, పిరికిపెద్దమ్మను, భగవంతుడు నన్ను ప్రాణములతో నుంచి, ఈ ప్రపంచమున కానందకరుడును, ఈలోకమున నెట్టివారి కైనను సాయముచేయగలవానిని నామూలమున చంపివేసెను. నా కిక నేమియు నక్కరలేదు తండ్రీ, నే నీలోకమునుండి సెలవు పుచ్చుకొనెదను.”

ఉదయాదిత్యుని ఖైదీవలెఁ దీసికొనివచ్చి ప్రతాపా-దిత్యునియెదుట నిలుచుండఁబెట్టిరి. ప్రతాపుఁ డతనిని అంతః పురమున నొకగదిలోనికి గొనిపోయెను. తలుపుకు గడియపెట్టి, ప్రతాపుఁ డుదయునిదగ్గఱకు రాఁగానే ఉదయునిశరీరమున గగుర్పాటుపట్టినది, అతనికి పట్టరానియసహ్యము కలిగినది. అతనికి దేహమంతయు ముడుచుకొని పోవుచున్నట్లైనది. అతఁడు తండ్రిముఖమువైపు చూడలేకుండెను.

“నీకుఁ దగినశిక్ష యేది?” అని నిశ్చలభావముతోఁ దండ్రి యడిగెను.

“తమరాజ్ఞాపించునదే!” అని అతిశాంతముగ నుదయుఁ డుత్తరమిచ్చెను.

ప్రతాపుఁడు—“నా రాజ్యమున కర్హుఁడవుకావు నీవు!”

ఉదయుఁడు, "కాదు మహారాజా, మీరాజ్యమునకుఁ దగిన యోగ్యత నాకు లేదు. మీరాజ్యము నా కక్కర లేదు. మీసింహాసనమునుండి నన్ను విముక్తునిఁ జేయుఁడు—ఇదియే నా ప్రార్థన"

ప్రతాపుఁడు కోరునదికూడ నదియే, కావున, "నీ వన్నది నిజముగా నీమనస్సున నుండుకోరిక యని నాకుఁ దెలియు టెట్లు?" అని యడిగెను.

ఉదయాదిత్యుఁడు—"నేను బలహీనుఁడనై జన్మ మొందితిని నిజమే, కాని నేటివఱకు స్వలాభమునకై యెన్నఁడును నొక్కయబద్ధమైన నాడలేదు. మీకు నామాటయందు నమ్మకము లేనిచో కాళిగుడికి పోయి తల్లి చరణములు ముట్టు-కొని శపథము చేసెదను—నాకు మీరాజ్యమున సూదిమొన యంత భూమియైన నక్కరలేదు, మీరాజ్యమున కుత్తరాధి-కారి సమరాదిత్యుఁడే!"

"అట్లైన నీవు కోరున దేమి?"

"నేనుకోరునది మఱియేమియు లేదు మహారాజా—నన్ను కేవలము దొడ్డిలోపెట్టియుంచిన పశువువలె ఇనుప కమ్ములనడుమ ఖైదీగా నుంపకుఁడు. నన్ను విడిచిపెట్టుఁడు, నేనిప్పుడే కాశికిఁ బోయెద. ఇదికాక నాప్రార్థన మఱియొకటి యున్నది—నాకుఁ గొంచెము డబ్బిచ్చినయెడల నేను కాశిలో తాతయ్యపేర నొకయతిథిశాలయును, ఒకదేవాలయమును కట్టించెదను."

ప్రతాపుఁడు—"దానికి నేను సమ్మతించుచున్నాను."

ఆనాఁడే ఉదయుఁడు కాళిమందిరమునకుఁబోయి ప్రతాపాదిత్యునిసముఖమున నిట్లు శపథముచేసెను—"తల్లీ, కాళీ, నీపాదములుముట్టుకొని శపథముచేయుచున్నాను, నీవు నాకు సాక్షివి. నేను బ్రతికియున్నన్నాళ్లెన్నఁడును యశోహరమున రవంతమేరయైనను నాది యనను. యశోహరసింహాసనమున నేను గూర్చుండను, యశోహరరాజదండము నేను స్పృశింపను. అట్లెన్నఁడైన నేను చేయఁగోరినచో తాతయ్యహత్యపాపము నామెడను చుట్టుకొనును గాక!" ఈమాట లనఁగానే ఉదయుని దేహమున పులకరింపు పుట్టినది.

ఉదయుఁడు కాశికిఁబోవుచున్నాఁడని వినినతోడనే రాణి కొడుకునొద్దకువచ్చి, "నాయనా ఉదయా, నన్నుఁగూడ నీతో కాశికి తీసికొనిపొమ్ము," అనెను.

ఉదయాదిత్యుఁడు—అట్లంటివేమమ్మా! నీకు సమరాదిత్యుఁడున్నాడు, నీసంసారమంతయు నిక్కడనే యున్నది. నీ విక్కడనుండి వెడలిపోయినయెడల యశోహరరాజ్యలక్ష్మి కూడ నాక్షణమే యంతర్ధానమగును.

రాణి—"నీ వింతచిన్నవయస్సున సంసారము విడిచి వెళ్లిపోవుచున్నప్పుడు నే నెట్టిమనస్సుతో నివియన్నియు ననుభవించుచు నుండఁగలను. నీవు రాజ్యము, సంసారము వదలి సన్న్యాసివై వెడలిపోవుచున్నావు, అక్కడ నీకు సంరక్షణ

చేయువారెవరు నాయనా? నీతండ్రి మనస్సు తెలియదు, అట్లని నన్నుకూడ నిన్ను విడచియుండుమనిన నేనెట్లుండఁగలను?"

రాణికి బిడ్డలలో నందరికంటెను ఉదయునియెడల నధికానురాగము, ఉదయునిమాట తలఁచుకొని గుండె బ్రద్దలైన శ్లేద్వసాగెను.

ఉదయుఁడు కంట నీరుపెట్టుకొనుచు తల్లి చేయి పట్టుకొని, "అమ్మా నీ వెఱుఁగుదువు, ఇక్కడనుండినయెడల నేను అడుగడుగునకు భయపడుచుండవలెను, కనుక నే నిక్కడ నుండి వెళ్లి, ఎట్టియాపదయు భయమును లేక విశ్వేశ్వరుని చరణముల కడ నుందును, నీవు దుఃఖింపకు మమ్మా, అని యనెను.

ఉదయుఁడు విభయొద్దకుఁబోయి ఇట్లనెను—"నేను కాశికిపోకమునుపు నిన్ను సుఖవంతురాలుగఁ జేయవలెనని యున్నది చెల్లి. నిన్ను నేనే స్వయముగ తీసికొనిపోయి నీ యత్తవారియింట దిగఁబెట్టిపోయెద—ఇదియొక్కటే నాకోరిక!"

"తాతయ్య క్షేమమా?" అని విభ యడిగినది.

"తాతయ్య క్షేమముగా నున్నాఁడు" అని యనుచు నుదయుఁడు తత్క్షణమే అచ్చటనుండి వెళ్లిపోయెను.

## ముప్పది యైదవ పరిచ్ఛేదము

విభయు నుదయాదిత్యుఁడును బ్రయాణమగుచున్నారు. విభ తల్లిని గట్టిగా కౌఁగిలించుకొని యేడ్చుచున్నది. అంతఃపురమున నెక్కడెక్కడ నున్నవారందఱునువచ్చి అత్తవారి యింటికిఁ బోవుచున్నవిభను జూచి పలువిధముల నుపదేశము లీయసాగిరి.

తల్లి యుదయుని లోనికిఁబిలిచి, "నాయనా చెల్లెలను తీసికొని వెళ్లుచున్నావుగాని వారు విభ నాదరింపక కష్టపెట్టెద రేమో!"

ఉదయుఁ డులికిపడి, "కష్టపెట్టెదరేల అమ్మా? ఏల యాదరింపరు?" అని యడిగెను.

రాణి—"వారికి విభపైఁ గోపమువచ్చిన దేమో!"

ఉదయుఁడు—"లే దమ్మా, ఎంతమాత్ర మట్లు కానేరదు. విభ చిన్నపిల్ల. దానిపై నెవరు కోపముంచుకొనఁగలరమ్మా?"

రాణి—"జాగ్రత్తగ నాలోచించి తీసికొని వెళ్లుము నాయనా, వా రామెయెడల నిర్దయులై యున్నయెడల, విభ మఱి బ్రతుకదు."

ఈమాటలు ఉదయాదిత్యునిమనస్సున దిగులు పుట్టించినవి. ఎవరైన విభను కష్టపెట్టఁగలరన్నమాట ఇంతకుముం

చెన్నఁడు నదయునకు దట్టలేదు. ఉదయుఁడు తనప్రాయ-శ్చిత్తము పూర్తియైపోయినదని యనుకొనుచుండెను, కాని అది యింకను పూర్తికాలేదని ఇప్పుడు తెలియుచున్నది. విభను తా నాశ్రయము చేసికొనియుండెను, దీనికి ఫలస్వరూపముగ విభయదృష్టమున నేమున్నదో కదా!

బయలు దేరిపోవుసమయాన ఇద్దఱును తల్లిదగ్గఱకు వచ్చి ప్రణామముచేసిరి. ప్రయాణమునకు విఘ్నములగునేమో యని తల్లి కంటనీరు రానీయలేదు, వారు గడపదాటఁగానే ఆమె నేలఁబడి దొరలుచు నేడ్వ నారంభించినది. ఉదయుఁడును విభయు తండ్రికి ప్రణామము చేసిరి, ఇంటనుండు పెద్దలందఱకును ప్రణామముచేసిరి. ఉదయుఁడు సమరాదిత్యుని నెత్తుకొని ముద్దుపెట్టుకొని, "నీవు సింహాసనమున కూర్చుండఁబోవు -చున్నావు, కాని దానిశాపము నిన్ను తాకకపోవునుగాక!" అని తనలోతాను తమ్ముని దీవించెను. అక్కడనుండునౌకర్లు చాకర్లు—అందఱకును నుదయాదిత్యునియెడల చాల నను-రాగము, వాండ్రొక్కొక్కరువచ్చి ఉదయునకు ప్రణామము చేసి ఏడ్వసాగిరి. చివరకు వారిద్దఱును ఆలయమునకుఁబోయి తల్లికి మ్రొక్కి బయలుదేరిరి.

శోకము, విపత్తు, దౌర్జన్యము వీనికి రంగస్థలమగు ప్రదేశము వెనుకపడుచున్నది, కారాగారము వెనుకనుండిపోయినది. జన్మ మున్నంతవఱ కెన్నఁడును ఈ యింటికి మఱిరానని ఉదయుఁడు తనలోఁదాను నిశ్చయించుకొనెను. వెనుక కొక్కమాఱు తిరిగి

చూచెను—రక్తపిపాసతో నిండియుండు రాజభవనము దైత్యుని వలె తలయెత్తుకొని నిలిచియున్నది, దానిలోనున్నది పాషాణ హృదయము, కుట్ర, నిరంకుశాధిపత్యము, రక్తలాలస, దుర్బలులను పీడించుట, అసహాయుల నేడ్పించుట—ఇవియన్నియు వెనుక నుండిపోయినవి. ముందుననుండు అనంతస్వాధీనత, ప్రకృతియందుండు అకలంకసౌందర్యము, మానవహృదయమున సహజముగనుండు కోమలత, ప్రేమ—ఇవియన్నియు నతని నాలింగనముచేయఁగోరి చేతులు చాచుచున్నవి. అప్పుడే ప్రాతఃకాలమైనది. నది తూర్పుయొడ్డుననుండు వనమధ్యమున నుండి సూర్యకిరణములు పొడుచుకొనివచ్చుచున్నవి; వృక్ష శిఖరములపై ప్రాతఃకాలపు సువర్ణరాగము పడుచున్నది. గ్రామ వాసులు లేచి తమతమపనులపై నిటునటు పోవుచున్నారు. పడవవాండ్రు ఉల్లాసముతో పాటలుపాడుచు, పడవనువిప్పి తెరచాప నెత్తిరి. ప్రకృతియొక్క ఆ విమల ప్రశాంత పవిత్ర ప్రభాత-ముఖశ్రీని చూచి ఉదయునిహృదయము పక్షులతోఁ గలసి స్వేచ్ఛాగానము సలుప నారంభించినది. "జన్మజన్మములకు స్వతంత్రుఁడనై ప్రకృతియొక్క పవిత్రతలోను, నవీనతలోను విహరించుచుండఁ గలభాగ్యమే నేనుకోరుచున్నది," అని ఉదయుఁడు తనలో దాననుకొనుచున్నాఁడు.

పడవ నడచుచున్నది. పడవవాండ్ర పాటలును, నీటి కలకలను వినుచు నిద్దఱును బ్రయాణముచేయుచున్నారు. ఉషఃకాంతివలె నానందము విభహృదయము నాక్రమించు

చున్నది, అరుణదీప్తితో కనులును ముఖమును నింపుచున్నవి. ఇన్నాళ్లకు దుఃస్వప్నము చెదరి తెలివివచ్చినదానివలె విభ కనఁబడుచున్నది.

విభ ప్రయాణమయి పోవుచున్నది—ఎవనియొద్దకు పోవుచున్నది? ఎవ రామెను బిలుచుచున్నారు? అనంతప్రేమ ఆమెను పిలుచుచున్నది. పక్షిపిల్లవలె ఆమె రెక్కలుముడుచుకొని ఆ యనంతప్రేమలో నెట్టిచింతయు లేక సుఖముగా నుండును. ఎటుచూచినను విభకు నేఁడు కనఁబడునది ప్రేమ సముద్రమే! విభను దగ్గఱఁగూర్చుండఁబెట్టుకొని ఉదయుఁడు నీటికలకలవంటిమృదుస్వరముతో నెన్నియో కథ లామెకు చెప్పుచున్నాఁడు, ఏదివినిన నదియే ఆనందదాయకముగ నున్నది, విభకు.

పడవ రామచంద్ర రాయలరాజ్యమునఁ బ్రవేశించి ప్రయాణముచేయుచున్నది. నలుదిక్కులను జూచుచుండు విభమనస్సున నెన్నడు ననుభవింపని యానంద ముదయించుచున్నది. ఎటువైపుచూచినను ఏమి శోభ! ఆ కుటీరములును మనుష్యులును విభకంటఁబడుచుండ అచ్చటి ప్రజలందరు నెంతయో సుఖముగ నున్నారని యామెకు తోచుచున్నది. ఆ కనఁబడువారిని పిలిచి రాజుగారినిగుఱించి యడుగవలెనని విభకుఁ గోరికపుట్టుచున్నది. ఆ రాజ్యపుప్రజలు కనఁబడఁగానే ఆమె మనస్సున నపూర్వ ప్రేమభావ మొకటి పుట్టుచున్నది, కనఁబడువారందరు కడుమంచివారని ఆమెకు తోఁచుచున్నది.

నిరుపేదలవలె కనబడువాండ్రు, ముష్టివాండ్రు అక్కడక్కడ కనఁబడుచున్నారు. విభ వాండ్రనుజూచి, "పాపము వాండ్ర కీదశ యేలనో కదా!" అనుకొనుచు దుఃఖించుచుండెను; "నే నంతఃపురములోనికి బోయి వీండ్ర పిలిపించి, వీండ్ర దుఃఖము తొలఁగు నేర్పాట్లు చేయించెదను," అని తనలో తా ననుకొను చుండెను. ఆమెకు వాండ్రందఱును తనవారని తోఁచుచున్నది. ఆ రాజ్యమున దారిద్ర్యము, దుఃఖము యుండుట చూచి యామె సహింపలేకున్నది. ఆ ప్రజ లామెకడకు వచ్చి ఆమెను, "అమ్మా" అని తనను పిలువవలెనని ఆమెకు కోరిక పుట్టుచున్నది. వారు తమతమకష్టములను నామెతో చెప్పుకొనిన నామె వానినన్నిటిని తొలఁగించును.

రాజధానికి సమీపముననున్న గ్రామమున నుదయుఁడు పడవను నిలిపెను. తనరాకను దెలియఁజేయుచు మనుష్యు నొకనిని రాజప్రాసాదమునకుఁ బంపినచో వా రుచితమర్యాదలను జేసి రాజప్రాసాదమునకు తమ్ముఁ గొనిపోయెదరని ఉదయుని నమ్మకము. పడవ నాపునప్పటికి సాయంకాలమైపోయినది, మఱునాఁ డుదయమే సమాచారము తెలియఁజేయవలెనని ఉదయుఁడు నిశ్చయించుకొనెను.

## ముప్పది యారవ పరిచ్ఛేదము

ఆప్రాంతమున నుండు ప్రజలందఱు నానాఁడు తొందరగ పనిమీఁద నిటునటు తిరుగుచున్నట్లు కనఁబడుచుండెను. బాజా బజంత్రీలతో నూర నేదియో యుత్సవము జరుగుచున్నట్లుండెను. విభలోఁ బుట్టుచున్న యానందము ఆవాద్యములు వినగానే పొంగి పైకివచ్చుచుండెను. ఈ యానందము అన్నయ్యకడ బయలుపడునేమోయని ఎంతో ప్రయత్నముచేసి నవ్వును గూడ నాపుకొనుచుండెను. ఉత్సవచిహ్నములుచూచి సమాచార మేమియో కనుఁగొనవలెనని ఉదయుఁడు నదియొడ్డున నడచుచు ఊరిలోనికి బయలుదేరెను.

కొంతసే పైనతరువాత ఒడ్డునుండి యెవఁడో, "ఎవరి దా పడవ?" అని యడిగెను. ఉదయుని భటుఁడు పడవమీఁద నుండి వానినిజూచి "ఎవ రది, రామమోహనుఁడా? రమ్ము, రమ్ము!" అనెను. రామమోహనుఁడు తొందరతొందరగ పడవ లోనికి వచ్చెను. విభ యొకతెయే పడవలో గూర్చుండియుండెను, వానిని జూచినతోడనే ఆమె యానందము పొంగి పొరలి వచ్చినది, పట్టలేనియుల్లాసముతో, "మోహన్" అని యామె యన్నది.

రామమోహనుఁడు—"అమ్మా!"

నవ్వుచు ఆనందముతోఁ బరిపూర్ణతపొందిన విభముఖ-

మును చూచుచు చాలసేపట్లు నిలిచియుండి చివరకు మోహ-నుఁడు, "నీవు వచ్చితివా తల్లీ!" అని యనెను.

"వచ్చితిని మోహన్! ఇంతలో మహారాజువారికి నా రాకపోట తెలిసినదా? నీవు నన్నుఁదీసికొనిపోవుటకు వచ్చి-తివా?" అని విభ యడిగెను.

"అంత తొందరపడకు మమ్మా, నేఁడుకాదు మఱియొక-నాఁడు నిన్ను కొనిపోయెదను," అని మోహనుఁ డనెను.

రామమోహనుని ధోరణివలన విభముఖము హఠాత్తుగ వాడినది. "నేఁడేల పోఁగూడదు మోహన్?" అని ఆమె యడిగెను.

మోహనుఁడు—"నేఁడు ప్రొద్దుపోయినది, నేఁడు పోవద్దమ్మా!"

"ఏమిజరిగినది మోహన్ నిజముగా చెప్పుము," అని కలతజెందుచు విభ యడిగినది.

మోహనుఁ దూరకుండ లేకపోయెను—దాఁచియుంచు కొను స్వభావముకాదు వానిది. ఏడ్చుచు వాఁడక్కడనే చతికిలఁ బడిపోయి యిట్లనెను—"నీ రాజ్యములో నేఁడు నీకు స్థానము లే దమ్మా! నీరాజప్రాసాదమున నీ కిల్లులేదు తల్లీ! రాజుగారికి నేఁడు వివాహము!"

విభముఖమున రక్తములేదు, కాళ్లుచేతులు చల్లఁబడి పోయినవి. రామమోహనుఁ డేడ్చుచు ఉండియుండి మాట లాడుచుండెను—"నీబిడ్డఁ డీ యధముఁడు నిన్ను బిలువవచ్చి

నప్పుడు నీ వేలవచ్చితివి కావు తల్లీ ? అప్పుడు నీ మనస్సు జాయిఁరై యుండెను. నీవు నన్ను తిరుగఁగొట్టితివి. రాజుగారికి నాముఖము చూపింపలేకపోతిని, నాగుండె బ్రద్దలైపోయినది. ఐనను, నీవు నాతల్లివి. నీకు విరుద్ధముఁగ నొక్కమాటగ్రైనను చెప్పలేకపోతిని.”

విభ తెలివితప్పి పడిపోయినది. రామమోహనుఁడు పరుగెత్తుకొనిపోయి నీళ్లు తెచ్చి ఆమెముఖముపైఁ జల్లెను. కొంతసేపటికి తెలివివచ్చి విభ లేచి కూర్చుండినది. ఒక్కదెబ్బతో నామె ప్రపంచమంతయు ముక్కలై పడినది. భర్తరాజ్యముచేరి, భర్తరాజధానిలో బ్రవేశించి, తృషార్తహృదయముతో రాజద్వారమునకువచ్చినప్పటికి ఆమె యాశయంతయు మరీచికవలె మాయమైనది.

“మోహన్, ఆయన నన్ను రమ్మని కబురుపంపిరే! నేనంతగా నాలస్యము చేయలేదే!” అని దుఃఖముతో విభ యడిగెను.

“ఆలస్యమైనది, సందేహమేల తల్లీ ?”

“నన్ను మఱితీక్షమింపరా?” అని కలతజెందుచు నడిగినది విభ.

“క్షమించు టేది మఱి,” అని మోహనుఁ డనెను.

“నే నాయన నొకమాఱు చూచి వచ్చెదను మోహన్.” అని అనుచు విభ వెక్కివెక్కి యేడ్వసాగెను.

“నేఁడు వద్దుతల్లీ!” అనుచు మోహనుఁడు కనులు తుడుచుకొనసాగెను.

"లేదు మోహన్, నేను నేఁడే ఒక్కమాఱు చూచి వచ్చెదను."

"యువరాజు గ్రామమునుండి తిరిగిరానిమ్ము."

"లేదు మోహన్ నేనిప్పుడే ఒకమాఱు వెళ్లివచ్చెదను" ఉదయాదిత్యుఁ డిది వినినచో చెల్లెల కవమాన మగునని భయపడి ఆమెను బోనీయఁడేమో యని విభ యోచించెను.

"అట్లైన నొకపల్లకీ తెప్పించెద నుండుమమ్మా," అని మోహానుఁ డనెను.

"పల్లకీ యేల? నేను రాణినైనచో గదా పల్లకీ అవసర మగుటకు? నే నొక సామాన్యస్త్రీవలె వెళ్లెదను, ఒకబిచ్చపు-దానివలె పోఁగలదను—నాకు పల్లకీ యవసరములేదు," అని విభ యన్నది.

"నాలో ప్రాణ మున్నంతవఱకు నే నట్టిదిచూచి భరింప-లేనమ్మా," అన్నాఁడు మోహానుఁడు.

విభ మిక్కిలి జాలిఘొల్పెడు స్వరముతో, "నీకాళ్లు పట్టుకొనెదను, నా కడ్డురాకు మోహన్, ఆలస్యమైపోవు చున్నది," అని వానిని వేడుకొనెను.

"అట్లే కానిమ్మమ్మా!" అనుచు మోహానుఁడు దుఃఖ-ముతో నొప్పుకొనెను.

విభ సామాన్యస్త్రీవేషముతో పడవ దిగినది. పడవవాం

ద్రదిచూచి ఆశ్చర్యపడుచు, "ఇదియేమి మహారాణీ! ఇట్టి దుస్తులతో నెక్కడికి పోవుచున్నావమ్మా?" అని యడిగిరి.

"ఈ రాజ్యము తల్లిదే! తనరాజ్యములో ఎచ్చటి కైనను, ఏవేషముతోనైనను పోవచ్చును కదా!" అని మోహానుఁ డుత్తరమిచ్చెను.

భృత్యు లడ్డుపెట్టుచుండిరి కాని మోహానుఁడు వాండ్ర నందఱును వారించెను.

## ముప్పది యేడవ పరిచ్ఛేదము

ఎటుచూచినను జనసమూహములు! ఇంతకుముం దెన్నఁడైన నిట్లు అందఱియెదుట కనఁబడవలసివచ్చినచో విభ సిగ్గుచే ప్రాణములను విడిచియుండును, కాని నేఁ డామెకంటి కేదియు గానరాకున్నది. ఏకొంచె మామె కనుల కగపడు- చుండెనో అది యామెకు మిథ్య యనిపించుచున్నది; కోలా హలముతోనిండిన అచ్చటి జనసమ్మర్దము స్వప్నదృశ్యమని ఆమెకు తోచుచున్నది. కనఁబడునదెల్ల శూన్యము! నాలుగు వైపులను జనులమూక, అన్నివైపులను కలరవము—అంతే! దేనికిని నెట్టియర్థమును లేదు.

ఆ జనసమూహములోనుండి త్రోసికొని విభ రాజద్వా రముకడవచ్చి చేరుకొనెను. అక్కడి ద్వారపాలకుఁ డొకఁడు ఆమెను జేయిపట్టుకొని బయటికి త్రోసివేయగా నామె వెనుక- నుండుమనుష్యులమీద పడిపోయినది; సిగ్గువలన నామె ప్రాణములు సగము పోయినవి, ముసుఁగు జారిపోయినది, ఆ ముసుగు నామె తత్క్షణమే మరల మీఁదికి లాగుకొనినది. ముందునఁ బోవుచుండు రామమోహనుఁడు వెనుకకుఁ దిరిగి, రెప్పపాటులో నంతయు తెలిసికొని, ద్వారపాలకునివైపు కండ్లెఱ్ఱఁజేసి చూచెను. ఆ సమీపమున నిలిచియున్న ఫర్- నాఁడిజ్ అచ్చటికి వచ్చి వానికిఁ దగినకట్నమిచ్చెను. విభ

యితరదాసదాసీలవలె ప్రాసాదమునఁ బ్రవేశించినది—ఎవ్వరును నామెకు తగినమర్యాద చేయలేదు.

ఒకగదిలో రాజుగారును రమాబాయియు గూర్చుండి యుండిరి. విభ ఆ గదిలోఁ బ్రవేశించి రాజుముఖముచూచి ఆయనపాదములకడ నేలపైఁబడెను. రాజు తడఁబడుచు నిలిచి "ఎవరే నీవు? బిచ్చపుదానవా—బిచ్చముకావలెనా నీకు?" అని యడిగెను.

విభ వాల్చియున్న ముఖమునెత్తి, అశ్రువులతోనిండిన నేత్రములతో, "లేదు, మహారాజా, నా సర్వమును దానము చేయుటకు నేనువచ్చితిని, నిన్ను పరహస్తముల కొప్పఁజెప్పి సెలవు తీసికొనిపోవలెనని వచ్చితిని," అని యనెను.

రామమోహనుఁ డదిభరించి యూరకుండలేక దగ్గఱకు వచ్చి, "ఈమె మీరాణి మహారాజా, యశోహరపుర రాజకుమారి యీమె!" అనెను.

నిద్రానిమగ్నమై రామచంద్రునిలోనున్నమన స్సులికి-పడి లేచినది—కాని రమాబాయి తక్షణమే నవ్వి రామచంద్రుని-వంక జూచుచు, "ఏమిది, అన్నగారు మతి యక్కఱలేదా?" అని అతికఠోరస్వరముతో నడిగెను.

రామచంద్రునిహృదయమున కొంచెము దయపుట్టు-చుండెను, ఐనను రమాబాయిమాట వినఁగానే అతినిర్దయునివలె నవ్వసాగెను—విభ కిప్పుడు దయచూపినచో నలుగురును తన్నుఁజూచి నవ్వుదురని రాజావారు భయపడిరి.

విభ నెత్తిపై పిడుగుపడినది. ఆమె కండ్లు మూసికొని, "తల్లి, వసుంధరా, నీవు రెండుభాగములై నన్ను నీగర్భమందు దాఁచుకొనుము," అని తనలోఁదాను ప్రార్థించినది. కనులు తెఱచి నాలుగువైపులను జూచినది, అసహాయురాలగు నామె రామమోహనునికంట పడినది.

రామమోహనుఁ డాక్షణమే రమాయియొద్దకుఁ బరు-గెత్తికొనిపోయి వానిని మెడపట్టి బయటికి గెంటెను.

"నాయెదుటనే ఇంతదౌర్జన్యము చేయుచున్నావా?" అని రాజుగారు క్రోధముతో ననిరి.

"ఔను మహారాజా, నేను దౌర్జన్యము కనపరచితిని మీరాణిని, నా తల్లిని, అతఁ డవమానించినాఁడు—వాని తల గొరిగించి సున్నముబొట్లుపెట్టి, ఊరేగించి, వానిని యూరి నుండి వెడలగొట్టకపోయినయెడల నా పేరు రామమోహన్ కాదు మహారాజా!" అన్నాఁడు మోహన్.

రామచంద్రుఁడు మోహను నదల్చుచు,"ఎవరు నా రాణి, ఈమె యెవరో నేనెఱుఁగను!" అని యనెను.

విభముఖము నల్లనైపోయినది, ఆమె వణఁకుచు నోట చీరచెంగు కుక్కుకొన్నది, మతితప్పి నేలఁబడినది.

విభకు తెలివిరాఁగానే రామమోహనుఁడు చేతులు జోడించి రాజుగారితో నిట్లనెను—"మహారాజా, ఇప్పటికి నాలుగుతరములఁబట్టి మేము మీ సేవచేయుచున్నాము. చిన్నప్పుడు నిన్నెత్తుకొనుచుంటిని, సంరక్షణచేసితిని. నేడు

నాతల్లిని, మహాలక్ష్మిని, నీ వవమానపరచితివి, నీరాజ్యలక్ష్మిని తరుమగొట్టితివి. నేఁడు నేనుఁగూడ నీచాకిరీ విడిచి పోవుచున్నాను. మా తల్లి సేవ చేయుచు కాలము గడుపుకొనెదను; బిచ్చమెత్తుకొని కాలక్షేపముచేసెదనుగాని నీయింటినీడనైనను మఱిత్రొక్కను." ఇట్లనుచు రామచంద్రునకుఁ బ్రణామముచేసి విభతో "అమ్మా ఇఁక రమ్ము! తత్క్షణమే బయలుదేరిపోదము; ఇక్కడ నిఁక నొక్కనిమిషమైన నుండరాదు," అనెను. అని విభను బట్టుకొని బయటికి తీసికొనివచ్చెను. విభకు మతిపోయిం- నది. బయటనుండు పల్లకీలలో నొకదానిలో విభనుగూర్చుండఁ బెట్టి మోహనుఁడా మెను పడవయొద్దకు తీసికొనివచ్చెను.

విభ ఉదయాదిత్యునితోఁగలసి కాశికి వెళ్లిపోయినది. అక్కడ దానధ్యానములు చేయుచు దేవసేవచేయుచు, భ్రాతృసేవచేయుచు కాలము గడపుచుండెను. బ్రతికియు- న్నంతకాలము రామమోహనుఁడు వారితోఁ గలసియే యుండెను. సీతారాముఁడుకూడ సపరివారముగ కాశికి వచ్చి ఉదయునాశ్రమమునందే యుండెను.

చెన్నపురి. వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1951

## నవలలు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| సీతారామము | ... ... | 1 | 4 |
| సుజనరంజని | ... ... | 1 | 0 |
| విజ్జలదేవి | ... ... | 1 | 8 |
| ఉన్మాదిని | ... ... | 0 | 6 |
| రాధారాణి | ... ... | 0 | 6 |
| దుర్గేశనందని | ... ... | 1 | 0 |
| లక్షణ | ... ... | 0 | 12 |
| లీల | ... ... | 0 | 6 |
| కోవలన్ కన్నకి | ... ... | 0 | 12 |
| వీరబాల | ... ... | 0 | 8 |
| ఆనందమఠ | ... ... | 1 | 12 |
| లాలాబాయి | ... ... | 0 | 8 |
| ఆంధ్రరాష్ట్రము | ... ... | 1 | 8 |
| సౌందర్యలలిక | ... ... | 2 | 0 |
| రోషినార, చరిత్రవిషయికమగు నవల | ... | 0 | 12 |
| బాలాదిత్య (చరిత్రాత్మకమగు నవల) | ... | 3 | 0 |
| దేశభక్తుడు | ... ... | 1 | 0 |
| శంభుతో నొకనాటిసహవాసము | ... | 0 | 4 |
| చంద్రగుప్తుడు | ... ... | 2 | 8 |
| నీతిసింధువు | ... ... | 1 | 0 |
| వనజాక్షి | ... ... | 1 | 0 |
| స్వప్నయాత్ర | ... ... | 0 | 12 |
| ముగ్గురుమూర్తులు | ... ... | 2 | 8 |
| ప్రేమాగ్రణి | ... ... | 1 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.

# విశ్వభారతి గ్రంథమాల

**రవీంద్రనాథ ఠాకూర్ రచన:**

పడవమునక (నవల 560 పుటలు.)

| | | | | |
|---|---|---|---|---|
| అట్టబైండు - గ్లేజుకాగితం 560 పుటలు | | 5 | 0 | 0 |
| ,, 1-భాగం 280 ,, | | 2 | 8 | 0 |
| ,, 2-భాగం 280 ,, | | 2 | 8 | 0 |
| ఇంటాబయట | నవల ... | 4 | 0 | 0 |
| ప్రాయశ్చిత్తము | ,, ... | 3 | 0 | 0 |
| గృహప్రవేశం | నాటకం ... | 1 | 0 | 0 |
| పోస్టాఫీస్ | ,, ... | 0 | 12 | 0 |
| కథాగుచ్ఛము | మొదటిభాగం ... | 2 | 8 | 0 |
| కథాగుచ్ఛము | రెండవభాగం ... | 2 | 8 | 0 |
| కథాగుచ్ఛము | మూడవభాగం ... | 2 | 8 | 0 |
| ,, | ,, ప్రథమఖండం | 1 | 4 | 0 |
| ,, | ,, ద్వితీయఖండం | 1 | 4 | 0 |
| కథాగుచ్ఛము | నాల్గవభాగం ... | 2 | 0 | 0 |

**నిరుపమాదేవి రచన:**

| | | | | |
|---|---|---|---|---|
| అన్నపూర్ణమందిరము | నవల ... | 3 | 0 | 0 |

**మారిస్ మేతర్‌లింక్:**

(నోబెల్ ప్రైజుపొందిన బెల్జియం దేశపు కవి)

| | | | | |
|---|---|---|---|---|
| స్టిల్‌మాంద్ మాజిస్ట్రేట్—నాటకం | ... | 1 | 8 | 0 |

**శరత్‌చంద్ర చట్టోపాధ్యాయ:**

| | | | | |
|---|---|---|---|---|
| చిన్నక్క | ... | 0 | 8 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292 ఎస్ప్లనేడ్, మద్రాసు—1